*Issued on 31—10—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

*SATURDAY, 3rd DECEMBER, 1955.*

VOLUME XII — No. 3.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL
1956
*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Saturday, the 3rd December* 1955.

The House met in the Assembly Hall, Kurnool, at eleven of the Clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## QUESTIONS AND ANSWERS.

### *Short Notice Starred Questions.*

Pay of village officers in the estates taken over by the Government.

120-A.

(Put by S. RANGANATHA MUDALIAR).

*365-C. Q.—SRI R. B. RAMAKRISHNA RAJU:-Will the Hon. the Minister for Revenue be pleased to state whether the Government have decided to enhance the pay of village officers in the estates taken over by the Government and when the effect will be given to the order?

THE HON. SRI K. CHANDRAMOULI:—

The proposal to enhance the pay of village officers in the estates taken over by the Government to the level of ryotwari scales is under the consideration of the Government. It will be given effect to as soon as a decision is taken in the matter by the Government.

SRI S. RANGANATHA MUDALIAR:—Will the salary proposed to be paid to these village officers be the same as that given to the village officers in the ryotwari villages?

THE HON. SRI K. CHANDRAMOULI:—After reorganisation and recognition of the clubbing of villages they would get what the other village officers get. The Government's intention is to bring them to the level of the Government scales.

SRI S. RANGANATHA MUDALIAR:--Will the salary be paid with effect from the date of taking over the estate by the Government?

THE HON. SRI K. CHANDRAMOULI:—ఆలోచిస్తామని చెప్పాను గదా. సాధ్యమైనంతవరకు ఆలోచించి న్యాయము చేయాలనే ప్రభుత్వము అనుకుంటున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ ఆలోచన ఎప్పుడు పూర్తిఅవుతుంది ? కనీసము రాబోయే బడ్జటు సమావేశములోపలనైనా పూర్తిఅవుతుందా ? కారణమేమిటంటే, రాబోయే బడ్జటులో దీన్ని provide చేయాలి గనుక అప్పటికైనా పూర్తిఅవుతుందో లేదోనని అడుగుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI:—అదే, ఆలోచిస్తామని చెప్పాను. చేసే ఆలోచన, చక్కగా చేయాలనివున్నది. కాబట్టి సాధ్యమైనంత తొందరలో చేయాలనిగాని, అన్యాయము చేయాలని కాదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :—మంత్రిగారికి యీ విషయములో అన్యాయము చేయాలనే ఆలోచన యింతవరకు కలగలేదని అనుకుంటున్నాను. అందువల్ల రాబోయే బడ్జటులో provide చేయటానికి వీలుగా, ఆ ఆలోచన పూర్తిచేయటానికి ప్రయత్నిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అదేగదా చెప్పాను. సాధ్యమైనంత త్వరలోనే పూర్తిచేయాలని అనుకుంటున్నాము.

Sri P. VENKATASUBBAYYA :—జీతాల విషయములో ప్రస్తుతము రైతువారీ ఏరియాలలో ఎంతెంత యిస్తున్నారో, ఎస్టేటు యేరియాలలో ఎంతెంత యిస్తున్నారో సెలవిస్తారా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—

రైతువారీ ఏరియాలో :

| | |
|---|---|
| విలేజి హెడ్మనుకు | రు. 17/- |
| కరణమునకు | రు. 18/- |
| నౌకర్లకు | రు. 18/- |

ప్రొప్రైటరీ ఏరియాలో

| | |
|---|---|
| విలేజి హెడ్మనుకు | రు. 11/- |
| కరణముకు | రు. 11/- |
| నాకర్లకు | రు. 9/- |

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ప్రస్తుతము పది కొండు రూపాయల జీతము యిచ్చేవారికి జీతాలు పెంచుతామని అంటున్నారు. అసలు, జీతము అనేదిలేకుండానే, గ్రామములలో రైతులమీద ఆధారపడివుండే వుద్యోగస్థులు వుంటున్నారు. ఈ విషయము అనేకసార్లు ప్రభుత్వముయొక్క దృష్టికి గూడ తేబండిది. కాబట్టి యీ విషయములో తక్షణము ఆలోచించి, అటువంటి వాళ్లకు అందరితోబాటు జీతాలు యివ్వటానికి ప్రభుత్వం ఆలోచనచేస్తుందా ? తరువాత యీ గ్రామోద్యోగస్థులకు D. A కూడ ఎంతెంత యిస్తున్నారో, అదిగూడ చెబుతారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అసలు జీతాలు అనేదేలేకుండా వున్నవారు కొంతమంది నెల్లూరుజిల్లాలోనూ, చిత్తూరుజిల్లాలోనూ వున్నారు. వారికిమాత్రం వారికి దగ్గరవున్న proprietory areas లో ఎట్లాయిస్తున్నారో ఆ విధంగా జీతాలు యివ్వవలసిందిగా ప్రభుత్వం శాంక్షను చేశారు.

D. A. ఎట్లా యిస్తున్నారంటే :

రైతువారీ ఏరియాలో :

| | |
|---|---|
| విలేజి హెడ్మనుకు | రు. 3/- |
| కరణముకు | రు. 5/- |
| నాకర్లకు | రు. 7/- |

ప్రొప్రైటరీ ఏరియాలో :

| | |
|---|---|
| విలేజి హెడ్మనుకు | రు. 3/- |
| కరణమునకు | రు. 5/- |
| నాకర్లకు | రు. 7/- |

SRI N. C. SESHADRI :—ఇదివరలో ప్రభుత్వం స్వాధీనము చేసుకున్న ఎస్టేటు గ్రామాలలో విలేజిహెడ్మను కరణము, యీ యిద్దరిపనులు Tribune officer అనేపేరుతో ఒక్కరే నిర్వహిస్తున్నారు. ఆ గ్రామాలలో యిదివరకు మాదిరి

కాకుండా రైత్వారీ గ్రామాలలోవుంటే మాదిరి యిద్దరిని వేరు వేరుగా ఏర్పాటు చేస్తారా ? లేకపోతే యీ యిద్దరి duties న్ను dual గా నెరవేర్చటానికి ఒక్కరినే ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—రైత్వారీ గ్రామాలలో మాదిరి ఏర్పాటు చేయాలిఅంటే, ఆ గ్రామాలలో వచ్చేరాబడి, విస్తీర్ణము వగైరాలు అన్నిటినీ లెక్కలోకి తీసుకుని, వాటికి కావలసిన staff ను వేస్తున్నారు.

SRI SHAIK MOULA SAHEB :—అధ్యక్షా, ఇప్పుడు కొన్ని గ్రామాలలో కలువాయి పద్ధతి అని పెట్టారు. ఈ పద్ధతివల్ల రైతులు పన్ను కట్ట టానికి పడే బాధేకాకుండా, గ్రామాధికార్లకు ధాన్యము కొలవలసిన వస్తున్నది. అటువంటి పద్ధతిని తీసివేసి, యితర గ్రామోద్యోగస్థులతో బాటు జీతాలు యిచ్చే సదుపాయము ప్రభుత్వం చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అటువంటి పద్ధతి లేకుండా, గ్రామాధికార్లకందరికీ జీతాలు అన్నిచోట్లను ఒకే మాదిరి యివ్వాలని ప్రభుత్వం ఆలోచన చేస్తున్నది.

SRI P. NARASIMHAPPA RAO :—రాష్ట్రములలో అన్ని చోట్లను ప్రస్తుతము గ్రామోద్యోగస్థులకు యిచ్చే జీతాలు చాలవనే agitation వుంటున్నది. వీరికి జీతాల స్కేల్సు హెచ్చుచేసి, యిప్పుడు యిచ్చే జీతములకన్న హెచ్చు చేయ టానికి ప్రభుత్వానికి ఆలోచన వున్నదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ముందు ఒక్కవిధమైన ప్రశ్న అడగండి. దాని సంగతి తరువాత చెబుతాను.

MR. SPEAKER :—ప్రశ్న అంతా జీతాలను గురించేనండి.

SRI M. NAGI REDDI :—గ్రామోద్యోగస్థులకందరికీ ఒకటే scale వుండేటట్లు ఎప్పుడు చేస్తారండి ?

THE HON. SRI K.CHANDRAMOULI :—ఆలోచిస్తున్నామని చెప్పానండి.

SRI T. PAPA RAO :—అధ్యక్షా, గ్రామోద్యోగస్థులకు 30 రూపాయ లకు తక్కువకాకుండా జీతాలు యివ్వాలని, అంతకు తక్కువగా వుండకూడదని యిదివరకే కాంగ్రెసు తీర్మానము వున్నది. వీరి భృతికి అయ్యే ఖర్చు ఒకొక్క

N.G.O. కు అయ్యేదానికన్న తక్కువ వుండదు. అందువల్ల రాష్ట్రములో రైతు వారి యేరియాలలోను, ప్రొప్రైటరీ ఎస్టేటు యేరియాలలోను అందరికీ కలిసి ఒకటే పద్ధతిలో జీతాలకు హెచ్చు స్కేల్సు పెట్టుతూ, హెచ్చు జీతాలు యివ్వటానికి ప్రభుత్వం ఆలోచిస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇంతవరకు అడిగిన ప్రశ్న గ్రామోద్యోగస్థులకు అన్నిచోట్ల ఒకేపద్ధతిలో సమానంగా జీతాలు యిస్తారా అని. ఆ విషయములో ప్రభుత్వం ఆలోచిస్తున్నదని చెప్పాను.

SRI N. P. CHENGALRAYA NAIDU :—ఎస్టేట్ గ్రామాలలో వుండే గ్రామోద్యోగస్థులకు కొన్ని మామూళ్లు వున్నవి. అవి అట్లాగే allow చేస్తారా ? లేకపోతే ప్రభుత్వ కార్యాలయాలలో పనిచేసే వుద్యోగస్థులకు చేసినట్లుగా, వారినీకూడా నిలిపివేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆ position లేకుండా వారందరిని Governmental level లోకి తీసుకొని వద్దామని ప్రభుత్వము ఆలోచిస్తున్నది.

SRI G. NARASIMHA MURTHI :—Estates abolition తేదీ లగాయతు ఎస్టేటు గ్రామాలలో పనిచేసే గ్రామోద్యోగస్థులకు అదివరకున్న సదుపాయాలు తగ్గిపోయినవి. అందువల్ల వారికి యివ్వబోయే జీతాలు retrospective effect తో యిచ్చేటట్లుగా ప్రభుత్వం ఏర్పాటు చేయటానికి ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఎస్టేటు గ్రామాలలో పనిచేసే వారందరికి ఒకే మాదిరి స్థితిలేదు. చాలా ఒడుదుడుకులతో వున్నది. కాబట్టి అటువంటి వారి విషయము అంతా సమానపాయలోకి తీసుకునిరావాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. రైతువారి ఏరియాలో పనిచేసే వారితోబాటు సమాన పాయలో వుండేటట్లుగానే ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

SRI G. RAMU NAIDU :—అధ్యక్షా, గ్రామోద్యోగస్థులకు వారసత్వపు హక్కు ఒక విధముగా వున్నదని, దాని విషయములో ఆలోచించటానికి మద్రాసు ప్రభుత్వము ఒక కమిటీ ద్వారా ఆలోచిస్తున్నది. అటువంటి ఆలోచన ఏదైనా యిక్కడ మన ప్రభుత్వానికికూడ వున్నదా ?

THE HON SRI K. CHANDRAMOULI :—ఈ ప్రభుత్వానికి అటువంటి ఆలోచన లేదు.

[3rd December 1955

SRI P. GUNNIAH :—అధ్యక్షా, village officers తో సహా పని చేయటానికి villages లో village police అని ఒక బిళ్ల యిప్పటికి నాలుగైదు సంవత్సరాలుగా తలార్లకు యిచ్చారు. Local police కు యిచ్చేమాదిరిగా వాళ్లకుగూడా uniform తప్పనిసరిగా సప్లయి చేయటానికి ప్రభుత్వం ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ రోజున వేసిన ప్రశ్న జీతాలకు సంబంధించినది. Uniform కు సంబంధించినది కాదు.

*Auction of lanka lands.*

120-B.

*368-B. Q.—SRI PILLALAMARRI VENKATESWARLU:—Will the Hon. the Minister for Revenue be pleased to state whether the Government have decided to auction all lanka lands ?

THE HON. SRI K. CHANDRAMOULI:—

The Government have directed that every year, one-third of the total extent of lankas available in a village shall be reserved for sale by public auction and that the remaining two-thirds disposed of by lease without auction in favour of Co-operative Societies.

MR. SPEAKER.—It has already been answered at great length. Only one supplementary question is allowed.

SRI PILLALAMARRI VENKATESWARLU :—One-third auction చేస్తామని మంత్రిగారు చెప్పారు. Auction వేయటములో ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యమేమిటి ?

THE HON. SRI K. CHANDRAMOULI :—పశువుల మేతకొరకని ఇదివరకే చెప్పాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—పశువుల మేతకొరకని మంత్రిగారు చెబుతున్నారే, అయితే auction వేసినభూమిలో కేవలం పశువుల మేతకొరకే పెంచాలా ? ఇంక ఏదీగూడా వేసి పెంచగూడదా ?

3rd December 1955]

THE HON. SRI K. CHANDRAMOULI :—పశువుల మేతకు క్రింద వచ్చేవి, పెసర, జొన్నవగైరాలు. అవిఅన్నీ పశువుల మేతక్రిందకు వస్తాయి. వాటితో బాటు పంటగూడ వస్తుంది.

MR. SPEAKER : One-third for co-operative societies ; one-third for grazing and one-third by auction.

SRI PRAGADA KOTAIAH :—Only one question Sir.

MR. SPEAKER : The question was answered at great length the other day. I should not have allowed this question in the list ; but by mistake it has come up in the agenda.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ఒకే ప్రాంతములో నాలుగైదు కో-ఆపరేటివ్ సొసైటీలు ఉంటున్నప్పుడు, యీ నాలుగైదింటికి సమానంగా యివ్వటానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ? లేకపోతే, ఒకదానికిఇచ్చి, మిగతావాటికి ఇవ్వకుండా నిరాకరించడమనేది ఉంటుందా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—సొసైటీలుఅన్నీ సక్రమంగా పనిచేస్తూఉంటే, అన్నిటినీ సమానంగాచూడాలనే ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యము. అయితే ఒకసొసైటీలో ఎక్కువమంది ఉండవచ్చు. మరొకసొసైటీలో తక్కువమంది వుండవచ్చు. అటువంటి సందర్భాలలో మెంబర్లనుబట్టి proportionate -గా యివ్వడం న్యాయముఅని ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యము.

## STARRED QUESTIONS.

### *Technical Committee on Ramapadasagar Project.*

122—

* 151 Q.—SRI M. RAJESWARA RAO :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Government have appointed a Technical Committee to investigate the " Ramapadasagar Project " ;

(b) if so, whether the Committee has submitted any preliminary report to the Government ; and

(c) whether the Government have recommended this project to the Planning Commission for inclusion in the Second Five Year Plan ?

[3rd December 1955

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) No.

(b) Does not arise.

(c) The Government have recommended a project on Godavari.

SRI G. YELLAMANDA REDDI :—ఇదివరకు ప్రకాశము పంతులు గారి మంత్రివర్గములో ఇలాంటివి investigate చేయాలని, కొంతడబ్బు కేటాయించినట్లుకూడా తెలిసింది. అది ఎంతవరకునిజమో తెలియజేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—రామపాదసాగరం ప్రాజెక్టును investigate చేస్తున్నారా లేదా అని అడిగితే లేదనిచెప్పాను. తరువాత ప్రకాశంపంతులుగారి మంత్రివర్గములో చరిత్రఅంతా చెప్పమంటే అదివేరే సంగతి. అడిగిన ప్రశ్నకుమాత్రమే సమాధానము చెప్పినాను. రామపాదసాగరు ప్రాజెక్టు investigation లో లేదు.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, గోదావరినదిమీద ఏదైనా ప్రాజెక్టు investigate చేశారా అంటే, yes అని సమాధానముచెప్పారు. దానివివరాలు తెలియజేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—రామపాదసాగరు ప్రాజెక్టు పోలవరముదగ్గర కట్టాలనుకునే సంగతి అందరికీ తెలిసిందే. అందులో technical difficulties చాలా ఉన్నాయని చెప్పారు. ఖర్చు ఎక్కువఅవుతుంది. అది నిలుస్తుందో లేదో అనికూడా ఇంజనీరులు చెప్పడమువల్ల, పోనీ శబరిమీద ప్రాజెక్టు కట్టడానికి వీలవుతుందో examine చేయమని చెప్పాము. Examine చేసి ఈ రామపాదసాగర్ అనేపేరుతోనే ఇప్పూరుదగ్గర ప్రాజెక్టుకట్టితే చాలా తక్కువ ఖర్చుతోనే అవుతుందనీ ఉపయోగంగా ఉంటుందనీ ఇంజనీరులు చెప్పారు. ఆ ఇప్పూరు ప్రాజెక్టును investigate చేయడానికిగాను staffను sanction చేశాము. ఎల్లమందా రెడ్డిగారు అడిగింది ఆవిషయమే అనుకొంటాను. క్రిందటి మంత్రివర్గములో ఇప్పూరుదగ్గర ప్రాజెక్టును investigate చేయడానికిగాను 93 వేలు రూపాయలు ఖర్చుపెట్టి staff ను వేశారు. వారుఅప్పుడే పనిచేస్తున్నారు. Final report మనకు ఇంతవరకురాలేదు. రాకపోయినా ఒకపర్యాయము గోదావరిపైన ఒకప్రాజెక్టును ఇండియా ప్రభుత్వమువారికీ ప్లానింగుకమిషనువారికీ recommend చేసినాము. ఇంతలోపల విశాలాంధ్రవస్తే ఇచ్చంపల్లి మొదలైన ప్రాజెక్టులు ఉన్నాయి. అవన్నీ examine చేయడానికి వీలవుతుంది. అప్పుడు ఇప్పూరు ప్రాజెక్టు drop కావచ్చును.

3rd December 1955]

Sri G. NARASHIMHA MURTHY :—ఇప్పుడు ప్రాజెక్టు కట్టడానికి కనీసం 10, 12 సంవత్సరములుఅయినా పడుతుంది గనుక ఈ లోపల ధవళేశ్వరము ఆనకట్ట తలుపులు ఒకఅడుగుఎత్తు చేసి నీరు అధికంగా సప్లయిచేయడానికి ఏమైనా ప్రయత్నము చేస్తున్నారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు ప్రాజెక్టుకు దీనికి సంబంధములేదు. ఇదీ, అదీకూడా separate గా examine చేయవచ్చును. ఇప్పుడు ప్రాజెక్టుకట్టినాకూడా ధవళేశ్వరము ప్రాజెక్టుతలుపులు ఒక అడుగుఎత్తు చేయడము అనేది feasible అవునాలేదా దానివల్ల ఎంతవరకు ఉపయోగము ఉంటుంది అనేది separate గా examine చేయవచ్చును. దానికి దీనికి relation ఏమీలేదు.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, ఇప్పుడు ప్రాజెక్టు వెనుకకుపోవచ్చును అని మంత్రిగారు చెబుతున్నారు, అసలు గోదావరిమీద ఇదివరకు ఉన్నటువంటి వరద కంట్రోలుబోర్డువారు అక్కడ ఏ ప్రాజెక్టు కట్టాలనిచెప్పి సూచించారు ? దానిపైన రాష్ట్ర వరదల కంట్రోలుబోర్డుల యొక్క అభిప్రాయము ఏమిటి ? వాటి విషయంలో ప్రభుత్వము తీసుకున్నచర్య ఏమిటి ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—దీనికి నిన్ననే answer చేశాను అనుకొంటాను. వాళ్లు గోదావరిపైన ఒక ఆనకట్టనుకట్టినా రిజర్వాయరు కావాలన్నారు. Moderating effect ఉండవచ్చును అని చెప్పానుగాని, ఇప్పుడు ప్రాజెక్టు వెనుకకుపోతుందని చెప్పలేదు. 'ఇంకా better site ను మనం నిర్ణయించుకోవచ్చు. When we get larger area of Godavari river ఇంకా పైనఉన్న sites examine చేయడానికి ఎప్పుడూ అవకాశం దొరుకుతుంది. As it is we cannot enter their territory. అట్లాంటప్పుడు ఇప్పటికన్నా better site దొరికితే మనము మార్చుకోవడములో తప్పులేదు. Then it would become absolutely necessary.

*Extent of inam lands resumed and converted into ryotwari.*

123—

* 92 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) the extent of inam lands resumed and converted into Ryotwari for the year ending 1954 ; and

(b) the amount of additional land revenue ?

[3rd December 1955

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) An extent of Acres 192·42 of inam land was resumed and converted into ryotwari during 1954.

(b) The amount of additional land revenue accrued to the Government on this account is Rs. 774-1-2.

SRI B. SANKARAIAH: —రైత్వారీభూములుగా మార్చడానికి అంత ఆలస్యము ఎందుకు జరుగుతోంది ? ఈ మార్చేప్పుడు చాలా భూములకు దొంగ పట్టాలు ఎప్పటికప్పుడు పుట్టిస్తున్నారు. ఇటువంటి విషయాల్లో ప్రభుత్వము ఏమి చర్య తీసుకుంటూంది ?

THE HON. SRI K. CHANDRAMOULI :—హక్కుల విషయములో అనేక రకములైన వాదోపవాదాలు వస్తుండటమువల్ల ఆలస్యము అవుతున్నది. వాటిని నిర్ణయించవలసిన దాంట్లో కొంత ఆలస్యము అనుకోకుండాకూడా జరుగుతూ ఉంటుంది. ఏమైనా దొంగపట్టాలు పుట్టిస్తే విచారిస్తారు. విచారించకుండా ఏమీ లేకుండా పుట్టించారని చెప్పినవాటిని ఆమోదిస్తారని అనుకోవడానికి వీలులేదు.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, ఈ చట్టము ఇదివరకు ఉన్నటువంటి జమీందారీ abolition Act వర్తించినంతవరకుకూడా వర్తించలేదని, పూర్తిగా నిష్ఫలమైనదని, ఈ 192 గ్రామాలకు అది వర్తిస్తుంది అనుకొంటాను. అయితే ఇప్పుడు రాబోయే ఈనాం చట్టంలోవచ్చేది మన రాష్ట్రంలో చాలా గ్రామాలు ఉన్నాయి. వాటన్నింటికికూడా ఆ ఈనాముచట్టము వర్తిస్తుందని మంత్రిగారు సెలవివ్వగలుగుతారా !

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆ ప్రశ్నకు, దీనికి సంబంధము లేదు. ఇటువంటి విషయమువచ్చినప్పుడు దాంట్లో ఏమైనా కావాలంటే అన్నీ మనము ఆలోచించుకోవచ్చు. ఎంత acreage తీసుకున్నారు, ఎంతడబ్బు వసూలు అయింది అని మాత్రమే ఇప్పుడు అడిగినప్రశ్న.

SRI P. SUNDARAYYA :—ఈనాము భూములను యింకా ఎన్నిటిని తీసుకోవలసి ఉంటుంది.

THE HON. SRI K. CHANDRAMOULI :—వేరే ప్రశ్న వేయండి.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఏ జిల్లాలో ఎంతెంతభూమి తీసుకున్నారు ? తరువాత అనేక సందర్భాల్లో రైతులను వెళ్ళగొట్టే సంగతి ప్రభుత్వానికి ఏమైనా విజ్ఞప్తులు వచ్చినాయా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—వివరాలు ఇక్కడలేవు. వేరే ప్రశ్న వేస్తే చెబుతాను.

*Final recommendations of the State Government regarding the Nandikonda Project Report of the Technical Committee.*

126—

* 137 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the final recommendations of the Andhra Government regarding the Nandikonda Project Report of the Technical Committee headed by Sri Kunwar Sen will be placed on the table of the House ;

(b) the final places with alignments and ayacuts also be placed on the table of the House ; and

(c) how many years will it take to complete the project and the stage of availability of water to the areas ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) They are of confidential nature and it is not desirable to place them on the table of the House at present.

(b) The alignments of the canals and fixing of the ayacut will be decided during the detailed investigation of the project.

(c) The first phase of the project will be completed in 7 years. Water will be made available for irrigation when the height of the dam reaches plus 500'.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ప్రస్తుతము పెట్టడానికి వీల్లేదన్నారు. తరువాతఅయినా వచ్చేఆశ ఏమైనాఉన్నదా ? Right bank canal క్రింద కొమ్మమూరు canal arae కూడా కలుపమని Planning Commission కు recommend చేసినాము. దానినిగురించి ఏమైనా చెబుతారా ? తరువాత కున్వార్ సేన్ కమిటీరిపోర్టు పబ్లిక్ రిపోర్టుకాని, రహస్యపు రిపోర్టుకాదు. అది ఏమైనా అందజేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ canals క్రింద వాటిక్రింద ఇంకొకప్రశ్న వేరేఉన్నది. అక్కడ ఈ canals క్రింద నందికొండకు దానికిసంబంధించిన వివరాలు ఇస్తాను. రిపోర్టుగురించి నేను ఇందాక చెప్పినదానికంటె ఇంకెక్కువ చెప్పదలచుకోలేదు.

SRI G. YELLAMANDA REDDI :—ఈ కున్నార్ సేన్ కమిటీకి ప్రభుత్వము ఏమీ విలువఇవ్వకుండా రద్దుచేసినట్లేనా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—గవర్నమెంటు కమిటీ అను ఎప్పడూ pernanent గా ఉంచరు. వాళ్ళంతా water power commission employees వారిని అవసరము ఉన్నప్పుడల్లా ఒక్కొక్క ఊరికి పంపిస్తా ఉంటారు. కమిటీని రద్దుచేయడము, అపాయింటుచేయడము అనేది ఉండదు. అన్ని రిపోర్టులను తు. చ. తప్పకుండా ఆమోదిస్తూఉంటే ఇంక గవర్నమెంటు అవసరము లేదు. కమిటీని వేసేవాళ్లను execute చేయమనవచ్చును గదా ? కమిటీలను వేసినప్పుడు గవర్నమెంటుకు సలహాలు యివ్వడంకోసం వేస్తాము. ఆ సలహాలు ఏమి తీసుకోవచ్చును, ఏవి తీలుకోకూడదు అనేది గవర్నమెంటు examine చేస్తుంది.

SRI B. SANKARAIAH :—ఈ ప్రాజెక్టుల విషయములో ఆంధ్రప్రభుత్వము మెంబర్లకు ఒకపుస్తకము పంచిపెట్టింది. ఈ కున్నార్ సేన్ రిపోర్టుకూడా ఇస్తే ఆ రెండింటిలో భేదముఏమిటో తెలుసుకొనేదానికి వీలవుతుంది. అట్లాంటప్పుడు ఒకటి ఇవ్వడానికి వీలులేదు అని, ఇంకొకటి ఎందుకు ఇవ్వవలసివచ్చింది.

THE HON. SRI N. SANJEEVA REDDI :—మేము ఇచ్చింది final అయినప్పటికి తరువాత మార్చుకున్నప్పుడు మళ్ళా మీకు చెబుతాము. ఆ రిపోర్టులన్నీ ఆలోచించే మీకు ఒకరిపోర్టు ఇస్తుంటాము. అంతేకాని మీకు ప్రతి రిపోర్టుఇస్తే మీరు దానిని తలచెదరా, ఒక్కొక్క మెంబరు ఒక్కొక్కరకంగా చేయమనిచెబితే అది సాధ్యముకాదు.

SRI B. SANKARAIAH :—మీరు సభ్యులకు అందచేసిన రిపోర్టులో ఒకభాగంలో ఒకరకంగా ఉన్నది. ఇంకొకభాగంలో ఇంకొకరీతిగా ఉన్నది. Map ఒకరీతిగా ఉన్నది. వాటన్నింటినిబట్టి సమన్వయముచేయడము చేతగాకుండా ఉన్నది. కాబట్టి కున్నార్ సేన్ రిపోర్టుఅయినా ఇస్తే దాన్నిదీన్ని refer చేసి అప్పుడు సరియైనది ఏదో తెలుసుకోవడానికి వీలుంటుంది.

THE HON. SRI N. SANJEEVA REDDI :—కున్వారసేన్ కమిటీ రిపోర్టు ఇచ్చినప్పుడు mapఅంతా చక్కగాగీసి, తప్పులుఅన్నీ సరిదిద్ది, అంగుళాలతో

సహా జాగ్రత్తగాచూసి తరువాత ఇవ్వడానికి ప్రయత్నముచేస్తాము. మీరు ఇండ్లకు పోయేలోపల ఇవ్వాలనుకుని త్వరత్వరగా అచ్చువేయవలసి వచ్చినందువల్ల పరిశీలన చేయుటకు కాలవ్యవధి లేనందువల్ల అన్నితప్పులు వచ్చినాయి. అవన్నీకూడా నేను గ్రహించాను. అందువల్ల మరొకతూరి బాగా అచ్చువేయుటకు ప్రయత్నం చేస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Sen committee report ఇవ్వడానికి, అది public report అయినపుడు, అభ్యంతరం ఏమిటి ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—If it is a committee of the assembly we are obliged to put it before the House.

SRI P. SUNDARAYYA:—నందికొండ ప్రాజెక్టు విషయంలో మొదటి phase నే అంగీకరించాము ; రెండవ భాగానికి బాధ్యత తీసుకోలేదని డిప్యూటీ ఇరిగేషన్ మంత్రి పార్లమెంటులో చెప్పారు. ఇక్కడ ప్రభుత్వం ఈ రకంగా ఒక పర్యాయం sanction అయినట్లే అని చెప్పారు. దానిని గురించి ప్రభుత్వం ఏమి చర్యలు తీసుకుంటోంది ?

THE HON. SRI .N. SANJEEVA REDDI :—నేనుకూడా సుందరయ్యగారు చెప్పినదానితో ఏకీభవిస్తున్నాను. తుంగభద్ర ప్రాజెక్టు విషయంలో మాదిరిగా ఇబ్బందులు లేకుండా రెండవ phase నుకూడా sanction చేయాలని మేము అడుగుతున్నాము. ఈ విషయాన్ని ఢిల్లీ ప్రభుత్వానికి తెలియచేస్తాము.

SRI V. VISWESWARA RAO :—నాగార్జునసాగర్ ప్రాజెక్టు విషయంలో ఎడమవైపు కాలువ విషయంలో హైదరాబాదు గవర్నమెంటుచెప్పిన అభిప్రాయాలను Sen కమిటీవారి రిపోర్టును దృష్టిలో పెట్టుకుని Alignments విషయం ఆలోచిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—తప్పకుండా ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తున్నాము. It is not as though the canals are separated from the project. They have control over the canals also. ఈ విషయాలన్నీ Central Government వారి ద్వారానే ఆలోచించ బడుతున్నాయి.

*Chief Engineer for Nandikonda Dam.*

127—

* 129 Q.—SRI A. SATYANARAYANA MOORTHY :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether it is a fact that a Punjabee working as a Superintending Engineer of Bhakra Nangal was appointed as the Chief Engineer for Nandikonda Dam ;

(b) if so, whether he has got experience in constructing dams with lime, mortar and brick as per the plans and estimates already prepared and approved by the Government for the Nandikonda dam ;

(c) whether it is a fact that the 'Public Accounts Committee' of the Punjab Legislature have remarked in their report 1954–55 about some serious irregularities done in the construction of the Bhakra Project ; and

(d) if so, whether the Government are prepared to give the name of the Engineer who is responsible for the said irregularities, and also state the name of the Chief Engineer appointed for the Nandikonda Dam ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) No, Sir. SRI JAFFER ALI, Superintending Engineer Hyderabad has been appointed as Chief Engineer for Nagarjunasagar Dam.

(b), (c), (d) Do not arise.

*Board of Control for Nagarjuna Sagar Project.*

128—

*285 Q.—SRI P. RANGA REDDI:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether any "Board of Control" for the Nagarjuna Sagar Project has been recommended by the Government to the Union Government; and

(b) if so, how the Board will be constituted and what aret he powers and functions of such a Board ?

3rd December 1955]

THE HON. SRI N. SANJEEVA REDDI:—

(a) In consultation with the Governments of Andhra and Hyderabad the Government of India have resolved to Constitute the Nandikonda Control Board. The Resolution has been published at pp. 408–409 Part II of the Andhra Gazette dated 30—6—1955.

(b) The method of constitution of the Board, its powers and functions are contained in the resolution.

SRI B. SANKARAIAH:—ఈ బోర్డు సభ్యులు ఎవరెవరు ? ఎట్లా నియమించారో వివరాలు ఏమిటి ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఆ గెజటు చదివితే అందులో అన్నీ ఉన్నాయి. దానిని చదవమంటారా ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—విశాలాంధ్రవస్తే Control Board అవసరం లేకుండా ఉంటుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Control Board ఉండాలి కాని ఇంత complicated గా కాకుండా మన Chief Minister Central Government వారితో ఒక చిన్న body గా ఉంటే సరిపోతుంది.

*Development of irrigation in Tungabhadra Area.*

129–

*96 Q.—SRI S. VEMAYYA: Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether it is a fact that a team of officials were sent by the Government of India (Planning Commission) to investigate the possibilities of accelerating the development of irrigation in Tungabhadra area in consultation with the State Government; and

(b) if so, whether their report, if any, will be placed on the table of the House?

THE HON. SRI K. CHANDRAMOULI:—

(a) The answer is in the affirmative.

(b) As the report of the Team of Officials referred to was prepared at the instance of the Government of India and was intended for official use only, the Government regret that they are unable to place it on the table of the House.

SRI G. YELLAMANDA REDDI :—రిపోర్టు ఇవ్వకపోయినా ఇందులో ప్రధానమైన విషయాలైనా తెలియచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—రిపోర్టులోని విషయాలను ఆలోచించి సాధ్యమైనంతవరకు అమలు చేయడానికి ప్రయత్నిస్తాము. ఆ రిపోర్టు official guidance కు మాత్రమే.

Sri VIJAYA BHASKARA REDDI :—సభ్యులు పర్యటించినప్పుడు కొన్ని వార్తలు పడ్డాయి. దానిప్రకారం ఈ ప్రాంతాలలోని రైతులు బీదవారని వారినుంచి compulsory గా కొంతపొలం తీసుకుని ఇతరులకుఇచ్చి develop చేయడానికి చూస్తాము అనేవార్త పడింది. ఈ ఉద్దేశం సరికాదని ప్రభుత్వం తెలుసుకుని దానిపై ఎటువంటి చర్యలు తీసుకోకుండా ప్రభుత్వం ఉంటుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI .—ప్రభుత్వం ఇక్కడ ఉన్న అభిప్రాయాలనుబట్టి వారుఇచ్చిన ఆలోచనలను ఆలోచించి developmentకు ఏవి అనుకూలంగా ఉంటాయో ఏది సాధ్యం అవుతుందో అది చేయడానికి ఆలోచిస్తాము.

SRI S. NARAYANAPPA :—తుంగభద్రఏరియా క్రింద రైతులు సాగు చేయని పొలాలకు కావలిసిన విత్తనాలు, ఎరువులు మొదలైనవాటిని ప్రభుత్వం అందించడంలో ఆలశ్యంజరుగుతోందని వింటున్నాము, వెంటనే చర్యతీసుకుంటారా?

THE HON. SRI K. CHANDRAMOULI: —ఇంటువంటి complaints ప్రభుత్వందగ్గరకు రాలేదు. సాధ్యమైనంతవరకు తొందరగా ఇవ్వడానికి వేరే ఆఫీసర్లను on the spot పెట్టి ప్రయత్నిస్తున్నాము.

SRI P. SUNDARAYYA :—Report official గా ఎంతకాలంక్రితం అందినది ? ఇంతవరకు ఏమిచర్యలు తీసుకున్నారు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ముఖ్యమైన విషయాల మీద చర్యతీసుకుంటున్నాము. Extensive loans ఇవ్వడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

THE HON. Sri N. SANJEEVA REDDI :—ఈ విషయం కొంచెం చెప్పవలసియున్నది. ఈ ఇరిగేషన్ విషయం ప్రాజెక్టు ప్రారంభించిననాడే జరిగి ఉంటే బాగుండేది. ఆంధ్రరాష్ట్రంవచ్చిన తరువాత ఎక్కువచర్యలు తీసుకోడం జరిగింది, Agriculture లోను Revenue లోను Team of officers అక్కడ ఉన్నారు. Co-operative వాళ్లుకూడా అక్కడ ఉన్నారు. రైతులకు loans, manure ఇస్తున్నారు. Bunds లో వేసుకునేవిధానం చూపిస్తున్నారు. ఈ సంవత్సరము వర్షాలు బాగారావడంవల్ల అనుకున్నంతగా భూములు సాగులోనికి రాలేదు. వర్షాలు తక్కువగా ఉండినట్లయితే ఎక్కువగా నీరుతీసుకుని ఉండేవారు. ఎక్కువగా వర్షాలు రావడంవల్ల పైరులు పాడైపోయాయి. That should not be taken as the indication. ప్రయత్నాలుమాత్రం చాలా తీవ్రంగా జరుగుతున్నాయి.

Sri VIJAYABHASKARA REDDI :—Deputy Chief Minister గారు చెప్పినట్లు ఈ సంవత్సరం అనుకున్నట్లే నడుస్తోంది. ఆ వార్తలు సరికావని. ప్రభుత్వందృష్టిలో పెట్టుకుంటుందా?

THE HON. SRI K. CHANDRAMOULI :—అబద్ధాలుఉంటే అవి నిజంకావని తప్పకుండా దృష్టిలో పెట్టుకుంటాము.

*Ayacut under the Nandikonda Project in Andhra State.*

132--

*286 Q.—SRI P. RANGA REDDI: Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the total ayacut that is expected to be brought under irrigation under the Nandikonda Project in this State;

(b) the estimated cost for completing the project and the share of the Andhra State;

(c) the financial basis proposed by Union Government for the sanction of this Project; and

(d) the steps that the Government have proposed to take for implementation of this financial basis agreed to, by the Government?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ వివరాలు విషయంలో rough estimates మాత్రమే ఇస్తున్నాము. Final alignment అయిన తరువాతనే సరియైన లెఖలు ఈయడం వీలవుతుంది.

Sri N. Sanjeeva Reddi] [3rd December 1955

(a)

| | | |
|---|---|---|
| *I Crop.* | | Lakhs. |
| Guntur and Nellore | ... | 14·71 acres. |
| Pulichintla Block | ... | 2·00 ,, |
| Kavali Canal | ... | 1·1 ,, |
| Kanupur Canal | ... | 0·78 ,, |
| Krishna Delta | ... | 1·5 ,, |
| Nandigama Block | ... | 2·05 ,, |
| *II Crop.* | | |
| Second Crop in Krishna Delta. | | 1·5 ,, |
| Perennial supply | ... | 0·25 ,, |

(b) Full plan Rs. 122·08 crores.

Andhra's share Rs. 89·28 crores.

(c) The Government of India have desired that the Andhra Government should accept and agree to implement by legislation and other action the financial basis as outlined in the joint project report submitted by the two Governments. The financial basis comprise collection of;

(1) betterment levy and water rates, (2) sale proceeds of waste lands as assumed in the project report and realisation of normal land revenue.

(d) The Government propose to implement by legislation and by the issue of necessary executive orders.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, Right channel alignment విషయంలో detailed investigation చేయడానికి Chief Engineer ను నియమించినట్లు వార్తలు వస్తున్నాయి. పూర్వం ఖోస్లా కమిటీ చెప్పినట్టి విధంగా దానికి అనేక విజ్ఞప్తులు సమర్పించిన విధంగా దానిని పూర్తిగా ayacut లోకి తీసుకురావడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—మన ఇంజనీర్లు చూచినారు. కొస్లా కమిటీ చెప్పినా ఎవరు చెప్పినా rough గానే కదండీ. నేను ఢిల్లీపోయినపుడు పార్లమెంటు సభ్యులు చెప్పినారు. ఆ కారణంచేత Chief

Engineer ను appoint చేశారు. Regular గా field కు పోయినప్పుడుగాని తెలియదు ఎక్కడ ఎన్ని కాలువలు దాటాలో. Maximum extent రావాలనే అందరి ఆశ. అదే Chief Engineer చెప్పారు.

SRI N. VENKAIAH :—దక్షిణ కాలువ final estimate ఎన్ని మైళ్ల వరకు అయినది ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడే Chief Engineer ను appoint చేశారు. ఈ కొన్ని గంటలలో ఎంతవరకు అయినదో telephone చేసి తెలుసుకోమంటారా ?

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, general గా యీ నంది కొండ కాలువంతో right side గుర్తుకొస్తుంది. Left side న 2.05 లక్షల ఎకరాల వరకు సాగవుతుందని చెప్పారు. Main కాలువ Hyderabad నుంచి రావడం జరుగుతుంది. దాని విషయంలో Chief Engineer ను నిర్ణయించారా ? నందిగామ మాత్రం చేరుతుందన్నారు అయితే తిరువూరు తాలూకాలో కట్లేరువరకు వస్తుందన్నారు. తిరువూరు తాలూకాలో ఎంత సాగవుతుందో వివరిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Hyderabad కాలువ విషయంలో మనకు చాలా interest వున్నది. నాగార్జున సాగర్ dam site కు West Godavari M.L.A. లు బాపయ్యగారు, M. R. అప్పారావు గారు వచ్చినారు. అక్కడకు Hyderabad Chief Engineer యిటీవలనే వచ్చినారు. ఇప్పుడు 1100 cusecs పెట్టినారు, ఆ పెద్దటి acqueduct channels కు design చేస్తున్నారు. 2, 3 thousands cusecs పారించ కలిగితే బాగుంటుందని represent చేశారు. నాతో personal గా represent చేస్తే దయచేసి బోర్డుకు represent చేయమని చెప్పాను. Board కు represent చేశారు. Board examine చేస్తున్నది. Board report వచ్చేవరకూ నేను ఏమీ చెప్పలేను.

SRI P. SUNDARAYYA:—మీరు యిక్కడ చదివిన ayacut లో కావలి, కనుపూరు కాలువలు చదివారు. ఇది మొత్తం project పూర్తి అయ్యే లోపల జరుగుతుందా లేక మొదటి phase లో నే జరుగుతుందా? మొదటి phase లో నయితే వెనువెంటనే పని ప్రారంభించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Estimate మొదట both the phases అనుకుంటాను. I think that is the position. పనే కావలి కనుపూరు కాలువ complete అయిన నాటికి ayacut వస్తుంది.

SRI P. BAPAYYA :—కుడి కాలువకు 24,400 cusecs నీరు Andhra కు allot చేయగా Andhra Government 21,000 cusecs నీరు మాత్రమే ఉపయోగించుకుంటు కొనుటకు నిర్ణయించి యున్నారు. తక్కిన 3,400 cusecs ఎడమ కాలువకు నిర్ణయమయిన మొత్తమునకు కలిసిన నీరు West Godavari లో చింతలపూడి తాలూకాకు ఉపయోగించే విషయంలో ప్రభుత్వమేమైనా శ్రద్ధ తీసుకుంటున్నదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అదేగా ఇప్పుడు చెప్పాను. మీరు Board కు చెప్పారు. Board ఆమోదించిన తరువాత Planning Commission వారుకూడా alignment ను ఒప్పుకోవాలి.

SRI P. RAJAGOPAL NAIDU :—నందికొండ క్రింద betterment levy ఎంత వస్తుందని అంచనా వేశారు ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Seperate question వేయండి.

SRI P. RAJAGOPAL NAIDU :—Financial basis మీద వున్నది. అందువల్ల అంచనాలు ఏంతవరకు తయారయినవి ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు irrigation aspect గురించి ఆలోచిస్తున్నాం. Seperate question వేస్తే అంచనాలు తయారయినవో లేవో చెబుతాను.

SRI P. SUNDARAYYA :—నందికొండ క్రింద 41,000 cusecs water సోమశిల barrage దగ్గర పడుతుందని చెప్పారు. అక్కడనుంచి దక్షిణ పెన్న కాలువకు ఆ నీటిని నెల్లూరుకు తీసుకొనిపోవడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—అదంతా second phase లో రావాలని అనుకుంటాను. ఇంకా కావలసినంత time ఉన్నది ఆలోచించడానికి. Let us take time.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఈ కుడి కాలువలో శాశ్వతమైనంత ayacut తీసుకువస్తున్నారు. సంతోషం. కేంద్రం ఏమయినా సహాయం చేస్తారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—Project estimates అట్లానే వుండవు. పైకిపోతూ వుంటాయి. మనం Planning Commission ను ఒప్పించాలి. Project ను ఒప్పుకొన్న తరువాత 122 కోట్లు ఖర్చు పెట్టి ఇంకో 4 కోట్ల కోసం నిలిపేస్తారా ? Automatic గా యిస్తారని నా ఉద్దేశం.

Sri B. RATNASABAPATHY :—సుందరయ్యగారు సోమశిల ప్రాజెక్టు Flood Control Schemes క్రింద తీసుకోవాలన్నారు. దానికీ దీనికీ ఏమయినా difference ఉన్నదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—నాలుగడుగులు అటో యిటో వుంటుంది. Purposes రెండూ ఒకటే.

*Exclusion of certain areas in Guntur and Sattenapalli taluks under the proposed ayacut of Nandikonda Project.*

133—

* 296 Q.—SRI G. RAMASWAMI REDDI :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether certain areas in Guntur and Sattenapalle taluks were excluded from the proposed ayacut of the Nandikonda Project ;

(b) if so, the reasons therefor ; and

(c) whether the Government propose to extend the Nandikonda Project ayacut area to cover the places mentioned in (a) above, so as to dispense with the Pulichinthala Project ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) The matter is still under consideration of the Government.

(b) and (c) Do not arise.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—ఈ area మొత్తాన్ని కలుపమని ఖన్యార్ సేన్ కమిటీ recommend చేసినదా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—కాదేమో ఎప్పుడు సంపూర్ణంగా తెలియదు. దానిని పరిశీలన చేస్తున్నాం.

MR. SPEAKER :—We probe into a secret document.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అది secret document కాదు. Table మీద పెట్టారు. It was published in the Press and I have got a copy of it.

SRI P. SUNDARAYYA :—ఆ report రహస్యమైనదేమీకాదు. పార్లమెంటు సభ్యులకుకూడా ఆ report చదివి వినిపించారు.

THE HON. Sri N. SANJEEVA REDDI :—ఆ report గురించి ఆలోచన చేస్తున్నాం.

*Single point taxation.*

180—

* 180 Q.—SRI S. NARAYANAPPA :—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether the Government propose to introduce single point taxation in sales tax ;

(b) If so, whether the Government have examined this matter ; and

(c) What will be the difference in amount and whether it is profit or loss ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) No, Sir.

(b) The Government have considered the question on several occasions and are of the view that the existing system might be continued.

(c) The answer to this question will depend on the rate of tax adopted. In any case, I may add, we have recently appointed a committee and that committee will go into this question also.

SRI S. SANTHAPPA :—ఈ కమిటీలో సభ్యులెవరు ? వారు ఎంత కాలంలో తమయొక్క నిర్ణయాలను తీసుకొని single point taxation విషయంలో తమఅభిప్రాయం ప్రభుత్వానికి యివ్వాలని ఖచ్చితంగా ప్రభుత్వం ఆదేశించారో సెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—కమిటీసభ్యుల పేరులు పత్రికలో ప్రచురించబడినవి. రెండుమాసాలలో report అందజేయాలని ఆదేశించాము.

SRI P. NARASIMHAPPA RAO :—కమిటీసభ్యులను దేనినిబట్టి నియమించారు—అనుభవాన్ని బట్టి నియమించారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఎల్లప్పుడు sales tax లో ఉండేటటువంటి evasions ను వీరు unearth చేయాలి, tighten చేయాలిఅని సలహాచెప్పేవారిని వేశారు.

SRI P. NARASIMHAPPA RAO :—అంతా చెబుతున్నాం. అందరినీ ఎందుకు వేయలేదు.

THE HON. SRI D. SANJIVAYYA :—అందరూచెప్పారు. Degree varies.

SRI K. VIJAYABHASKARA REDDI .—ఈ కమిటీని constitute చేయవలసిన అవసరం ఎందుకొచ్చింది ?

THE HON. SRI D. SANJIVAYYA :—దీనికోసముకాదు. అనేక విషయాలను పరిశీలించవలెననే ఉద్దేశంతో కమిటీ వేయబడింది. అనేకవిషయాలతో బాటు అదికూడా చర్చించబడును. వారి అభిప్రాయం కూడా ప్రభుత్వానికి తెలుపవచ్చు.

SRI PRAGADA KOTAIAH:—అధ్యక్షా, అనేకవిషయాలు ఆలోచించడానికి కమిటీ వేసినాము అన్నారు. కనీసం కొన్నివిషయాలైనా చెబుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—కమిటీని appoint చేసినారు. సింగిలుపాయింటు అడాప్టు చేస్తారా లేదా అన్నది ప్రశ్నకాదు. సేల్సుటాక్సుఅంతా సమగ్రముగా పరిశీలించడానికి terms of reference అనే మాటలేదు. ఆ కమిటీ ఈ సమస్యనుకూడా పరిశీలించవచ్చును.

MR. SPEAKER :—All these questions are forced by your additional answer.

*Narasaraopeta Division—Motor Works' Union.*

181—

* 302 Q.—Sri GANJI NAGESWARA RAO :—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) whether it is a fact that Narasaraopeta Division Motor Works Union was not given representation in the Narasaraopeta, Vinukonda and Palnadu Road Transport Advisory Committee ; and

(b) If so, the reasons therefor ?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) There is no Road Transport Advisory Committee such as that referred to by the Member.

(b) Does not arise.

*Site for Gandhi Deenabandhu Ashramam.*

182—

*330 Q.—Sri P. GUNAYYA:—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the Manager of the " Gandhi Deenabandu Ashramam " Amadalavalasa of Srikakulam Taluk requested the Government for the acquisition of a site for the construction of a building for the Ashram ; and

(b) If so, the action taken thereon ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

Sri P. GUNNAYYA :—అధ్యక్షా, మంత్రిగారు ప్రశ్నకు జవాబు తెలుగులో చెప్పితే నేను మాట్లాడగలను.

Mr. SPEAKER :—లేదన్నారు.

Sri P. GUNNAYYA :—లేదంటే ఎలాగు ? 60 మందిపిల్లలు స్థలం లేక ఇబ్బందిపడుతున్నారు. ఆ ప్రక్కనే 5, 6 ఎకరాల భూమిఉన్నది. మహాత్మా గాంధి దీనబంధూ ఆశ్రమం హాస్టలుకోసము మేనేజరుగారు దరఖాస్తుపెట్టారు. అది ఇవ్వడానికి ఏమిఅభ్యంతరం ఉంది ?

The Hon. Sri D. SANJIVAYYA :—గవర్నమెంటువద్ద అటువంటి కాగితాలు ఏమీలేవు. డిప్యూటీ కలెక్టరువద్ద ఉన్నవి. అంటే 45 సెంట్లుభూమి ఇవ్వాలనుకుంటున్నారు.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, హరిజన బాలబాలికల హాస్టలు నడిపేవారికి ప్రభుత్వం భూమిఇవ్వాలని అభిప్రాయపడుతున్నదా. ఇదివరకే కొన్నిగ్రాంటులు ఇస్తున్నది. భూమికూడా అన్నిప్రాంతాలలో ఇచ్చేరా ? ఎన్నిచోట్ల ఇచ్చారు ?

Mr. SPEAKER :—That is a different question.

The Hon. Sri D. SANJIVAYYA :—హాస్టలు కట్టుకుంటాం స్థలం కావాలని అడిగితే, అవకాశంఉంటే ఇస్తాం.

*Representation from the Andhra Mill Mazdoor Sangh, Guntakal.*

183—

***332 Q.—Sri K.V.S. PADMANABHA RAJU.—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :**

**(a) whether the Government had received any representation recently from the Andhra Mill Mazdoor Sangh, Guntakal, on behalf of the workers employed in the Andhra Co-operative Spinning Mills Limited regarding the wages plus dearness allowance paid to them ; and**

**(b) If so, the action taken thereon ?**

The Hon. Sri D. SANJIVAYYA :

(a) Yes, Sir.

(b) Conciliation was held and an amicable settlement reached.

*Central Road—Traffic Board.*

184—

*335 *Q.*—SRI M. BAPAIAH CHOWDARY.—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :—

(a) the number of appeals filed on the judgments of Central Road Traffic Board from 31st March 1955 upto date and

(b) In how many cases the Government reversed the judgments of Central Road Traffic Board ?

THE HON. SRI D. SANJIVAYYA :

(a) 1 appeal and 170 revision petitions were filed against the orders of the Central Road Traffic Board during the period from 31—3—1955 to 25—11—1955.

(b) The Government dismissed the appeal and interfered with the orders of the Central Road Traffic Board in 6 out of the 107 revision petitions so far disposed of.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Cases details చెబుతారా ?

THE HON SRI D. SANJIVAYYA :—అవి ఇక్కడ లేవు.

*Assistant Commercial Tax Officers in the State.*

185—

*336. Q. SRI K.V.S. PADMANABHA RAJU.—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) How many Assistant Commercial Tax Officers there are in the State.

(b) Whether it is a fact that the Government abolished the post of some Assistant Commercial Tax Officers in the State ;

3rd December 1955]

(c) If so, what they are ; and

(d) Why they are abolished ?

THE HON. SRI D. SANJIVAYYA :

(a) 104.

(b) Yes.

(c) Eleven posts of Assistant Commercial Tax Officers at the following places have been abolished :

Palakonda, Parvatipur, Srungavarapukota, Chodavaram, Vizayanagaram, Pithapuram, Tuni, Gudur, Tiruttani, Rajampet.

(d) The General Sales Tax Act was amended in 1954. Prior to the amendment, Commercial Tax Officers were exercising only appellate powers of general supervision ; they did not have any assessment work ; all the assessments were done by the Deputy and Assistant Commercial Tax Officers. By the amendment of 1954, the assessment of dealers having large turnover was taken away from the Deputy Commercial Tax Officers and entrusted to the Commercial Tax Officers. The jurisdiction of Deputy and Assistant Commercial Tax Officers was consequently revised and in the process it was found possible to reduce the number of posts of Assistant Commercial Tax Officers.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, ఇదివరలో direct recruitment లో కొంత రిజిస్ట్రేషను డిపార్టుమెంటులోనుంచి A. C. T. O. లను తీసుకొంటూ వచ్చారు. ఇప్పుడు ఎందుకు నిలిపివేసినారు ?

THE HON. SRI D. SANJIVAYYA :—నిలిపివెయ్యలేదు. అవసరాన్నిబట్టి ఎవరైనా ఆ డిపార్టుమెంటుకు రావాలనుకుంటే వారి అర్హతలనుబట్టి తీసుకుంటాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Sales tax department కు Excise శాఖనుంచి యిదివరకు తీసుకున్నారు. పోలీసుకుపంపుతూ ఉన్నారు. మళ్ళీ commercial tax డిపార్టుమెంటుకు తీసుకుంటారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ప్రొహిబిషనువారిని పోలీసుకు తీసుకుంటారు. కొంత skeleton department ఉంటుంది. కొంతమందిని commercial tax department లోనికి తీసుకోవడానికి ప్రయత్నించేస్తాము.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, కొన్ని తాలూకాలలో A. C. T. O. లను తీసివేసినట్లు చెప్పారు. పాలకొండలో తీసివేశారు. అప్పటి లెక్కలనుబట్టి తీసివేశారు. ఇప్పుడు ఎక్కువరాబడి కన్పిస్తున్నది. కాబట్టి వారిని మళ్ళీవేస్తారు. ప్రొపోజల్సు ఉన్నవా ?

THE HON. Sri D. SANJIVAYYA :—ఆదాయంవచ్చి పని ఎక్కువగాఉండే D. C. T. O. వ్రాస్తే తప్పకుండా ఆలోచిస్తాను.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, ఇప్పుడు వేసినట్టి ఆఫీసర్లలో ఎంత మంది హరిజనులలో కలవిస్తారా ?

MR. SPEAKER :—వేరేప్రశ్న వేయండి. దానికి సమాధానం చెబుతారు. వేసినవారినిగురించి కాదు. తీసివేసినవారినిగురించి అడగండి.

THE HON. Sri D. SANJIVAYYA :—వేరేప్రశ్న వెయ్యండి. దానికి సమాధానం చెబుతాను.

SRI S. NARAYANAPPA :—Commercial Tax Department లో ఈ సంవత్సరము ఎంత పరసంటేజి direct recruitment లో తీసుకొన్నారో చెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ప్రత్యేకప్రశ్న కావాలి.

SRI SHAIK MOULA SAHIB :—అధ్యక్షా, మొట్టమొదట కొంత మంది ప్రొహిబిషను డిపార్టుమెంటుకు కమర్షియలు టాక్సు డిపార్టుమెంటునుండి వచ్చారు. అట్టివారిని చిన్న నేరాలకు మళ్ళీ ప్రొహిబిషను డిపార్టుమెంటుకు తీసుకొని పంపించివేశారు. వయస్సుమీరినవారిని పోలీసుకు పనికిరారు అంటే అట్టివారిని తల్లి డిపార్టుమెంటు అయిన కమర్షియలు టాక్సు డిపార్టుమెంటుకు తీసుకుంటారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అన్నివిషయాలు ప్రభుత్వం ఆలోచిస్తుంది.

*Running of Express train from Guntur to Macherla.*

134—

***89 Q. SRI M. NAGI REDDI.—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state**

3rd December 1955]

whether the Government have sent any proposal to the Central Railway Board to run an express train from Guntur to Macherla in view of heavy traffic due to Nagarjunasagar Project Works ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—The answer is in the negative.

SRI V. VISWESWARA RAO :—ఇప్పుడు నాగార్జునసాగరు ప్రాజెక్టు పని జరుగుతోంది. గుంటూరు మాచర్ల మధ్య రెండు రైళ్లుమాత్రము ఉన్నవి. నందికొండ ప్రాజెక్టువల్ల అనేకమంది వస్తున్నారు కాబట్టి అక్కడకు express లేకపోయినా అదనపుబళ్లు ఏర్పాటు చేయిస్తారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—ట్రాఫిక్కు ఉంటే రైల్వేవారు అదనపుబళ్లు వెయ్యడానికి ప్రయత్నంచేస్తారు. లాభంగాని నష్టంలేదు.

SRI N. SRINIVASA RAO :—అధ్యక్షా, On a point of information. ప్రభుత్వం ఆలోచిస్తుంది అన్నమాటకు నిర్వచనం ఏమీలేదని ఇటీవల గవర్నరుగారు అన్నారు. అదే నిర్వచనం ప్రభుత్వానిదా ? వారి నిర్వచనం వేరా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—గవర్నరు head of the state ఆయన శ్రీనివాసరావు గారికి private information ఇచ్చిఉంటే అది correct అవుతుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—బెజవాడనుండి రైళ్లు ఆలస్యం అవడంవల్ల staff వెళ్లడానికి చాలా కష్టపడుతున్నారు. ఎక్కువ రైళ్లు వెయ్యాలని కోరుతున్నారు. వానికోసం ప్రయత్నం చేస్తారా? అవసరంఉన్నదని గవర్నమెంటు గుర్తించాలని కోరుతున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—టెంపో ఇంకా రాలేదు. Camp లు construction అయి ట్రాఫిక్కు ఎక్కువఅయి inconvenience feel అయినపుడు మనము అడుగుదాము, వారు ఇస్తారు. ఇప్పుడిప్పుడే టెంపో ప్రారంభం అగుతుంది. అక్కడ Camps లేవు. రావడం, పోవడం stage వస్తే డామ్సైటుకు రైళ్లుపోతవి.

Sri A. VENKATARAMA RAJU :—గవర్నమెంటు ముందు ప్రయత్నం చేస్తేగాని ఇది జరగదు. ఒత్తిడివచ్చిన తరువాత families కదలడం మొదలైన తరువాత వీరు కదలడం ఇబ్బంది కలుగచేస్తుంది.

THE HON. SRI N. SANJIEEVA REDDI :—ఇంత కదిలితే మేము కదలకుండా ఉంటామా ? Line వేస్తున్నారు. మేము ఎప్పుడో కదిలేము. వీరు ఇప్పుడు కదులుతున్నారు.

SRI V. VISWESWARA RAO :—ఇంకా అక్కడ permanent camps లేవు. ఒత్తిడి కలగలేదన్నారు. 13 మైళ్లు వెయ్యడముతో రైళ్లుకొరకక నడచివెళుతున్నారు. అక్కడ రైల్వేవారు టిక్కట్ల విషయమై పై అధికారులకు తెలియపరచారు. కాబట్టి అదనపు రైళ్లవిషయం కేంద్రగవర్నమెంటుకు సూచిస్తారా?

THE HON. Sri N. SANJEEVA REDDI:—రోడ్డుకూలీలు రైళ్లలో పోయేవారు కారు. వారు పాకలు వేసుకున్నారు. నేను పోయివచ్చాను. చిన్న చిన్న camps ఉన్నవి. బస్సులు రైళ్లుఉన్నాయి. ఇంకా టెంపోలేదు. కొన్ని నెలల తరువాత చర్యతీసుకుంటాము. అవసరమైతే రైళ్లు వేస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—నెహ్రూగారు నాగార్జునసాగరుకు foundation కు వస్తున్నారు. అందు విషయమై special trains ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—స్పెషలు బస్సులు ఏర్పాటుచేస్తాము. స్పెషలు రైళ్లునేనే అవసరంలేదు. నాగార్జునసాగరు డాముకు పొయ్యేవారు ముందురోజే evening పోతారు బస్సులు కావలసినన్ని ఉన్నాయి. మా చర్లలో కాలంగడిపి తెల్లవారి వెళ్లవచ్చును. అక్కడ వసతులు కల్పిస్తున్నాము.

SRI N. RAMULU .—ప్రభుత్వం వేస్తున్నట్లుగా చాలామందికి తెలియక మాకు వెళ్లడానికి ఏమైనా ఏర్పాటులు ఉన్నవా అని చాలామంది అడుగుతున్నారు. ప్రభుత్వం తరపున ఒక ప్రకటన చేయించుతారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—ప్రభుత్వం తరపున ప్రత్యేక ఎర్పాటులు ఉన్నాయి, ఇక్కడ నేను చేస్తున్న ప్రకటన చాలు నేమోఅని అనుకొంటాను. అక్కడనుండి మాచర్లవరకు రయిలు ఉన్నది. Macherla నుంచి dam site వరకు special buses చాలా వున్నవి. అక్కడ పోయినవాండ్లకు damsite దగ్గర భోజనవసతులు జేయడం చాలకష్టం అవుతుంది. ఒక మాచర్లలో మాత్రమే, ఈ భోజనవసతులు చేయగలుతుగున్నాము. కొన్నివందల మందికి food packets, అలాంటివి 10 లేదినాడు ఉదయం ఒకపూట, పెట్టి, cheap గ

3rd December 1955]

ఉండేటట్లు సప్లయి చేయించడానికి ఏర్పాటులు చేశాము. అక్కడ కొన్ని పాకలు బస్సులు, వగైరాలు అన్ని ఏర్పాటులు జరుగుతున్నాయి. మన Chief engineer, I. G. అందరుకూడ, పోయి చూచివచ్చారు. మరల పోతున్నారు. చేయవలసిన ఏర్పాట్లుఅన్ని చేస్తున్నారు. పోతే ఇబ్బంది పడవలసిన అవసరంలేకుండా, వీలుఅయినంతవరకు పెద్ద ఏర్పాట్లుకొరదనుకోండి- మంచి ఏర్పాటులు చేయమని చెప్పాము.

Sri J. CHANDRAMOULI :—శ్రీవారి special train లో గుంటూరునుంచి Macherla కు పోవడానికి M. L. A. లకు అవకాశం కలిగించుతారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—వారు గుంటూరు వారు కాబట్టి గుంటూరునుంచి అడిగారు. మన కర్నూలునుంచి పోవలెనని చాలమంది అడుగుతూఉన్నారు. ఇంతమందిపోతే దానిని special train అనడానికిలేదు. ఇంకొకటి పోవలసివస్తుంది. అంతేగాని వారి Special train లో వీలుఉండదు.

Sri N. VENKAIAH :—Special buses ఏఏ తేదీలలో నడిచే ఏర్పాట్లుచేశారు ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—ఏమి అవసరంలేదు. మనుష్యులు వచ్చినప్పుడల్లా, అక్కడనుంచి పోతూఉంటాయి. అంతేగాని ఒక time అంటూ పెట్టుకుంటే అవుతుందా ? పెద్ద crowd వస్తుంది, అని expect చేస్తున్నాము. మాచర్లనుంచి నందికొండవరకు కావలసిన trip లు run అవుతూ ఉంటాయి. ఈ special trips కు timings ఏమి ఉండవు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ప్రభుత్వంవారు మాచర్లనుంచి నందికొండవరకు కార్లు arrange చేయడం చాల సంతోషంగా ఉంది. ఆ కార్లకు తగ్గట్టుగా జనం వచ్చేటప్పటి కల్లా కష్టం అవుతుంది. కాబట్టి special trains, Bezwada నుంచి మాచర్లవరకు, ఆ రెండు రోజులను, తిరునాళ్లకు వేసినట్లుగా వేస్తే బాగా ఉంటుంది. ఆ విషయం ప్రభుత్వం రైల్వే వాండ్లకు recommend చేస్తారా ?

THE HON. Sri N. SANJEEVA REDDI :—రైల్వే వాండ్లకు తెలియ చేస్తాం. కాని మామూలు trains, బస్సులు ఉన్నాయి. చాలక పోవచ్చును. ఆ దినం గుంటూరునుంచి చాలా crowd ఉంటుంది, run చేయండి అని సలహా ఇస్తాము.

[3rd December 1955

Sri T.JIYYAR DAS :—అధ్యక్షా, ఆరోజు మొత్తంమీద గుంటూరు నుంచి, మాచర్లకు, వెళ్లడానికి రెండే train లు ఉన్నాయి. ఆ రెండు trains చాలవు. అందువల్ల అధికంగా trains వేయటానికి ఈరోజు అయినా రైల్వేవారికి వ్రాస్తే జరుగుతుంది. గవర్నమెంటువారు ఏమైనా ఆలోచిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Opposition party, వారు అడిగేదానికన్న కాంగ్రెసు పార్టీ నుంచి అదే ప్రశ్నను మళ్లీ అడగడం మంచిదనుకున్నారు. అదే జవాబు వాండ్లకు కూడ apply అవుతుందనే నా ఉద్దేశం.

Construction of new railway lines.

135—

* 118 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state whether there are proposals with the Government to construct railway line (1) from Macherla to Nandikonda dam site and (2) from Khajipet to Renigunta to develop Nandikonda Project ayacut?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(1) The answer is in the affirmative.

(2) The answer is in the negative.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఈ లోపల మద్రాసు బెజవాడ రెండో line వేసేదానికంటే నందికొండనుంచి గూడూరువరకు, western parts of Nellore లో వేయడం మంచిదని వార్తలు వస్తున్నాయి. అందువల్ల Gudur to నందికొండ to Khajipet, ఈ line ప్రభుత్వం ఆలోచిస్తుందండీ ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఇప్పుడు నందికొండ dam site కు వేశే line సంగతి అయినతరువాత మిగిలిన lines అన్ని ఆలోచిస్తాం. Consideration లో ఉన్నాయి. This question is pertaining to the railway line to Nandikonda project. అది జరుగుతు ఉన్నది. ఇంకా మిగిలిన Khajipeta గురించి seperate గా deal చేసుకొంటే మంచిదేమో అనుకొంటాను.

SRI SHEIK MOULA SAHIB :—అధ్యక్షా, దొనకొండ కనిగిరి ఉదయగిరి ఆత్మకూరు నెల్లూరు రైల్వే line నిర్మించమని నేను శాసన సభలో April 22 వ తేదీన అందజేసిన స్కీము ద్వారా మెమోరాండము ఇచ్చి ఉన్నాను. జిల్లా ప్లానింగు కమిటీ ఇది శిఫారసు చేసియున్నది. ప్రభుత్వం ఈ line కొరకు ఎక్కువ శ్రద్ధ వహిస్తుందా ? అట్లా గూడూరునుంచి బెజవాడ వరకు రెండో రైల్వేలైను వేసేదానికంటే, ఉన్న చోటే ఇంకొక line వేసేదానికంటే, ఈమధ్య ప్రాంతంలో ఈ line వేస్తే, విశాలాంధ్ర ఏర్పడినట్లయితే, అక్కడి ప్రజలకు చాల ఉపయోగపడుతుంది. ఆవిధంగా ప్రభుత్వం రైల్వేబోర్డు వాండ్లకు శిఫారసు చేయ్యాలి అని నేను మనవిచేస్తున్నాను. అందుకు ప్రభుత్వం ఏమైనా ఆలోచన చేస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు తాలూకా బోర్డులో జిల్లా బోర్డులో, ప్లానింగు కమిటీలో, ఇక్కడ శాసనసభలో అంతా వారే చేశారు. వారి సలహాపైననే ఇక్కడ ప్రభుత్వంకూడ అంగీకరించి ఈ recommendation అంతా చేస్తుంది. తప్పకుండా ఆలోచిస్తుంది వారి సలహాపైన.

Mr. SPEAKER : Discussion on the Betterment Contribution Bill will be resumed.

## II. GOVERNMENT BILLS.

### (1) THE ANDHRA IRRIGATION (LEVY OF BETTERMENT CONTRIBUTION) (AS AMENDED BY THE SELECT COMMITTEE)—(contd.)

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, ఈబిల్లు ఇదివరకు మొట్టమొదట introduce చేసినపుడు ఈ బిల్లుమీద మాట్లాడాము. అప్పుడు మా తాలూకు ఉద్దేశములు కొన్ని మంత్రిగారికి చెప్పాము. తరువాత దానిని Select Committee కి పంపించారు. Select Committee వారుకూడ కొంతవరకు న్యాయమైన సవరణలుచేసి పంపించారు. కాబట్టి యీ బిల్లును పూర్తిగ బలపరుస్తూ మాట్లాడుతూ ఉన్నాను. కారణం ఏమంటే గవర్మెంటు పెట్టే అన్నిబిల్లులమీద, ప్రతిదానికి criticism చేయడం, ఇది బాగాలేదనడం, అది బాగాలేదనడం, ఇది మంచిపనికాదని నా ఉద్దేశం. కారణంఏమంటే గవర్మెంటు మాకు ఆపనికావాలి, మాకు ఆకాలవ కావాలి, మాకు ఇది తవ్వించాలి, అనిచెప్పేని, బెదరించేవాండ్లము మేమే గాని ఆ పనులనుగురించి తెచ్చేటటువంటి పన్నుకు మళ్ళీ వ్యతిరేకించి మాట్లాడడం అనేది ఇష్టంలేదనిచెప్పేని నేను మాట్లాడుతూ ఉన్నాను. ఐతే

Sri P. Narasimhappa Rao] [3rd December 1955

ఒక్క విషయములోమాత్రం ముఖ్యంగా కొద్దిమార్పు ఉంటుంది. దానినిగురించి ఆలోచించవలెనని మంత్రిగారిని కోరుతూఉన్నాను. 5% వడ్డీ అన్నారు. ఆ 5% వడ్డీ అనేది రైతుదగ్గర హెచ్చుచేయడం బాగావుండదు.

గవర్నమెంటు ఏ వడ్డీకి తెస్తున్నారో ఆవడ్డీనే రైతుకువేస్తే బాగాఉంటుంది. ఒకసలహామాత్రం నేను ఇస్తున్నాను. రెండవది, ఈవరకు 25 వేలుఅని చెప్పేసి లోగడవుండేది, ఇప్పుడు లక్షవరకు చేశారు. రెండవవిషయం ఏమంటే ఈ రైతులందరిదగ్గర వసూలుచేయమని చెప్పేసి మొట్టమొదటబిల్లులో ఉంది. ఇప్పుడు ఎవ రైతే అనుభవిస్తూ వుంటారో, ఎవరికైతే సాగుహక్కు ఉంటుందో, వారిదగ్గరనే వసూలుచేయమని చెప్పారు. దానినిగురించి Select Committee వారుచేసిన సూచనలు అన్నీకూడ బాగాఉన్నాయి. అందునుగురించి ఈ బిల్లుకు రెండో అభ్యంతరం ఏమీచెప్పకుండా ప్రతిదానికి గవర్నమెంటును మనంఅనడం మంచిదికాదు. కొన్నిమంచి పనులు చేయమని మనము కోరుతూఉన్నాము కాబట్టి—అందరుకూడా ఏకగ్రీవముగ support చేయవలెనని కోరుతూ విరమిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, ఈ బిల్లు సెలెక్టు కమిటీకి పోయింది. Select Committee లో చర్చించాము. కాని మేము ఈ బిల్లును అంగీకరించ లేకుండా ఉన్నాము. ఈ బిల్లు ఈనాటిదికాదు. ఎప్పటినుంచో సాగుతూవస్తున్నది. మొదటినుంచికూడ ఆలోచించుకొన్నపుడు, మద్రాసు ప్రభుత్వంలో ఉన్నపుడు, మద్రాసు ప్రభుత్వం introduce చేసింది. తరువాత ఆంధ్రరాష్ట్రం వచ్చినతర్వాత ఆంధ్రరాష్ట్రములో కూడ introduce చేశారు. రెండుచోట్ల ప్రజాభిప్రాయం ఆనాడు ఎట్లావుందో, మిగిలిన అన్నిపార్టీల యొక్క అభిప్రాయం ఏలాఉందో, బిల్లు ఈనాటివరకుకూడ ప్యాసుకాకుండా వుండడంబట్టే ఖచ్చితంగా తేలుతుంది. ఆనాడు మేమేకాదు, ముందు ముందు, ఎవరెవరు ఏమిమాట్లాడింది మీదృష్టికి తీసుకొనివస్తాను. లోక్‌పార్టీవారు చాలా మంది, కాంగ్రెసు నాయకులు ముఖ్యంగా రాయలసీమనుంచి వచ్చినటువంటి వారు.

MR. SPEAKER :—Lok party is not recognised.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఆనాడు ఉన్న దండీ. Undergroud పోయిందిలేండీ. మనమంత గుర్తించేటటువంటి Koti Reddi గారు వగైరాలు అందరుకూడ పూర్తిగ వ్యతిరేకించారు. ఈనాడు ఏకారణాలవల్ల వ్యతిరేకిస్తున్నారు ?

3rd December 1955] [Sri Pillalamarri Venkateswarlu

ఆనాడు ఏ కారణాలవల్ల వ్యతిరేకిస్తున్నారో ఈనాటికి ఆ కారణాలు ఏమి పోలేదని ఆ కారణాలు ఆ పరిస్థితులు అలాగే ఉన్నాయని మంత్రివర్గం దృష్టికితీసుకు వస్తున్నాను. అయితే ఆనాటికి ఈనాటికి మంత్రివర్గ పరిస్థితులు మారిఉండవచ్చు. అందువల్లనే బహుశా ఈనాటికిది pass అయినది. ముఖ్యంగా రాయలసీమ ప్రజానీకంను ఇంకా మెట్టప్రాంతాలలో ఉండేటటువంటి ప్రజానీకాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచించినపుడు ఈ బిల్లును ఏ పరిస్థితులలోను ఎవరు సమర్థించలేరనేటటువంటి విషయం మనకు స్పష్టంగా బోధపడుతుంది. దీంట్లో చెప్పినటువంటి అంశాలు చూచినట్లయితే అసలు నీళ్లు ఇచ్చినటువంటి కారణాలు ఏమిటి? Aims and objectsలో ఈ బిల్లును సిఫార్సుచేసి నటువంటి Taxation Enquiry Commission report లో గాని వీరందరుకూడా చెప్పినటువంటి కారణాలు దానిని ప్రభుత్వం ఒకప్రాంతాన్ని బాగుచేయుడానికి నీటి వసతులు ఏర్పాటు చేయడానికి డబ్బుఖర్చుపెడుతున్నది. ఖర్చుపెట్టడంవల్ల ప్రభుత్వానికి దాంట్లోనుంచి కొంత ప్రజానీకం రైతులు పొందినటువంటి లాభాలలో కొంతభాగం అంటే చెరిసగం అన్న మాట కనీసంఅయినా వచ్చితీరాలి. అందువల్లనే ఈ బిల్లును తెస్తున్నామని చెప్పారు. తరువాత Select Committee లో బిల్లులో ఉన్నటువంటి 25 వేలరూపాయలు తొలగించి మినహాయింపులకు లక్షరూపాయలవరకుకూడా అందరము, రాయలసీమ నుంచి వచ్చినటువంటి రామచంద్రారెడ్డిగారు మేముకూడా ఒత్తిడి చేయడంవల్ల సంజీవరెడ్డిగారు అంగీకరించారు. అంగీకరించి లక్షరూపాయలవరకుకూడా తీసుకు వచ్చారు. అయితే మేము ఆనాడే చెప్పాము. లక్షరూపాయలు అన్నది మాత్రం ఏ విధంగాను సరిపోదు. మీరు ఇంతవరకైనా తీసుకువచ్చి 25 వేల రూపాయలనుంచి లక్షరూపాయలవరకు తీసుకువచ్చారేగాని అసలు కనీసం మామూలు పరిస్థితులు ఆలోచించి అయినాసరే minor irrigation works విషయాన్ని దృష్టిలో పెట్టుకొనైనాసరే మనం కనీసం 5 లక్షలవరకు అయినాసరే ఈ మినహాయింపు ఉండాలని Select Committee కి మేము అప్పుడే తెలియజేశాము. ఈనాడు కూడా అదే అభిప్రాయంఉన్నది. మొత్తంమీద ఉండేటటువంటి ఆంధ్ర ప్రజానీకానికికూడా ఈ అభిప్రాయమే ఉంటుందనే విశ్వాసంకూడా మాకు ఉన్నది. అందువల్లనే మేము మళ్ళీ 5 లక్షలవరకు అయినాసరే కనీసం తప్పకుండా ఉండాలనేటటువంటి అభిప్రాయంలో ఉన్నాము. అయితే దీంట్లో ఉండేటటువంటి కారణాలు గాని భూమియొక్క value పెరిగింది కనుక పెరిగినటువంటి దాంట్లో సగం అంటే 50% Government కు రావాలి అనేటటువంటి సూత్రాన్ని ఈ రోజున మన ముందు పెడుతున్నారు. ప్రధానమైనటువంటి సూత్రం మీరే ఆలోచించండి.

Sri Pillalamarri Venkateswarlu] [3rd December 1955

ఈనాడు ఉండేటటువంటి ప్రాంతాలను తీసుకున్నట్లయితే ఈ సూత్రం ఎంతవరకు న్యాయం ? ఈ రోజున Irrigation facilities గాని Electricity facilities గాని తదితర facilities గాని ఏమైనా వచ్చినప్పుడు ప్రతిదాని ధర పెరుగుతుంది. పట్టణాల విషయం తీసుకోండి. బొంబైదగ్గరనుంచి పెద్ద పెద్ద నగరాలు చిన్న చిన్న నగరాల విషయం తీసుకొంటే అన్ని చోట్లకూడా 1947 సంవత్సరంతో పోల్చి చూచుకుంటే ఈనాడు ప్రతిచోటకూడా మేడయొక్క ధర పెరిగింది. ప్రతి స్థలంయొక్క ధర పెరిగింది. అన్నింటిధరకూడా పెరిగింది. ఈ Taxation Enquiry Commttiee వారు కేవలం రైతులమీద ఈ భారాన్నంతా మోసి దేశాన్నంతా ముందుకు తీసుకుపోవడానికి రైతులమీదే మోపడానికి పెద్ద పెద్ద మేడలు, భవనాలు మిల్లులు పెద్ద పెద్దవి కట్టుకొన్నటువంటి వారిమీదకూడా ఇదేదృష్టితో ఆలోచించి అయ్యా ! 10 వేల రూపాయలు చేసేటటువంటిది కూడా ఈనాడు 5 లక్షల రూపాయలు చేసినది. దానిలో ఒకలక్షరూపాయలు నాకు ఇవ్వండిఅని అడగడానికి ఏమైనా ముందుకు వస్తున్నారా ? ఏదైనా ఇది ముఖ్యంకూడా. ఈ Taxation Enquiry Committee ఇచ్చినటువంటి report లో ఎక్కడా అగుపడదు. అలా అగుపడకుండా అమాయకులుగా ఉన్నంటువంటి రైతాంగం నెత్తిమీద ఈ భారాన్ని అంతాకూడా మోపడానికి ప్రయత్నంచేస్తున్నారు. అంతాకాదు. సంవత్సరంనుంచి మాత్రం వెయ్యాలంటున్నారు. అనేకమంది శాసనసభాసభ్యులు మాత్రమే కాదు. ఈనాడు లచ్చన్నగారురాలేదు. వచ్చిఉంటే, వారి ఉపన్యాసం వారికే చదివి వినిపించేవాడిని. ఆయనకూడా చెప్పారు. 1947 వ సంవత్సరం 1943 వ సంవత్సరం ఏమిటి ? ప్రభుత్వం డబ్బుతోనే అభివృద్ధి చెందినటువంటి ప్రాంతాలు ఉన్నాయి. వాటిమీద ఎందుకు వేయకూడదు ? కేవలం శ్రీ కాకుళం విశాఖపట్టణం మాదిరిగా వెనుకబడినటువంటి రాయలసీమ ప్రాంతాలుమీద మాత్రం ఎందుకు వేయ్యాలిఅని ఆనాడు లచ్చన్నగారు డబాయించి బల్లగుద్ది ప్రశ్నించారు. ఈనాడు మళ్లీ ఆ ప్రశ్న వెయ్యరు. కాని ఇలా చేసుకొన్నప్పుడు కేవలం ప్రభుత్వడబ్బుతో అభివృద్ధి పొందింది కనుక దానిమీద అదనంగా పన్ను వేయాలని తీసుకువచ్చిన వాదన పెట్టడం ఏమాత్రం సరికాదు. అసలు ఈధరలు పెరిగినాయిఅంటే కేవలం Irrigation facilities వల్ల మాత్రమే కాదు. ఆ విషయాన్నికూడా మనం మరచిపోకూడదు. కొంత అమధ్యలో వచ్చినటువంటి inflation కారణాలవల్లకూడా ధరలు పెరిగాయి. దానివల్లకూడా భూమిధరలు పెరిగి అదేవిధంగా వున్నాయి. అలాంటి

తెలియదు. ఈ బిల్లులో ఉండేటటువంటి ఏ principle తీసుకున్నప్పటికైనను సరే ఏమాత్రంకూడా consistent గా లేదు. అది ప్రజానీకానికి నష్టం కలిగించేటటువంటి principle అని చెబుతున్నాను. ఎందుచేతనంటే ధరలు పెరగడానికి కారణాలు అనేకం ఉన్నాయి. ఈనాడు కర్నూలులో ఖర్చు చేస్తున్నప్పటికికూడా మనం Capital పెట్టుకోవడంవల్ల local గా buildings పెరిగాయి. Electricity రావడంవల్ల నేను ఉన్నటువంటి కొంపకు electricity పెట్టినతరువాత అద్దె పెంచడానికి పూనుకొన్నారు. అదేవిధంగా ప్రతివాళ్లు చేస్తున్నారు. ఆవిధంగా లాభముగా వచ్చినందువల్ల ప్రతివాళ్లు లాభంపొందుతున్నారు. దానివల్ల అందరిని కూడా వదలివేయవచ్చు. మొట్టమొదట రైతాంగంతోనే ప్రారంభిస్తాము అనేటటువంటి విధంగా తీసుకురావడం ఏమాత్రంకూడా సవ్యంగా లేదనుకొంటాము. అంతే కాకుండా ఇంకో విషయంకూడ చూడాలి. Betterment tax వేస్తున్నారు. ఎంత betterment tax అవుతోంది ? మొత్తం ఎంతఅవుతోంది అనే విషయానికి తరువాత వస్తాను. ఈ తరువాత Betterment tax మనంవేసి irrigation విషయములో ఇప్పుడు watercess లేకుండా పోతుంది. Watercess ద్వారా డబ్బులేకుండా పోతుంది. డబ్బు దానిద్వారా తీసుకొంటున్నాము. దానికే Betterment tax అని పేరుపెట్టి మావల్ల మీకు లాభంకలిగింది కనుక మీఆస్తిలో సగంభాగం పెట్టండిఅని ప్రభుత్వం ఇప్పుడు భాగంపంచుకోబోతున్నది రైతాంగం దగ్గర. అంతకుతప్ప ఈ బిల్లులో వేరేఅర్థంలేదని చెబుతున్నాను. మేమే ఇటువంటిబిల్లు తీసుకువస్తే చాలామంది ఇక్కడ కూర్చున్న సభ్యులుఅంతా కమ్యూనిస్టులు ఆస్తులు లాక్కోడానికి తయారౌతున్నారని తప్పకుండా ప్రచారం చేస్తున్నారు. ఈనాడు వారు తీసుకువచ్చినదాంట్లో ఏమిఉందో ఆలోచించండి. ఈనాడు భూమియొక్కధర పెరిగింది కనుక దాంట్లో భాగం ఇవ్వమంటున్నారు. ఈనాడు రాయలసీమలో ఉండేటటువంటి పరిస్థితులనుబట్టి చెప్పేదేమిటంటే నేను 10 ఎకరాలు ఉండేటటువంటివాళ్లు దానిని బాగాచెయ్యాలనేటట్లయితే ఎకరానికి 300, 400 ఖర్చుపెట్టందే ఎకరం మాగాణిఅవుతుందా ? 10 ఎకరాలు మాగాణి చెయ్యాలంటే 3000, 5000 ఖర్చుపెట్టాలి. ఈఖర్చుపెట్టడానికి రైతులదగ్గర డబ్బు లేదని మనకుతెలుసు. ప్రభుత్వం అప్పులుయిచ్చేస్థితిలో ముందేలేదని అంతేకాకుండ ఈ భూమిఉండికూడ కవిసం మేము సాగులోనికి తీసుకువస్తుందనిచెప్పి ప్రభుత్వం ఏమైనా పిలిచి సహాకారం ఇవ్వబోతుందా ? రైతు కష్టపడి సాగుచేసుకొంటే గతి, లేకపోతేలేదు. నిన్నను మనం pass చేసిన చంద్రమౌళిగారి బిల్లు దయవల్ల పండినా ఎండినా నీరు పెట్టుకున్నా పెట్టుకోనకపోయినా దీనిమీద పన్నుమాత్రం ఖచ్చితంగా

కట్టితీరాలి. ఈరకమైనటువంటి పరిస్థితులుచాలక ఇంకా దాంట్లోనుంచి భూమిధర పెరిగితే 3 సంవత్సరముల అనంతరం దానిలోనుండి నాకు భాగం పెట్టమంటుంది ప్రభుత్వం. ఈ బిల్లు expropriētory measure తప్ప మరేమికాదు. మేము కోరుతున్నదికూడ expropriētory చేస్తే చేయమని. ఎవరిదిపాపం ? చిన్న చిన్న రైతాంగం ఇక్కడ కూర్చున్నటువంటి చిన్నవాళ్లు ఉన్నారే రైతులు పేదవాళ్లు అను కొనేవాళ్ళకు తప్ప ఇంకా ధనవంతులుకూడ ఉన్నారు. అలాంటివారి ఆస్తులు expropriate చెయ్యండి మేముకూడ. బలపరుస్తాము—ఇలాంటి చట్టంతో మీరు వెంటనే ముందుకురండి. అలాంటి చట్టంతో మీరు ముందుకు వచ్చినట్లయితే పెద్ద పెద్ద ఆస్తులవాళ్ళవిషయం ఆలోచించి ఈ భూసంస్కరణాలు అయితేనేమి అందువల్ల కనీసం Agriculture Incometax అయినా తీసుకువచ్చి పెట్టేసి ముందు మా వెనకాల ఉన్నటువంటి చల్లపల్లి రాజాగారు హరిశ్చంద్ర ప్రసాద్ గారు ఇంకా మన పెద్దలు తునిమహారాజాగారు వీరందరిమీదకూడ మేము పన్నులువేస్తున్నాం, తరువాత మీజోలికివస్తున్నాం అని చెబితే ఏమైన కొంతన్యాయం, అర్థం ఉంటుంది. ఆవిషయం ఏమైనాఉన్నదా అని ముందు ఆవిషయం ఈరోజు నేను అడుగుతున్నాను. మొదటినుంచి ఇదిఒక సమస్యగానే ఉన్నది. ఎందువల్ల Agriculture Income tax తీసుకురారో సమాధానం చెపుతాను. దానివల్లవచ్చేది 7 లక్షలు 8 లక్షలు లెక్కలువేసినారు. 7, 8 లక్షలు రానేరాదు. Joint pattas తీసుకొని అవన్నీకూడి వాటిమీద 7 లక్షలు calculate చేసినారు. అసలు ఎవరి ఎవరి దగ్గర ఎంతెంత ఆస్తి ఉన్నది ? పోనీ మన ప్రభుత్వం ఈ సమాధానం చెప్పుతోందేగాని మిగిలిన రాష్ట్రాలలో అంటే అనేక రాష్ట్రాలలో వేశారు. గతంలో ఇప్పటికి 12 రూపాయలకు ఈ agricultural income-tax అమలు జరుగుతోంది. కొన్ని రాష్ట్రాలలో 5 లక్షలు 37 లక్షలు వచ్చినటువంటి చోట్ల కూడా Agricultural Incometax Act అమలు జరుగుతున్నది. 62 లక్షలు 70 లక్షలు ఆదాయంవచ్చేటటువంటి రాష్ట్రాలుకూడా ఉన్నాయి. ఇవన్నీ ఉన్నప్పటికీ మొట్టమొదట Agricultural Incometax బిల్లు ఎందువల్ల అమలు జరుగలేదు అని మాత్రం మేము ప్రశ్నిస్తున్నాము. దానికి ఇప్పటినుంచేకాదు. ఈరోజు మద్రాసు Assembly లో ఆబిల్లు తెచ్చినప్పుడే Agricultural Incometax తిరిగి 2 సంవత్సరాలకు ముందు పెద్ద పెద్ద జమీందార్లు కోటీశ్వరులు కలిగిన భూమిమీద వచ్చేటటువంటి ఆదాయం మీద వేద్దాము. అంటే ఆనాడు ఖాతరు చెయ్యలేదు, ఈనాడు ఖాతరు చెయ్యలేదు. కేవలం ఈనాడు ఉన్నదికదా. Taxation Enquiry Committee వారు recommend చేస్తున్నారుగదా అని సాగుకు చూపించి మనమీద ముఖ్యంగా పేద రైతాంగంమీద వెనుకబడి ఉన్నటువంటి పేద

ప్రజానీకంమీద పన్ను వేస్తున్నదిగాని మొత్తంమీద మొదటినుంచి Irrigation ప్రాజెక్టులు ఎక్కడెక్కడకట్టామో కృష్ణా గుంటూరు జిల్లాలోకూడా ఎక్కడకట్టిందో దానిమీద అయినా సరే మేము ఈపన్ను వేయబోతున్నాము అని చెప్పి మంత్రిగారిని ముందుకు రమ్మనండి. అలాగైతే 4 రోజులు అయినా ఈ మంత్రివర్గం నిలవదు. ఈ సభలో ఆ తీర్మానంకూడా pass కాకుండా పోతుంది.

కేవలము, వెనుకబడిన ప్రాంతాలమీద వేస్తున్నాము అని దీనిని తీసుకొనివచ్చి పెట్టడం ఏ మాత్రము సరిగాలేదని నేను చెప్పుచున్నాను. అయితే, వీటికంతా డబ్బు అక్కరలేదా అంటే, డబ్బు కావాలి, డబ్బు రాబట్టాలి. ఎంత ఎక్కువ రాబట్టడానికి వీలుంటుందో అంత ఎక్కువగ రాబట్టడము అయితే, దాంట్లో మేము తప్పకుండా సహకరిస్తాము. కాని ఈ బిల్లుద్వారా మాత్రము కాదు. ఈ బిల్లువల్ల, బీద ప్రజానీకం తమ ఆస్తులను అమ్ముకొనవలసి వస్తుంది తప్పితే, మరేమి కాదు. ఈనాడు పది ఎకరాలు ఉన్నటువంటి రైతులను మినహాయించండి అని సుందరయ్య బ్రతిమాలాడాడు. రాయలసీమ అభివృద్ధి కోరే మహానుభావులంతా ఇక్కడ ఉన్నారు. గాని ఆచరణలో రుజువు చేయండని చెప్పాను. ఈ 100 ఎకరాలను మినహాయించలేదా? కాని పది ఎకరాలమీదకూడ వేసేటటువంటిది తీసుకువచ్చారు. మొట్టమొదట అనేక తడవలు ఈ సమస్యలు వచ్చినప్పుడు సంజీవరెడ్డిగారు మమ్ములను విమర్శించారు. మేము ఈనాడు వారిని అదే ప్రశ్నిస్తున్నాము. ఈనాడు మీరు పెద్ద పెద్ద కోటీశ్వరులు, భూస్వాముల ఒత్తిడివల్ల ఈవిధంగా చేయడం కాకపోతే, ముందు మీరు Agricultural Incometax తీసుకువచ్చి వేయండి. మా పార్టీలో ఎవరైనా Agricultural Incometax కట్టుకొనే స్థితిలో ఉంటే వారిమీదకూడ వేయండి. మాకేమి అభ్యంతరంలేదు. కాని ఈరోజు అటువంటివారు మా పార్టీలో ఉన్నారని మీకు తెలుసు, వారిమీదకూడ వేయడానికి ముందుకు రండి, అని మిమ్ములను ఒత్తిడి చేస్తున్నాము. మిమ్ములను బ్రతిమాలుతున్నాము. అటువంటిగి తీసుకోకుండా వెనుకబడిన ప్రాంతాలలో ఈవిధంగా తీసుకురావడం సరిగాలేదని మాత్రము మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. అయితే అంతటికీ డబ్బుకావాలికదా అంటే, డబ్బు రాబట్టడానికి అనేక మార్గాలున్నాయి. ఈనాడు ముఖ్యంగా Agricultural Incometax వేసినప్పటికికూడ, మన ప్రాజెక్టులన్నిటికి సరిపోయేంతటి డబ్బురాదు, అనికూడ తెలుసు. అయినప్పటికి, భారతదేశములో, భాగ్యవంతములైన ప్రదేశాలు ఎన్నో ఉన్నాయి. భాగ్యవంతులుగాని, కోటీశ్వరులుగాని ఈ Taxation

Sri Pillalamarri Venkateswarlu] [3rd December 1955

Enquiry Commission report లో గాని మనము చూస్తున్నటువంటి విధాన మేమిటి ? తాతాలకు, బిర్లాలకు మొదలైనవారికి Corporation tax అని, 20 కోట్లు తగ్గించారు.

MR. SPEAKER :—May I just remind that the Bill has just now come from the Select Committee.

THE HON. SRI N. SANJEEVA REDDI :—He is also a member in the Select Committee.

SRI PILLALAMARRI VENKATESWARLU :—That is true.

MR. SPEAKER :—It is only after agreeing to the principles of the Bill, that we referred it to the Select Committe. It emerged from the Select committe.

SRI PILLALAMARRI VENKATESWARLU:—Yes, Sir అయితే ఇది నేను Select Committe ఆమోదించాలని చెప్పలేదు.

MR. SPEAKER :—Not that, This house agreed to the principles of the Bill and referred it to a Select Committee. Please remember that.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ బిల్లును ఈ form లో వ్యతిరేకిస్తున్నామని చెప్పము. బిల్లులు చేయడమంటే, పన్నులు వేయడమనేది అంగీకరించాము కాని వందలకొలది, వేలకొలది ఎకరాలు ఉన్నవారు రాయలసీమలో ఉన్నారుకూడ. అటువంటి వారివద్ద తీసుకొమ్మని చెప్పుతున్నాము. పెద్ద పెద్ద వాళ్లమీద వేయాలని ఇప్పటికి కూడ చెప్పుతూనేఉన్నాము. కనుక ఈ బిల్లులో embody అయినటువంటి, పేదవాళ్ల మీదకూడ ఈ పన్ను వేసేటటువంటి principle ను వ్యతిరేకిస్తున్నాము. తరువాత మంత్రిగారు ఈ బిల్లును మేము accept చేశామని చెప్పుతున్నారు. మా minute of dissent క్రింద సంతకాలు చదువుతాను. "P. Sundarayya, P. Venkateswarlu, G. V. Chowdary, Secretary to the Legislature," (Loud laughter.)

THE HON. SRI N. SANJEEVA REDDI:—G. V. Chowdary కి dissent లేదండి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—What is written here I read. అందువల్ల, ఈవిధంగా indiscriminate type of taxation అనేటటువంటి దాన్ని మాత్రము తప్పకుండా వ్యతిరేకించాలి. దీన్ని ప్రతిఘటించవలసిన అవసరమున్నది. ఈ ప్రతిఘటించవలసినది అన్నమాట నాది కాదు, నా స్వంతమునది కాదు. నేడు సంజీవరెడ్డిగారి ప్రక్కన కూర్చొంటున్న లచ్చన్నగారు చెప్పినదే. "దీనిని ప్రతిఘటించాలి, జాగ్రత్త. ఇదివదలుకోకపోతే చూచుకోండి ఏమవుతుందో" అని మద్రాసు అసెంబ్లీలో చెప్పారు. మీరుకూడ విని ఉన్నారు. అది మేముకూడ ఈ రోజున చెప్పుతున్నాము. ఈ బిల్లును తప్పకుండా ప్రతిఘటించవలసిన అవసరమున్నది. ఈ బిల్లువల్ల రైతులను దివాలా చేయడం తప్ప మరేమికాదు. కనుక దీనిని జాగ్రతగా ఆలోచించమని మీకు విజ్ఞప్తిచేస్తున్నాను. పోనీ దీనివల్ల రైతాంగముయొక్క పరిస్థితులు బాగుపడతాయా అంటామా! వారి అప్పుల భాధ ఏమైనా తగ్గుతుందా అంటామా! అటువంటిది జరుగదు. ఈరోజు ఈ భూమి సాగులోకి తీసుకురావడానికి ప్రభుత్వము ఏరకమైన సహాయం చేయబోతున్నది? పోనీ, రాయలసీమలో ఉండేటటువంటి మెట్ట ప్రాంతాలలోని భూములన్నిటిని చదునుచేసి, సాగులోకి తీసుకొనివచ్చుటకు అయ్యేటటువంటి ఖర్చులంతా రైతులు పెట్టుకోకుండా, మేము వాటిని సాగులోకి తీసుకు వస్తామని చెప్పడానికైనా ప్రభుత్వము సిద్ధంగా ఉన్నదా? లేదు. అదికూడ చేయకుండా, ఇప్పటికిప్పుడే అప్పులతో క్రుంగిపోతున్నటువంటి రైతులమీద ఈ విధమైన పన్నులు వేయడం ఏ విధంగాను సరిగాలేదు. గనుక దీనిని వ్యతిరేకించవలసిన అవసరమున్నదని మనవి చేస్తున్నాను. తరువాత ఈ Taxation Enquiry Committee report లో కొన్ని కొన్ని సిఫార్సులున్నాయి. పోనీ వాటినైన అమలుపరచడానికి పూనుకొన్నారా అంటే, అదికూడ లేదు. Agricultural Income-tax వేయమని వారు చెప్పారు. కాని అది వేయడానికి నిరాకరిస్తున్నారు. తరువాత ఆ కమిటీవారు ఈ పన్ను విధించడానికి 5 సంవత్సరాలు time ఇవ్వాలని అన్నారు. అదికూడ నిరాకరిస్తున్నారు. అంతే కాకుండా భూమియొక్క విలువలో, 50 percent కు మించకుండ ఉండాలని చెప్పితే, 50 percent ఖచ్చితంగా తీసుకువచ్చి పెట్టారు. 50 percent కు మించకూడదంటే, ఏదో, 20 percent 25 percent వేయాలిగాని, ఆ విధంగా చేయకుండా, 50 percentకు మించకూడదని చెప్పారని ఖచ్చితంగా 50 percent అని పెట్టడము ఏవిధంగాను బాగలేదు. అంతేకాదు, సంజీవరెడ్డిగారు తమమాటను

Sri Pillalamarri Venkateswarlu] [3rd December 1955

మంచికూడ వెనుకకు పోయారు. అప్పుడు ఇది కోటిరెడ్డిగారి పేరట publish అయిందనుకోండి. అయినా ప్రభుత్వము తరఫు నేకదా చేశాడు. దాంట్లో "The mode of payment of contribution. The contribution levied on any owner shall be paid by him in 30 annual instalments." అని ఉన్నది. కనుక ఈనాడు మేము 30 instalments కు అంగీకరిస్తారా అని అడిగాము. కాని వారు మామాట వినిపించుకోలేదు. వారి ప్రభుత్వము తయారుచేసినటువంటి బిల్లులో 30 annual instalments అనేది అంగీకరిస్తారా? అప్పటికైనాసరే, కొంత కాకపోయినా, కొంతైనా తగ్గుతువస్తుంది. 30 సంవత్సరముల తరువాత చూచుకోవచ్చు. దీనికికూడ ఏ విధంగాను సిద్ధంగా ఉన్నట్లు కన్పడడంలేదు. ఆ ఉన్న కొద్ది మంచినికూడ మార్చివేసేశారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—మంత్రివర్గం అభిప్రాయాలు ఏమైనా, Select Committee సభ్యులు ఏమైనచెప్పితే అవి అంగీకరించవలసియుంటుంది. కాబట్టి 30 వద్దు, 20 పెట్టితే బాగుంటుందని Select Committee వారు చెప్పితే దాన్ని అంగీకరించాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :—30 వద్దు అని Select Committee వారు చెప్పలేదు. ఈ రోజైన ప్రభుత్వము 30 పెట్టి వశ్లేయితే, Select Committee లోని సభ్యులుకూడ తప్పకుండా అంగీకరిస్తారు. కనుక, ఇవన్నీ చూచినప్పుడు, ఈ principle ఏమాత్రము సరిగాలేదని చెప్పవలసియున్నది. డబ్బు కావాలంటే, సంపాదించడానికి అనేక సూచనలున్నాయి. కేంద్ర ప్రభుత్వమువారుకూడ, అసలు ఈ రకంగా పెద్దవాళ్ళమీద పన్నులువేయమని చెప్పే బదులు టాటాలకు, బిర్లాలకు మొదలైన పెద్ద Industrialists కు వడ్డీలేకుండా 10 కోట్లు, 8 కోట్లు ఈ విధంగా అప్పులు ఇస్తున్నారు. పరిశ్రమలలో వారికి incentive కలుగజేసి పరిశ్రమలను అభివృద్ధిపరచడానికి ఆ విధంగా ఇస్తున్నామని చెప్పారు. కాని ఈ సందర్భములో ఒకటే అడుగుతున్నాను. ఈనాడు రైతులు కూడ ఎక్కువ భూమిని సాగులోకి తీసుకురావాలంటున్నాము. అటువంటప్పుడు వారికి ఆ incentive కలగడానికి ఏమైనా డబ్బుఇస్తున్నదా, కనీసం ఆ incentive ఉండడానికైనా ఈ రకమైన పన్నులైనా లేకుండా చేస్తున్నారా ? ఎకరానికి 70, 80 రూపాయలు కట్టుకోనేటటువంటి పరిస్థితులలో కల్పించి నిర్బంధంచేస్తే, వారికి ఏవిధంగా incentive ఉంటుంది ? కనుక రైతులకు అటువంటి Incentive ఉండనక్కరలేదా అని అడుగుతున్నాను. అందువల్ల ఇదేదో ఒక party సమస్యగా

3rd December 1955] [SRI Pillalamarri Venkateswarlu

తీసుకువచ్చి పెడుతున్నారు అని అర్థంచేసుకోవద్దని చెప్పుతున్నాను. ఈ విషయం గురించి మద్రాసు అసెంబ్లీ debates ఉన్నాయి. లచ్చన్నగారు చెప్పిన మాటలు ఉన్నాయి. కోటిరెడ్డిగారు చెప్పినమాటలు ఉన్నాయి. T. N. వెంకట సుబ్బారెడ్డిగారు చెప్పినమాటలు ఉన్నాయి. లచ్చన్నగారు ఏమి చెప్పినప్పటికినీ కూడ, ఆనాడు వారు మా పార్టీలో లేరు కొబట్టి అది పోనివ్వండి. కోటిరెడ్డిగారు old member of the Congress Party as well as the Legislative Assembly రాయలసీమ అభివృద్ధికి సంజీవరెడ్డిగారు ఎంతపాటు పడుతున్నారో, కోటిరెడ్డిగారుకూడ ఇంచుమించు అంతే పాటుపడుమన్నారు. అందువల్ల చూడండి వారేమి చెప్పారో.

"It is rather unfortunate that the Minister of Revenue should have come now with the proposal for the imposition of the betterment levy. If so, it is only proper that we should not impose on poor people. On that basis, it is really difficult for some of us to agree to the principles of this Bill".

అని చెప్పారు. ఇక లచ్చన్నగారు చెప్పినది ఒప్పుకోరు గనుక అదిచదవడం లేదు.

అందువల్ల general principles ను గురించి అంతకంటె ఎక్కువగా చెప్పనవసరములేదు. కాని దీనిలో యింకొక difficulty ఉన్నది. ఆరోజున మేముచెప్పింది ఏమిటంటే, ఒకలక్ష రూపాయలు పరిపోవు, అయిదులక్షలు కావాలని చెప్పాము. మేముకూడ లెక్కవేసి చెప్పాము. లక్షమొదలు అయిదులక్షల లోపలవుంటే works ఎన్నిఉంటాయి అని మేము లెక్కవేసిచూస్తే, 59 ఉన్నవని తేలినది. వాటిక్రింద రూ. 1,24,42,000 ఖర్చుఅవుతుందని, అందుకుగాను 64 వేల ఎకరాలు మాత్రమే సాగవుతుందని అనుకున్నాము. ఎకరానికి Betterment levy అయిదువందల రూపాయలు పడుతుందని అనుకోండి. అప్పుడు యీ 64 వేల ఎకరాలమీద మొత్తము సుమారు మూడుకోట్ల పైచిల్లర ప్రభుత్వానికి వస్తుంది. అంటే యీ రూ. 1,24,42,000 లున్నా ఖర్చుచేస్తే ఎంత రాగలదో రాయలసీమ సభ్యులందరూ ఆలోచించమని కోరుతున్నాను. అంతేకాని సంజీవరెడ్డి గారి మాదిరిగా నేను యీ విషయము ప్రచారానికి తీసుకొనిపోను గాని, ఒక్క విషయముమాత్రము చెప్పగలను. దీన్నిగూడ దృష్టిలో పెట్టుకుని ఆలోచించమని అంటున్నాను. ఈ ఒకకోటి ఇరవై నాలుగులక్షల నలభైరెండువేలకున్నా, సుమారు నాలుగుఅయిదు లక్షలదాకా ప్రభుత్వం సంపాదించబోతున్నది. మొత్తముమీద ఈబిల్లునుబట్టిచూస్తే, సుమారు అయిదుకోట్లు ఖర్చుచేస్తే కనీసము ఈ Betterment

Sri Pillamarri Venkateswarlu] [3rd December 1955

levy మూలముగా ఏ తొమ్మిది, పదికోట్లో ప్రభుత్వం సంపాదించటానికి వీలు ఉన్నది. అందుకోసము యీ బిల్లు ఉపయోగపడుతున్నది. ఇంతేకాకుండ యీ బిల్లులో ఒక disparity గూడ ఉన్నది. దీన్ని ప్రభుత్వముయొక్క దృష్టికి తీసుకొనిరావలసిన అవసరము ఉన్నది. ఖర్చులవిషయము తీసుకున్నప్పుడు 1953-54 వ సంవత్సరములో రూ. 1,3,90,000 లు ఖర్చు అయినప్పుడు, 1954-55 లో రూ. 2,5,50,000 లు, ఖర్చుఅవుతుందని అంచనావేశారు. అంటే ఒక సంవత్సరములో working expenditure మాత్రము యీవిధంగా వేస్తున్నారు. దీన్నిబట్టి చూస్తే, ప్రభుత్వం ఇంకా కొన్నికోట్లు ఖర్చు అదనంగా చేస్తేనేగాని మెంబరులు చెరిదిపోయి, అరెరే! ఎందుకు ఇంతఖర్చు అవుతున్నది, అనేది కనబడుతుందేగాని, నిజంగాచూస్తే, ఒక్కసంవత్సరములో ఒకకోటి రూపాయలు ఖర్చుపెట్టాము అంటే దానిలో ఇంతఖర్చుకు మనము యేమిచేశాము అనిపిస్తుంది. ఉద్యోగస్థుల జీతాలు పెంచామని అంటారా? ఇదిగాక ఇంకొక dispensary గూడ ఉన్నది. ఒక చోట ఒక ప్రాజెక్టుకట్టాము అనుకోండి. మునేరు ప్రాజెక్టే కట్టించారనుకోండి. అది ఒక సంవత్సరములో కట్టారు. ఒక సంవత్సరము అయినతరువాత ప్రక్కన దాన్ని extend చేశారనిచెప్పి, దానిప్రక్కనవున్న గ్రామానికిమాత్రం ఏమీపడదు. దానిప్రక్కన చేలకుమాత్రం పడుతుంది. ఈ బిల్లువల్ల ప్రతిరైతూకూడ ప్రతిసంవత్సరము కనీసము యాభై, అరవై రూపాయలు చెల్లించవలసి వస్తుంది. ధరలు ఇదే విధంగా ఉంటాయని ప్రభుత్వం గ్యారంటీ ఇస్తుందా? అటువంటి దేమీలేదే? ధరలు ఇట్లాగే ఉంటాయని ప్రభుత్వం గ్యారంటీ ఇవ్వనప్పుడు, ధరలు పడిపోయినందువల్ల, రైతుకు గిట్టుకుండావుండి నష్టమువచ్చే పరిస్థితి వచ్చేటట్లయితే, యీ betterment వల్ల రైతు ఏవిధంగా లాభము పొందినట్లవుతుంది? నష్టమువస్తుందని అనుకుని, రైతు తనుపండించిన పంటను సగానికి సగము నష్టమునకైనా అమ్ముకోవలసిన గతిపట్టుతుంది. భూమిని కొత్తగా సాగుకు లాయకీగా చేసుకోటానికి ఎకరము ఒకటింటికి నాలుగువందలు, అయిదువందలు వడ్డీలకుతెచ్చి భూమిమీద invest చేసినప్పుడు, రైతు ఇవ్వవలసిన వడ్డీ, అసలుఅప్పు, యీ Betterment tax, మామూలుగా కట్టవలసిన శిస్తు, ఇవి అన్నీచేరి ఎకరమునకు సుమారు అరవై డెబ్బయి రూపాయలవరకూ చెల్లించవలసిన స్థితివుంటుంది. వడ్డీచూస్తే రైతుకు నూటికి సంవత్సరానికి ఆరుపరసెంటు ప్రకారము దొరికితే, అది నయమే. కాని - ఆ విధంగా చౌకరేటున వడ్డీదొరకక నూటికిరూపాయచొప్పున వడ్డీకి అప్పుతెచ్చుకోగలుగుతాడా అంటే, ఆ ప్రకారము దొరికినా సంతోషమే. ఆ ప్రకారము లెక్కచూస్తే, సంవత్సరానికి వడ్డీక్రింద నూటికి 12 రూపాయలుచొప్పున, అతను ఎకరానికి నాలుగు

అయిదు వందల చొప్పున invest చేసినప్పుడు, ఇక వడ్డీరూపములో నే, అతను బాగుచేసుకున్న పొలముమీద, సంవత్సరానికి ఇవ్వవలసిన బాకీ ప్రభుత్వానికి కట్టవలసినశిస్తు, యీవడ్డీ, ఇక తెచ్చినఅప్పు ఆ విధంగానే నిలబడివుంటుంది. ఈ రెండు అయిటములు మొత్తముమీాస్తే, ఎంత అవుతుందో ఆలోచించండి. అందువల్ల ప్రభుత్వానికి నేను విజ్ఞప్తిచేసేది యేమిటంటే, యీ బిల్లును గతంలో వదలివేసినట్లు, యీనాడుగూడ కొంతకాలమువరకు పైటికి తీసుకొనిరాకుండ, రైతు నిలవదొక్కుకు నేదాకా ప్రభుత్వం ఆగితే, న్యాయము అని నేనుఅనుకుంటాను. అందువల్ల రైతు వర్గములో ఎవరెవరు ఎంతెంత భరించటానికి వీలవుతుందో అదిఅంతా పరిశీలించి, అతనికివున్న బాకీలు, చేసినఖర్చులు, అన్నీపోను, మిగిలినదానిమీద పన్నువేయండి. కాదు, యీ పద్ధతిమీద నే వేయాలని అంటారా, కనీసము పదిఎకరాలు పైనవున్న వారిమీద వేయండి. అంతకు లోపలవున్న వారందరినీ మినహాయించండి. ఇంకనూ యీ బిల్లులో పెట్టిన limit ను మరొక మూడువందలత్సరాలవరకు పెంచితేగూడ బాగుంటుంది. ఇటువంటి relief ఏదీ ఇవ్వకుండావుంటే, రైతుయొక్క పరిస్థితి ప్రభుత్వము మరింత అడుగుకు తొక్కినట్లవుతుంది. ఈసంగతి ప్రభుత్వపక్షమువారు చెప్పటానికి ముందుకు రాకపోయినప్పటికినీ, మేము యీ విధంగా చెప్పటానికి మాత్రము కారణములు వున్నవి. కాబట్టి యీబిల్లు ఇప్పుడు ప్రభుత్వమువారు తెచ్చినది తెచ్చినట్లుగా ప్యాసుచేయడం మంచిదికాదని సభ్యులందరికీ, మంత్రివర్గానికీగూడ విజ్ఞప్తి చేస్తున్నాను.

Sri B. RAMA REDDI :—అధ్యక్షా, మహాశయా, ప్రభుత్వమువారు యీనాడు ప్రతిపాదించిన యీ Betterment bill ను చర్చించేముందు, యీ ఇరవైవేలరూపాయలకు కాకుండా ఒక లక్షరూపాయలకు మించని పన్నులపైన మాత్రమే విధిస్తామని ఒక నిర్ణయానికి వచ్చినందులకుగాని, సెలెక్టుకమిటీ సభ్యులను, P. W. D. మంత్రిగారిని మా బద్వేలు తాలూకా ప్రజల తరఫున నేను అభినందిస్తూ నేను నా ధన్యవాదాలుగూడ అర్పిస్తున్నాను. కారణమేమిటంటే మా బద్వేలు తాలూకానుంచి యేమీకూడ వచ్చేదిలేదు. అక్కడ కేవలం మైనరుప్రాజెక్టులమీద నే పన్నులు ఆధారపడివున్నవి. నూటికి తొంభైఅయిదుపాళ్లు ఒకలక్షరూపాయలలోపుగా వుండే ప్రాజెక్టులు వున్నవి. అందువల్ల యీ బిల్లువల్ల మా తాలూకానుంచి వచ్చేది యేమాత్రములేదు కాబట్టి, యిది మా తాలూకా ప్రజలకు మాత్రము క్షేమకరమైన విషయమేనని చెప్పకతప్పదు. ఇప్పుడు రైతులమీద యీ అభివృద్ధిపన్ను అనేది వేయడము పేదప్రజానీకానికి కష్టతరమవుతుందని కొంతమంది సభ్యుల అభిప్రాయముగా తెలుస్తున్నది. అన్నివిషయములలోనూ, "పన్ను" అనే పదమును తీసివేస్తే, నిజంగా

Sri B. Rama Reddi] [3rd December 1955

మంచిదే రైతులు ఋణభారములోవున్నారు. యీ మధ్యకాలములో ఏవో కొద్ది పంటల వల్ల కొద్దిగా లాభము పొందినప్పటికినీ, రైతు పూర్తిగా ఉన్నతస్థాయిలోకివస్తే బాగుంటుందని చెప్పడమునకు. ఎవరికినీ అభ్యంతరము వుండదు. అది సత్యముకూడా అందువల్ల రైతుయొక్క ఋణభారము నివారించటానికి, రైతు తనయొక్క భూమిని సుక్షేత్రముగా చేసుకొని, ఎక్కువగా పంటలు పండించుకుని, లాభముపొంది, ఆర్థిక స్థితిని పెంపొందించుకోటానికి ప్రభుత్వము ఏదైనా సౌకర్యము కలిగిస్తున్నప్పుడు, దానికి ప్రతిఫలంగా ప్రభుత్వానికి తనకువచ్చే లాభములో ఏకొద్దిమాత్రపు భాగము పన్నుమూలముగా యివ్వడము అనేది సబబే కాని యీ పన్ను ఎంతవేయవచ్చును, రైతుకు ఎంత ఆదాయము వస్తున్నది, అందులోనుంచి ఎంతభాగము పన్నుమూలముగా యివ్వగలడు, అనేవిషయాలుఅన్నీ ప్రభుత్వం పరిశీలించి చర్చిస్తే బాగుంటుంది. రైతుగూడ ప్రభుత్వంవల్ల తనకు ఒకవిధమైన సౌకర్యము కలుగజేస్తున్నప్పుడు, బొత్తిగా పన్నువద్దు అనిచెప్పడంకూడా న్యాయముకాదు. ప్రభుత్వం ఎన్నోలక్షలు, కోట్లు ఖర్చుచేసినందువల్లగదా, రైతుకు ఆ మాత్రము నీటి సౌకర్యము ఏర్పడింది. అనేవిషయము మాత్రము రైతుఅర్థము చేసుకోగలిగితే, ప్రభుత్వము వేసేపన్ను ఎంతఅయినను, దానికి ప్రతిఫలంగా ఆదాయమువస్తున్నది కాబట్టి, పన్నును యివ్వటము న్యాయము. అసలు యీ పన్ను అనేది కాకపోతే రైతుకు కావలసిన సౌకర్యాలు ఎక్కడినుంచివచ్చును ? లేదా మరొక విధమైన ఆదాయము ప్రభుత్వానికి రైతు చూపించాలి. కాబట్టి ప్రభుత్వం రైతుకు సౌకర్యాలుకలుగచేస్తున్నప్పుడు విధించినపన్నును రైతు పన్నుయివ్వడము న్యాయము. పైగా ప్రభుత్వం పన్నువేస్తున్నదని విమర్శించడముగూడా మంచిదికాదు. Betterment levy వల్ల రైతుకు కష్టతరమవుతుందని చెప్పడముకూడా సబబుకాదు. అయితే Betterment levy విషయము వచ్చినప్పుడు, యీనాడు సాధారణముగా కొన్ని భూములు ప్రాజెక్టుక్రిందకువచ్చి కొద్దిఖర్చుతో సాగుకు బాగా లాయకీఅయి పంటలు పండించటానికి తగినవిగావుండేవి కొన్నివున్నవి. అట్లా కాకుండా వేలకొద్దీ, వందలకొద్దీ డబ్బుఖర్చుచేస్తేనేగాని కొన్నిభూములు ప్రాజెక్టులక్రిందకు వచ్చినప్పటికీ, సాగుకు లాయకీగా తయారుకానటువంటివి కొన్ని వుండవచ్చు. కొన్ని పోరంబోకులుగా వున్నవి. ఈనాడు ప్రాజెక్టువచ్చి నీరును సప్లైయిచేసినంతమాత్రాన అందులో వెంటనే పంటలు పండించవచ్చును. రైతులాభము పొందుతాడు అని చెప్పడానికి వీలులేదు. కొన్నిభూములు తక్కువ ఖర్చులోను, కొన్ని ఎక్కువఖర్చుతోనూ తయారవుతవి. ఈ ఖర్చులయొక్క హెచ్చుతక్కువలుగూడ ప్రభుత్వము ఆలోచించవలసివున్నది. — ముఖ్యంగా, మా రాయలసీమలో ప్రాజెక్టులువచ్చి, నీటిసౌక

ర్యము ఎంతచేసిననూ సామాన్యంగా అన్నిభూములున్నూ సాగుకు లాయకీగా చేయడముఅంత సులభసాధ్యముకాదు. రైతు ఎంతో ఖర్చుచేయవలసి వుంటుంది. ఇంత డబ్బు చేసినప్పటికినీ, ఆ భూములలో కొన్ని సంవత్సరాలవరకూ పంటపండించలేదు. అంతవరకు రైతు ఋణము చేస్తూనేవుంటాడు. ఈ ఋణము తీరకముందే, ప్రభుత్వము పన్నుగూడా మరొకవైపున వెనువెంటనే వేయడమనేది కొంత కష్టమేనని గుర్తించాలి. రాయలసీమ భూములలో ముఖ్యంగా సాగుకు లాయికీగా చేసేటంతవరకు, అది ఎన్ని సంవత్సరాలయినను ముందు దానిమీద వేలకు వేలు ఖర్చుచేసినను, ముందు పంట శూన్యం. ఈ సున్ననుంచి వేలకుపోయే మధ్యనవుండే తేడా వేయిరూపాయలు ఒక్కొక్క ఎకరానికి ఖర్చుచేసిన యీ సొమ్ముకు ప్రతి సంవత్సరమూ simple interest మూడు సంవత్సరముల కొకసారి compound interest, చివరకు అదీ యిదీ, అసలు, యిది అంతా యీ రైతునకు వచ్చే పంటలో ఎంతవరకు తీర్చగలడో గూడ ప్రభుత్వం గురిస్తే బాగావుంటుంది. అందువల్ల తక్కువ invest చేసిన వారికి ఎక్కువ పన్ను, ఎక్కువ invest చేసినవారికి తక్కువ పన్ను వేయాలి అని చెబితే, అప్పుడుగూడా భేదభావాలు రావచ్చు. అయినప్పటికినీ యీ Betterment levy అనేది మాత్రం వేరువేరుగా రైతు ఖర్చుచేసిన investment మీద ఆధారపడి ప్రభుత్వం పన్ను విధించడము మంచిదేమోనని నా అభిప్రాయము. ఈ సంగతి ప్రభుత్వం గుర్తిస్తారని, యిది అంతా సామరస్య పూర్వకముగా అన్ని విషయాలు పరిశీలించి పరిష్కరిస్తే మంచిది అనేది ప్రభుత్వం గుర్తిస్తారని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ఇంతేకాకుండా, మొదటి ధరకు, అభివృద్ధి అయిన తరువాత ఉన్న ధరకు మధ్య అర్ధ తేడాతో అభివృద్ధి పన్ను విధిస్తూ దానిపైన వడ్డీ వేస్తాము అంటే, సాధారణముగా 20 సంవత్సరములైన తరువాత వడ్డీ వేసినట్లయితే భేదం 500 రూపాయిలు ఉంటుంది అనుకోండి. 20 సంవత్సరములకు వడ్డీ వేసినట్లయితే దాదాపు అర్ధానికంటే పైన అవుతుంది. అంటే 700 చిల్లరవరకు కట్టవలసి ఉంటుంది. దానిని ఎంతో భాగించవలసివస్తుంది. కనుక "అర్ధం" అనే పదానికి అర్ధమే లేకుండా పోతుంది. అది ముప్పాతిక అవుతుంది. కాబట్టి ఎంతవరకు అభివృద్ధి అయిందో అంతవరకు ఖరీదు కట్టినాము అనే భావము అందులో వస్తుంది. ఈవిషయంలో మాత్రం సగమే అనుకొని, ఆ సగాన్ని 20 సంవత్సరములతో విభజించి ఆ మొత్తము మాత్రమే రైతులనుంచి వసూలుచేస్తే బాగుంటుందేమో వడ్డీ అనే పదం తీసివేసి వడ్డీ లేకుండా, ఎంత అభివృద్ధి పన్ను ఉంటుందో దానిన్నికూడా కొంతవరకు ఆలోచించి, ఇంత అని నిర్ణయించి దానిని 20 సంవత్సరాలకు విభజించి, దానిని రైతుల దగ్గరనుంచి

ప్రతి సంవత్సరమూ వసూలుచేస్తే బాగుంటుందని నాయొక్క భావము. దానిని కొంచెము పరిశీలించమని ప్రభుత్వాన్ని మీద్వారా కోరుతున్నాను.

1947 సంవత్సరము నాటినుంచి కట్టిన వడ్డీపైనకూడా ఈపన్ను విధిస్తాము అన్నారు. ఏనాడో కట్టిన విషయములో ఆనాటి ధరలులేవు, ఈనాడు వారు ఎంతో కష్టపడి వృద్ధికి తెచ్చుకున్నా, వాటి ధరలు ఎక్కువ విపరీతంగా పెరిగి ఉండవచ్చును. వాటికి వీటికి ధరల తేడా గొప్పగా కొంతవరకు ఆనాటినుంచి లేకుండా, ఈ పన్ను విషయమై ఇప్పట్నించి ప్రారంభిస్తే బాగుంటుందేమో అని నా సలహా. అయితే 1947 సంవత్సరమునకు పూర్తి అయిన వాటికి 3 సంవత్సరములనుంచి అనే పదము అనువర్తిస్తుందో, అదికూడా కొంచెము తికమకలుగా ఉంటుందేమో కాబట్టి, దానినికూడా కొంచెము సమన్వయపరచాలని కోరుతూ ఏదైతే నేమి, ఈ అభివృద్ధి పన్నులద్వారా అయితేనేమి, ఇతర పన్నులద్వారానైతే నేమి రైతులకు సవ్యంగా వ్యవసాయము చేసుకొనే దానికి ఆధారాలను త్వరగా కలుగజేసే, రైతులు ఈ భారమునుంచి విముక్తి పొందేలాగున ప్రయత్నము చేస్తారని ఒకతూరి ప్రభుత్వవారికి సలహా ఇస్తూ, అభినందిస్తూ ఈ అవకాశము నాకు ఇచ్చినందుకు మీకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

SRI SHEIK MOULA SAHEB :—అధ్యక్షా, ఈరోజు ఏ మాత్రము విలువ లేనటువంటి భూములకు విలువ వస్తే వారు ప్రభుత్వమువారికి అర్ధభాగం అభివృద్ధి పన్ను ఇవ్వడము న్యాయమే. వారికి ఎక్కువ సహాయము కలుగజేసినప్పుడు ప్రభుత్వము, వాయిదా పద్ధతులలో 20 సంవత్సరములకో, 10 సంవత్సరములకో అర్ధభాగం తీసుకోవడము అనేదికూడా అంత బాధకరంగా ఉండదు. అయితే ఇప్పటివరకు అభివృద్ధిలో చేరని భూములు చాలా ఉన్నాయి. ఇటువంటి వాటికికూడా అభివృద్ధిలోకి తీసుకొనివచ్చుటకు ప్రభుత్వం 120 కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నందికొండ ప్రాజెక్టు కట్టమన్నారు. ఈ 5 సంవత్సరములలో కలిగిన అభివృద్ధి ఇకమీదట కలుగబోదు. ఈ నందికొండ డామువల్ల తప్ప ఇక వేరే రకంగా, నీటి వసరులు కలుగని, తాలూకాలు కొన్ని ఉన్నాయి. అదిమెట్ట తాలూకాలు అయినప్పటికీ రాయలసీమ కంటే ఇంకా ఎక్కువ అధ్వాన్నముగా ఉన్నాయి. ఏజన్సీ గ్రామాలకన్నా అధ్వాన్నముగా ఉన్న గ్రామాలు ఈనాడు నెల్లూరు జిల్లాలో దర్శి, పొదిలి, కనిగిరి, ఆత్మకూరు, ఉదయగిరి, రాపూరు, వెంకటగిరి, తాలూకాలు ఉన్నాయి. అక్కడ భూములకు నీటివసరులు నందికొండ channel నుండి. ఒక కాలవను త్రవ్వితద్వారా కలిగించాలి గాని, లేకపోతే ఇంకొక జన్మలో ఇంకేవిధంగానూ అక్కడకు నీరురాదు. అక్కడ ఇంకా ఏ ఇతర నీటి వసరులులేవు.

ఏ జీవనదులులేవు. ఇటువంటి ప్రాంతానికి ఇటువంటి డాము కట్టి అక్కడ ఉన్న అసలు విలువలేని భూములకు విలువచేకూరుస్తున్నాము. అందువల్ల అర్థ భాగం ప్రభుత్వానికి శిస్తుగా ఇవ్వాలని అడుగుతున్నారు. ప్రభుత్వంవారు యీ ప్రాంతాలవారిమీద కొంచెము దయయుంచి ఇంకా తక్కువ రేట్లు పడేటట్లు చూడాలి. ఎందుకంటే అది ఏజన్సీ ప్రాంతముకన్నా హీనమైనది. జిల్లా పేరు చెప్పితే, మీ జిల్లాకు ఏమి కరువు అంటున్నారు. ఈ మెట్ట తాలూకాలన్నీ కలిపి ప్రత్యేక జిల్లా చేస్తే చాలా బాగుపడుదురు. ప్రభుత్వం, పై తాలూకాలను దృష్టిలో పెట్టుకొని నందికొండ నీరు, వారి భూములకు పారేటట్లు, వాటికికూడా విలువ వచ్చేట్లుచేసి, అర్థభాగం డబ్బు ప్రభుత్వం తీసుకోవడము, మంచిదని నేను ప్రభుత్వాన్ని ప్రార్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, ఈబిల్లు ఇప్పటికి మూడు పర్యాయాలు అసెంబ్లీముందుకు రావడము తిరిగి మరల ప్రజల ఒత్తిడివల్ల శాసనసభ్యులలో అన్నిపక్షాలవారియొక్క ఒత్తిడివల్ల ఈబిల్లు తిరిగి వెనుకకు వెళ్లడము జరుగుతూ వచ్చింది. ప్రభుత్వము పైకి మాత్రము చాలా ప్రాజెక్టులు కట్టాము అని చెబుతూంటారు. అందులో మంత్రిగారు చాలా తక్కువవడ్డితో, వడ్డీ గిట్టుబాటు కాని ప్రాజెక్టులు కట్టడము జరిగింది, భూములు చాలా అభివృద్ధిచెందడం అనేది కూడ జరిగింది, అందులో సగంభాగంమాత్రమే అడిగాము, అది న్యాయమే అని, న్యాయమూత్రాన్నికూడ చెప్పడము జరుగుతూ వస్తున్నది. అయితే ఇది న్యాయమని మనము ఆలోచించేప్పుడు, ఈనాడు వ్యవసాయరూపము ఏ విధముగా ఉన్నది, రైతులయొక్క స్థితి ఏ విధంగా ఉన్నది, మనం ఎప్పటికప్పుడు పన్నులు వేసుకుంటూపోతే, గతంలోవేసిన పన్నులవిషయం తిరిగి మనము ఆలోచించుకోవలసిన అవసరము లేదా ? రైతాంగం పన్నులుచెల్లించే స్థితిలోఉన్నదా ? అనేవిషయాములన్నీకూడ మనం ఆలోచించుకోవలసిన అవసరము ఉన్నది. మన శాసనసభారూపము చూచుకుంటే, గతశాసనసభ ఈ సభలనుచూస్తే ప్రత్యేకించి పన్నులువేయడానికి మాత్రమే ఈ సమావేశములు జరుగుతూ ఉన్నాయా అని మనకు స్పష్టంగా బోధపడుతూ ఉంటుంది. ఈ రూపంలో మనము పన్నులు వేసుకుంటూపోతే మిగిలిన ప్రజానీకముయొక్క స్థితి ఎట్లాఉంటుంది ? ఎంతవరకు చెల్లించగలుగుతారు అనిచెప్పి ఆలోచించవలసిన అవసరము చాలా ఎక్కువగా వున్నది. ఈ బిల్లువల్ల అసలు ఎవరిమీద పన్నుభారం ఎక్కువగా పడుతుందో అనేదికూడ ఆలోచించాలి. బాగా వెనుకబడిన ప్రాంతాలు, కరువుతోనూ కాటకాలతోనూ బాధపడే ప్రాంతాల్లో ప్రజానీకం అక్కడ ప్రాజెక్టులుకట్టాలి, ఇక్కడ కట్టాలి, అని చాలా కాం

Sri V. Visweswara Rao] [3rd December 1955

ముగా ఆందోళన చేస్తున్నది. ఆ ప్రాంతాలలోనే కొన్ని ప్రాజెక్టులు కట్టడము జరిగింది. ఆ ప్రాజెక్టులను estimate చేసేప్పుడుగాని, అక్కడ గిట్టుబాటు లేదుఅనే సంగతి ప్రభుత్వానికి తెలుసు. అయినప్పటికీకూడా అక్కడవున్న కరువు నివారణ కొరకు, అక్కడవచ్చే కొటకొల నివారణకొరకు, ఈ ప్రాజెక్టులను కట్టడము జరుగుతూఉన్నది. ఈ ప్రాజెక్టులను కట్టితే వచ్చేఫలితము ఏమిటి? నందికొండ, తుంగభద్రాలో—లెవెల్ ఛానల్, హై-లెవెల్ ఛానల్ తీసుకురావడము జరుగుతూ ఉన్నది. తుంగభద్రకొరకు సుమారు 20 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాము. ఈ కొలువల క్రిందవున్న భూములన్నింటిమీద, ఈ బిల్లురూపంలో పన్నులు వేయడానికి ప్రభుత్వము పూనుకొంటున్నది. నిన్నటిరోజున Compulsory Cess అనేది నిర్ణయించాము. ఈరోజు Betterment Tax అనేది నిర్ణయిస్తున్నాము. అది ఇప్పుడు జరుగుతున్నది ఇది ఎంతవరకు జరుగుతూ ఉన్నది? కాబట్టి రైతులకు సుమారు నీటితీరువ చెల్లించుకోవడము, భూమిపన్ను చెల్లించుకోవడము, Betterment Tax చెల్లించుకోవడము ఇవన్నీకలిపి ఎకరానికి 5 రూపాయలవరకు పోయే ప్రమాదము లేకపోలేదు. ఈ విధముగా పన్నులు పెంచుకుంటూపోతే ఇప్పుడిప్పుడే భూములన్నీ ఫలసాయములోకి త్రిప్పాలని ప్రయత్నముచేసే రైతులు తాము 50 రూపాయలు చెల్లించాలంటే అది సాధ్యముఅవుతుందా అనికూడ మనము ఆలోచించుకోవలసిన అవసరము ఉన్నది. ఒకవైపున పంటలయొక్క ధరలు ఆనాటికానాడు వెనుకకుపోవడముకూడ జరుగుతూవున్నది. ఫలసాయము చేతికిచ్చినరోజులు, రైతులు తమచేతులలోకి డబ్బుకావాలని కోరుతున్నటువంటి రోజుల్లో వాటికి ధరలు తగ్గిపోవడము జరుగుతున్నది. ప్రత్యేకించి ఈ సంవత్సరం ధాన్యంబస్తా 12, 13 రూపాయలకు అమ్ముతూవుంటే 50 రూపాయలు శిస్తుచెల్లించాలంటే, తనకు పండినపంటలో సగము పన్నులరూపంలోపోతే ఇక ఖర్చులు ఏమిభరిస్తాడు? తమకుటుంబపోషణ ఏవిధంగా చేసుకోగలుగుతాడు? అనికూడ మనము ఆలోచించుకోవలసిన అవసరము ఉన్నది. నాకుకూడ యిందులో కొంచెము అనుభవం ఉండబట్టి చెబుతున్నాను. మా కైకలూరు తాలూకాలో ఈమధ్యన కొన్నిసంవత్సరముల క్రిందటనే సాగులోకి వచ్చిన కొన్నిప్రాంతాలకు వెళ్ళితే, ఆ ప్రాంతంలో అనాది సిద్ధంగా వున్నటువంటి ప్రజానీకము అంతాకూడా తమభూములన్నీ పోయినాయని చెప్పారు. ఎందుకు పోయినాయంటే వాళ్లు ఈవిధంగా చెప్పుతారు. మా భూములను సాగులోకి తీసుకొనివచ్చుటకు చాలాఖర్చులై అప్పులపాలైనాము. వడ్డీలకు వడ్డీలుపెరిగి చివరకు వడ్డీనితీర్చలేక భూములన్నింటినికూడ కట్టివేయాల్సి వచ్చింది. ఈ భూములన్నీ మావే అన్నీ అక్కడ వున్నటువంటి, యాదవులు, గౌడులు, నాయుడులు అందరూకూడ చెప్పడం సహజంగా జరుగుతూ ఉంటుంది. అదేవిధంగా ప్రజానీకంమీద పన్నులు

వేయడం జరిగితే, చివరకు వాళ్లు తమదగ్గరవున్న, పొలాలను అమ్ముకుపోవలసిన పరిస్థితులు ఏర్పడుతాయేగాని అంతకన్నా వేరేలేదు. అందువల్ల ఈ భూములమీద పన్నులు విధించేప్పుడు తప్పకుండా రైతులు మోసేస్థితిలో ఉండాల్సిన అవసరము ఉన్నది. అందువల్ల చిన్నకారు రైతాంగము అందరినీకూడ దీంట్లోనించి మినహాయించాల్సిన అవసరము చాలాఉన్నది.

ఆ విధంగా చేయకపోతే ఈ పన్నుల భారంతో చిన్నరైతులు విడిపోయి మార్గంలేక తమ భూములను అమ్ముకోవలసిన అవసరంవస్తుంది. నందికొండ ప్రాజెక్టు కాని, తుంగభద్ర High Level channel గాని Low level channel గాని శ్రీకాకుళంజిల్లా ప్రాజెక్టులుగాని ఏ ప్రాంతానికి వెళ్లుతున్నాయని ఆలోచిస్తే వెనుకబడిన ప్రాంతాలకు బీదప్రాంతాలకు వ్యవసాయం గిట్టుబాటుకాక అప్పుల భారంతో క్రుంగే ప్రాంతాలకు వెళ్లుతున్నాయి. అటువంటి ప్రాంతాలలో ప్రాజెక్టులు కట్టినపుడు ఆ ఖర్చులక్రింద డబ్బుకావాలని నిర్ణయించడం సరిఅయినది కాదు. ఈ నిర్ణయాన్ని మార్చుకోవాలని కోరుతున్నాను. మంత్రిగారు చెబుతూ భూమిమీద అభివృద్ధినిబట్టి కొంతడబ్బు వస్తుంది కాబట్టి మాకు కొంత ఫలసాయం ఇవ్వాలని అన్నారు. అందులో రెండుపద్ధతులు సూచించారు. మద్రాసు రాష్ట్రంలో ప్రవేశపెట్టినచట్టం మాదిరిగా భూమినుంచివచ్చిన పంటనుబట్టి చూడాలని ఒకటి, రెండవది బొంబాయిరాష్ట్రంలో ప్రవేశపెట్టిన విధంగా భూమివిలువనుబట్టి చూడాలని చెప్పారు. వీటిని నిర్ణయించడం చాలాకష్టం. భూమిమీద పంటఅంటే ఖర్చులుఎంత ? బాగుచేయడానికి ఖర్చుఎంత ? వాటిని తేల్చడంలో చాలా పేచీలు ఉంటాయి. వీటిని తేల్చడంలో ఉద్యోగస్థుల దయాదాక్షిణ్యాలకు వదిలివేయడం జరుగుతుంది. ధరల విషయంకూడా అనేకవాటిపై ఆధారపడి ఉంటుంది. మార్కెటుకుదగ్గరఉండేపంట, వ్యవసాయ వస్తువులకు ఉండేధరలు వీటన్నింటిపై ఆధారపడి ఉంటాయి కాని భూమిధర అంటే కాదు, కృష్ణాజిల్లా తీసుకుందాము. బుడమేరుమీద ముురుగు నివారణ ప్రాజెక్టుఅని కడుతున్నారు. ఈ ముురుగు నివారణ ప్రాజెక్టు కట్టినతరువాత వ్యవసాయక పంటలధరల తగ్గిపోతుంటే భూములధరలు పెరుగుతాయిఅంటే నేను నమ్మలేను. ప్రభుత్వంమాత్రం 1954 వ సంవత్సరంలోను 1958 వ సంవత్సరంలోను registration విలువలుబట్టి ధరలు పెరిగాయిఅని చెప్పడానికి పూనుకోవచ్చును, ధాన్యంధరలు ఎప్పుడైతే తగ్గుతాయో భూముల ధరలుకూడా తగ్గేప్రమాదం ఉన్నది. అస్సాములో మరొకపద్ధతిన చట్టం ప్రవేశపెట్టారు. ఈ ఆ పద్ధతిలో చట్టాన్ని ప్రవేశపెట్టడానికి పూనుకోవచ్చును. Betterment tax, నీటితీరువ వీటన్నింటినికలిపి పెట్టుబడికి 6½% కంటె ఎక్కువవడ్డీ

Sri V. Visweswara Rao] [3rd December 1955

రావనవసరంలేదని ఆ పద్ధతిపై పన్ను విధించాలని అన్నారు. దీనిని దృష్టిలోనికి తీసికొని నిర్ణయిస్తే చాలా తేలిక అవుతుంది. ఈ పద్ధతిలో పన్ను వేస్తే ఆ ప్రాంతీయులు పన్ను చెల్లించడానికి కుతూహలురు అవుతారు. ఆవిధంగా చేయాలని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. ప్రభుత్వం Pumping scheme లో మురికి కాలువలకు కట్టలుకట్టడంకూడా తీసుకువచ్చారు. ఏలూరు కాలువక్రింద 20 వేల ఎకరాలు ఎడమవైపున సాగుచేస్తున్నారు. Pumping projects పేరుతో నీళ్లు తోడుకునే యంత్రాలుకూడా వాళ్ళే పెట్టుకున్నారు. కాలువలు వాళ్లు స్వయంగా త్రవ్వుకున్నారు. నీటితీరువ అనే పేరుతో పన్ను చెల్లిస్తున్నారు. రెండవవైపున యంత్రాల ఖర్చులు, కాలువల maintenance వారే భరిస్తున్నారు. గుంటుపల్లి పంపింగు స్కీముక్రింద సుమారు రు. 2½ ల వరకు రైతులకు అవుతుంది. రు. 7-8-0 లు ప్రభుత్వానికి నీటి తీరువ చెల్లిస్తున్నారు. యంత్రాలకు రు. 13-8-0, రు. 14 ల వరకు చెల్లిస్తున్నారు. 1947 సంవత్సరం తరువాత పంపింగు స్కీముక్రింద నీరు ఇస్తున్నాము కాబట్టి Betterment Tax వేయాలని చూస్తున్నారు. పడమట పంపింగుస్కీము అని ఉన్నది. దీనిని ప్రభుత్వం నిర్వహిస్తున్నారు. దీనిక్రింద ఎకరానికి సుమారు రు. 20 లు, రు. 25 లు పైన పన్ను చెల్లిస్తున్నారు. దానికి ప్రభుత్వం department maintenance, మిగతా ఖర్చులు భరించవలసియున్నది. వీటిని తమంత తాముగా నిర్వహించనవసరంలేదని చెప్పినా ఈ పడమట పంపింగుస్కీము ప్రభుత్వమే నిర్వహిస్తోంది. ఇది ఒక Model గా జరుపుతున్నాము అని చెప్పారు. ఇటువంటి చోట్ల వేయడంఅంటే మొత్తం 60, 70 వేల రూపాయలవరకు పెరిగిపోయే ప్రమాదం ఉన్నది. వీటిని మినహాయించవలసిన అవసరం ఉన్నది. మరొక విషయం ఏమిటంటే మూడు సంవత్సరాలు తరువాత వసూలుచేస్తాము అంటున్నారు. నిన్న ఒక విషయం మంత్రిగారు ఒప్పుకున్నారు. బాగా పంటలుపండే కృష్ణాజిల్లా సంగతి తీసుకున్నా, saline water ఉన్నది. బందరు తాలూకా శివార్లలో రెండు మూడు సంవత్సరాలవరకు ఫలసాయం చేతికిరాదు. చవుడు బైటకు వెళ్లగొట్టవలసియున్నది. మంచినీరును పెట్టి భూమిని శుభ్రపరచవలసియున్నది. ఈ విషయం మంత్రిగారుకూడా చెప్పారు. మూడు సంవత్సరాల్లో పన్ను వసూలుచేస్తామంటే ఆభూమిని ఫలసాయంలోనికి తీసుకురావడానికి శ్రద్ధగా పనిచేయవలసిన అవసరం ఏర్పడుతుంది. ఉప్పునీరు ప్రాంతాలలో భూములు ఫలసాయంలోనికి తీసుకు రావడానికి చేసేకృషిలో మూడు సంవత్సరాలు పడుతుంది. ఒక ప్రక్కన భూమిని ఎంతో శ్రమపడి ఫలసాయంలోనికి తీసుకురావాలని ప్రయత్నంచేస్తాడు. రెండవప్రక్క ప్రభుత్వానికి నీటితీరువ, Water Cess కట్టవలసిన పరిస్థితులు కలుగుతాయి, చివరకు అప్పులపాలు అవుతాడు కాని పంటపండించడానికి ఉద్యుక్తుడుకాడు. అనేకమంది రైతులు

భూములను కోల్పోతారు. కృష్ణా డెల్టాక్రింద నజరానా ఉన్నదని తెలుసును. ఇదికూడా అయిదు సంవత్సరాలు రు 5 లు చొప్పున ప్రభుత్వానికి ఇచ్చారు. ఒక సందర్భంలో రు 2-8-0 చేశారు. రు 5 లు కాదని 10 సంవత్సరాలు రు 2-8-0 ఇవ్వాలని చెశారు. ఈ సందర్భంలో Betterment Tax నిర్బంధంగా విధించాలని శాస్త్రరీత్యా అంగీకరించడం న్యాయంకాదని అభిప్రాయపడుచున్నాను. వడ్డీకి కావలిసినంతగా పన్ను వేయడానికి ఆక్షేపణలేదని చెబుతున్నాను. పబ్లికేషనును గవర్నమెంటు గెజెటులో ప్రకటిస్తాము; దానిపై కలెక్టరుకు రివెన్యూబోర్డుకు గవర్నమెంటుకు అప్పీలు చేయవచ్చునని అన్నారు. అప్పీలు అని పేరుకుమాత్రం ఉన్నాయి. ఎంతమంది ఉద్యోగస్థులదగ్గరకు పోయి వారి కష్టసుఖాలు చెప్పకో గలుగుతున్నారు ? ప్రతివారిదగ్గరనుంచి Appeals వస్తే ప్రభుత్వం ఆలోచించగలదా ? క్రింద ఉద్యోగులు కాని రివెన్యూబోర్డు కాని ఎంతవరకు ఆలోచిస్తారు ? ఎక్కడైనా harshness ఉంటే చూస్తామనే బదులు పన్ను వేసేటప్పుడే harshness లేకుండా చూడాలని కోరుతున్నాము. Time నుకూడా పొడిగించాలని కోరుతున్నారు. Tax వేసేటప్పుడుకూడా వడ్డీ ననుసరించి వసూలుచేయాలని అది మోయలేనిబరువు అని అంగీకరిస్తూనే వడ్డి కట్టాలని అంటున్నారు. వడ్డీకి వడ్డీకట్టే పద్ధతి పూర్తిగా తొలగించాలని మీద్వారా ప్రభుత్వంవారిని కోరుతున్నాను.

SRI G. JAGANNADHA RAJU :—అధ్యక్షా, గౌరవనీయులైన రెవిన్యూ మంత్రిగారు ప్రవేశపెట్టిన అభివృద్ధిపన్ను బిల్లును నేను సమర్థిస్తున్నాను. ఈ Bill మన సభవారిచేత Select Committee కి పంపబడి వారందరిచేత సమగ్రంగా పరిశీలింపబడి మన ఎదుటికివచ్చిన తరువాతకూడ ప్రతిపక్షంలోని చాలామంది సభ్యులు అసలు పన్నులు విధించడం అవసరమా, పైగా పేదప్రజానీకంమీద యీపన్ను పడుతున్నది కనుక ఇదిఏమాత్రం సమర్థనీయంకాదని Taxation Enquiry Committee వారు చెప్పినసిద్ధాంతాలకు వ్యతిరేకంఅని విమర్శలు చేస్తున్నారు. నేను వారందరికీ మనవిచేసే దేమిటంటే ఒకసారి ఇది Select Committee కి పంపబడిన తరువాత తిరిగి వచ్చినప్పుడు సిద్ధాంతం principles of taxation ఒప్పుకున్నాం అని అంగీకరించవలసి వస్తుంది. Taxation పరిమితం ఎంతలో ఉండాలి అనేది విమర్శచేయాల్సి ఉంటుందితప్ప అసలు principle నే వ్యతిరేకించి చర్చించడం భావ్యంకాదు. సాంప్రదాయంకాదు. ఇప్పుడు యీ పరిమితాన్ని గురించి ఆలోచించునపుడు కొందరు అనేకవిమర్శలు చేశారు. ప్రభుత్వపక్షం తరఫునకూడ రాజగోపాల నాయుడుగారుకూడా యిదేఅభిప్రాయంతో ఉన్నారు.

SRI V. VISWESWARA RAO :—ఈ discussion చేయడం సరి కాదని వారు చెప్పారు. Composite State లో Select Committee కి పంపించినతరువాత చర్చలలోనే యీ బిల్లును ఉపసంహరించడం జరిగింది. అదిసాంప్రదాయమే అని చెబుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—రాజాగారు చెప్పింది principle అన్నారుగాని details చర్చ చేయవద్దనలేదు.

SRI G. JAGANNADHA RAJU :—బహుశః నేనుచెప్పింది విశ్వేశ్వరరావుగారు అర్థంచేసుకోలేదను కుంటున్నాను.

రాజగోపాలరావు నాయుడుగారు మాట్లాడుతూ Bill లోని provision చూసినట్లయితే యీ Betterment Levy క్రింద ఇతర ప్రదేశాలలోకూడా ఎకరానికి 300 వేస్తారనుకుంటున్నాను. కాని యీ provision చూచినట్లయితే కొందరు సభ్యులు సూచించినట్టి సూచనలప్రకారం ప్రభుత్వం work ప్రారంభించిన తరువాత భూమివెలలో తేడా 1000 వరకు ఉంటుంది. ఇందులో సగం 500 వరకు ఉంటుంది. అందుచేత హెచ్చుగా కనిపిస్తుంది. దీనిగురించి ఆలోచించవలసినదని కొందరు సభ్యులు సూచించారు. ఈ provisionలో స్పష్టంగా ఏమి ఉన్నదంటే,

"The amount of contribution payable by an owner in respect of any land under a work shall be so fixed as not to exceed one-half of the increase in value on account of the completion of the construction, expansion or alteration of the work." అని ఉన్నది.

అందుచేత సగానికి ఎన్నడూ మించకుండా maximum fix చేశారు తప్ప ప్రభుత్వం తప్పనిసరిగా యీ విషయాలన్నీకూడా దృష్టిలో పెట్టుకొని amount fix చేయడం ఉంటుందని, అదే ప్రభుత్వం ఉద్దేశంఅని దీనివల్లనే స్పష్టమవుతుంది. దానిని బలపరచడానికి 6 clause (b) లో కూడా ఈవిధంగా ఉన్నది.

"(a) the lands concerned under the irrigable command of the work,

(b) the increase in value of such lands by the completion of the construction, expansion or alteration of the work."

3rd December 1955] [Sri G. Jagannadha Raju

దానినిగురించి ఆ సందేహంకూడా పెట్టుకోడానికి తావులేదని మనవిచేస్తున్నాను. తరువాత ప్రతిపక్షసభ్యులలో వెంకటేశ్వర్లుగారు మాట్లాడుతూ సహజంగా 1947 సంవత్సరం ధరలకూ 1953 సంవత్సరాల ధరలకూ చాలా తారతమ్యం వచ్చింది. Buildings విలువ హెచ్చయినది. వాట్లమీద ఏమిపన్ను వేస్తున్నాము. భూములవిలువ పెరిగినంత మాత్రంచేత పన్నులువేయడం ఎంతవరకు సమర్థనీయమని అన్నారు. వారికి నేను చెప్పేది యేమిటంటే ఇందులోనే స్పష్టంగా సహజంగా పెరిగిన విలువవే కారణం.

"The amount of contribution payable by an owner in respect of any land under a work shall be so fixed as not to exceed one half of the increase in value on account of the completion of the construction expansion or alteration of the work" అని బిల్లులో ఉన్నది. పెరుగుదలకూడా అభివృద్ధిచేసిన పనిని బట్టి పెరుగుదల అని స్పష్టంగా clause లో వున్నది. అదికూడా ప్రభుత్వం దృష్టిలో పెట్టుకుని దీనికి సంబంధించిన నిర్ణయం చేస్తారు తప్ప మరొక విధంగా నిర్ణయం చేయడానికి ఏ విధమైన తావులేదు. కొందరు సభ్యులు విమర్శ చేస్తూ 30 Instalments చేస్తే బాగుంటుంది. 3 ఏండ్లను 5 ఏండ్లకు పెంచితే బాగుంటుంది అన్నారు. వారికి నేను మనవిచేసేది ఏమిటంటే, ప్రభుత్వం యిదివరకు ఏ అప్పులు యిచ్చినా యింతవరకు చేసిన దానినిబట్టి 20 వాయిదాలకంటే హెచ్చు కుండా వుండాలని ఒక నియమం వున్నది. అందుచేత 20 వాయిదాలు పెట్టారను కుంటున్నాను. అంతేకాని యిది పేదలమీద రుద్దుదామని చేసినదని అనుకోడానికి అవకాశంలేదు. తరువాత వెంకటేశ్వరరావుగారు చెబుతూ ఎక్కువగా యీ అభివృద్ధి పన్ను అంతా వెనుకబడిన ప్రాంతాలమీద పడుతుంది. యిది న్యాయంకాదని చెప్పారు. వారిని సూటిగా ప్రశ్నిస్తున్నాను. న్యాయంచేత యిపుడు గవర్నమెంటు ధనాభావంచేత బాధపడుతూ ఎక్కువ అభివృద్ధి మార్గాలు ఏర్పాటు చేయవలసినపుడు ఆ ఖర్చుపెట్టి దానిని రాబట్టే ప్రయత్నం చేయడం సమంజసమా కాదా అని, అది చేయడంలో Agricultural incometax ద్వారా ప్రభుత్వం ఆదాయం చేకూర్చుకోవచ్చు. రెండోది ప్రత్యేకం అభివృద్ధి పన్నువల్ల చేకూర్చుకోవచ్చు. తరువాత ప్రతిపక్ష సభ్యులు మాట్లాడుతూ Taxation Enquiry Committee వారి సిఫార్సులమీద ఎక్కువగా ప్రాధాన్యత యిచ్చారు. అందులో Taxation Enquiry Committee కూడా యీ Betterment Levy గురించి వారు చర్చించారు. పేద రైతులమీద భారంలేకుండా చూడమన్నారు. Agricultural Incometax వేస్తే Taxation Enquiry Committee కూడా యీ అభివృద్ధి

పన్నుగురించి ఏమీ ఆక్షేపణ చేయలేదు. అందుచేతనే యిప్పుడు యింతవరకు Select Committee మన ఎదుటకు పంపించిన report లో యిదివరకున్న సందేహాలన్ని పూర్తిగా కృషిచేసి clarify చేసివున్నారు. అందుచేతనే యధాతథంగా యిప్పుడు యీ బిల్లును అంగీకరించవలసినదని సభ్యులను కోరుతున్నాను.

SRI A. YERUKU NAIDU:-అధ్యక్షా, ఇప్పుడు విధించబోయే Betterment Levy Contribution పన్నుతో భూమిపైన మూడు పెద్ద పన్నులు పడుతున్నాయి. నిన్ననే Compulsory Water Cess యీ శాసన సభలో sanction అయినది. దీనితో మూడు పన్నులు అవుతవి. మనం పరాయి ప్రభుత్వం క్రింద ఉన్నప్పుడుకూడా భూమిపై యిన్ని పన్నులు కూడదని agitate చేశాము. పూర్వం జమీందారీ గ్రామాలలో శిస్తులు హెచ్చుగా వున్నాయనికూడా యీ కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలోకి వచ్చినపుడు శిస్తు భారం తగ్గించడానికి Rent Reduction అనేటటువంటి Act చేసి రైతులకు ఉపకారం చేసి ఉన్నారు. ఐతే అపన్నీ మరచిపోయి ఒక భూమిపై మూడు పన్నులు వేయడం హాస్యాస్పదంగా కన్పిస్తున్నది. అభివృద్ధి పన్ను అనేది నీటిని ప్రవహింపచేస్తున్నారు కాబట్టి వేస్తున్నామన్నారు. మరి నీటి పన్ను ఎందుకు? ఎంతవరకు రైతు యీ పన్నులన్నీ భరించగలడు అనే ప్రశ్న ఆలోచించవలసియున్నది. ఎకరానికి 50, 60 రూపాయలు పన్ను మూలంగా చెల్లించి, భూమిమీద 100 రూపాయలవరకు ఖర్చుపెడితే 150 200 రూపాయలవరకూ అవుతుంది. అందుచేత సన్నకారు రైతులకు- 5 ఎకరాలున్న సన్నకారు రైతులకు-exemption యిస్తే బాగుంటుందని సూచిస్తున్నాను. కాబట్టి యీ bill pass చేసేముందు అటువంటి exemption కూడా చేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తారని నేను నమ్ముతూ విరమిస్తున్నాను.

SRI A. BHAGAVANTHA RAO :-అధ్యక్షా, Opposition పార్టీవారి trend of discussion చూస్తే principles of taxation మీద ఆధారపడకుండా tactics మీద ఆధారపడినట్లు ఉంది. ఇక్కడ principles tactics అనే సమస్యతెచ్చి రాయలసీమ సభ్యులారా మీరు చూడండి మీకు ఎక్కువ పడింది, అని అనడం tactics కాదు. Principles accept చేసినపుడు అది ఎంతవరకు అని ఆలోచించి తర్జన భర్జన చెయ్యవలెను. Taxation వెయ్యడములో రైతులకు భారంగా ఉంటుందని చెప్పడము కాదు. అసలు Taxation మంచిది కాదని సోషలిస్టులు సభ్యులుకూడా చెప్పడము చాలా విచిత్రముగా ఉంది. మనకు ఒక principle ఉంది. Socialistic Pattern of Society అంటున్నాము. కమ్యూనిస్టులుకూడా సోషలిజము కావాలంటున్నారు. అది establish చెయ్యడానికి

మనము అనుకుంటున్నాము. దీనికి 2, 3 డిమాండును అన్నాము. (1) Collective system of thinking. (2) By way of taxation on the deference betweem the rich and the poor reduce చెయ్యవచ్చును. ఈ రెండూచేస్తే Socialism రావడానికి అవకాశముఉంది. మన Indian socialistic thinking, బ్రిటిషు socialistic thinking కూడా అదే. By way of reducing the defference between rich and the poor అని ఉన్నది. Dalton ఈ Betterment tax ను define చేస్తూ ఇలా చెప్పాడు.

" A device for securing to the public treasury the unearned increment in the value of the fixed property."

దానికే అమెరికను Counter seligmam ఏమన్నాడంటే.

A compulsory contribution levied in proportion to the specific benefits derived, to defray the cost of a specific improvement of property undertaken in the public interest.

పోతే కమ్యూనిస్టుపార్టీవారు చెప్పేది ఏమిటంటే వెంకటేశ్వర్లుగారుచెప్పిన దాన్నిపట్టిగాని వారి dissent note ను బట్టిగాని నాకు అర్థంఅయింది. వారు Seligmam చెప్పినదానికి అనుగుణంగా ఉన్నట్లు తెలుస్తుంది. To defray the cost of a specific improvement అని చెప్పాడు. Specific improvement జరిగితే cost కు సంబంధించినంతవరకు మాత్రమే Betterment Tax వెయ్యవలెనని, అంతకు మించి వెయ్యకూడదని Seligman సిద్ధాంతములో ఉన్నది. అదేమాట dissent voice లో సుందరయ్యగారు, వెంకటేశ్వర్లుగారు చెప్పిన దానితో We suggest that the betterment levy be calculated on similar basis as in Assam to recover the cost of the benefit schemes fully or partly.

దానిలో స్కీముయొక్క cost reduce చెయ్యడానికి Betterment tax వెయ్యవలెనని అస్సాములో ఉన్నది.

Sri P. SUNDARAYYA :—అలాంటి Tax వేస్తే బాగుండునని అన్నాము. పూర్తిగా చదవడం మంచిది. ఒకవాక్యం తీసి పెడర్థాలు తీయకూడదు.

Sri A. BHAGANAVTHA RAO :—పూర్తిగా చదివాను. Apart from that, ఈ basis of collection of this contribution ఏవిధముగా ఉండవలెను ? ఖచ్చితముగా improvement కు సంబంధించిన cost వసూలు

చెయ్యవలెను. కొట్టి కోటిరూపాయలు ఖర్చుపెట్టి improvement contributary betterment tax కోటికన్న ఎక్కువ వెయ్యకూడదు అనే సిద్ధాంతం మీద ఆధారపడిచేసిన సిద్ధాంతముగా ప్రతిపక్షసభ్యులు ఒప్పుకోనవలెను. అవి పెట్టినను చెప్పినది, అంతకంటె progressive view ఉండదు. Dalton సిద్ధాంతములో అలాంటిది ఏమీ కనబడలేదు.

"A device for securing to the prblic treasury the unearned increment in the value of the fixed property." అంటే fixed property లో improvement చేసిన దానికి increased value ను Public Treasury కి తీసుకోవచ్చుననే సిద్ధాంతము స్కీముకు ఎంతఖర్చు అయినదో అంతా రాబట్టితే వచ్చుననే సిద్ధాంతములేదు. ఈ సిద్ధాంతమును ఆధారముచేసికొనే ఈ Tax వేసినారని సభ్యులకు చెబుతున్నాను. Principle accept చేసిన తరువాత మూడు, అయిదు, ఇరవై, ముప్పై. సంవత్సరాల instalments లో కట్టాలంటె simple piece of fact తగాదాలకు అవకాశం లేదు. 20 సంవత్సరాలలో కట్టేటట్లు చెయ్యడమే salient feature of the bill. మూడు సంవత్సరాల తరువాత వసూలుకు ఆరంభించడంకూడా salient feature of the bill. దానిలో Lower income groups ను గురించి చెప్పవలసి వచ్చినప్పుడు legal గా కాకపోయినా, principle గా కాకపోయినా వారిని exempt చెయ్యడము మంచిదిగా ఉన్నది. Opposition చెప్పినది justifiable గా ఉన్నది. ఇక Interest తీసుకొనే Provision ఉంది. Justifiable కాదు. మంచిదికాదు. Trend of the bill ఏవిధముగా ఉన్నది అంటే, మనకు కావలసిన Democracy లో Supremacy of the Judiciary కి వలె Bar వచ్చినట్లుగా ఉన్నది. Bar of the jurisdiction of Civil Courts కనుక Supremacy of the Judiciary is to that extent encroached upon by the legislature and executive functions of the bill. ఈ trend గవర్నమెంటులో develop అయితే ప్రతి Act లో ఈ విధముగా Judiciary ని Bar చేసే clauses implement చేస్తే it will lead nowhere. Democracy కి దెబ్బతగలవచ్చు.

ఇంక వేరే defects ఈ బిల్లులో ఏమీలేవు. Rules తయారైతే మన ముందు పెడతారు. ఈ Bill ను as it is accept చెయ్యవలెను. Socialistic principles కు అనుగుణ్యముగా ఉన్నది అని నా నమ్మకము. అందుకోసము అందరూ support చెయ్యవలెనని కోరుచున్నాను.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ఈబిల్లు సిద్ధాంతములతో నాకు ఏమీ వివాదములేదు. గాని అమలు పరచడములో మాత్రము చాలాచిక్కులు ఏర్పడే పరిస్థితులు వున్నవి. వాటినన్నింటిని తొలగించడానికి ప్రభుత్వం ప్రయత్నించాలని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఆదిలోనుంచే amount of contribution వెయ్యడములో 50 వంతులకు మించకుండా నీటివనరువల్ల అయినా పెరుగుదలలో 50 కు మించకుండా వెయ్యవలెనని అన్నారుగాని అది చాలాకష్టము. ఎందువల్లనంటే అనేక కారణాలవల్ల పరిస్థితులవల్ల భూములవిలువలు పెరగడము తరగడము సంభవించవచ్చును. ప్రారంభములో తాము ఎంతఅయితే ఖర్చుపెట్టేరో అంతా వసూలు చెయ్యవలెను అనే సిద్ధాంతము న్యాయమా ? 75% అనిగాని 50% అనిగాని స్పష్టముగా నిర్ణయించవలెను. ఆ మొత్తాన్ని commandable ayacut మీద వసూలు చెయ్యడములో ఎలాంటివివాదము ఉండదు. కలెక్టరు నిర్ణయము చెయ్యవలెను. దానిమీద appeal లో arguments అనేకవిధాల చెప్పవచ్చును. అందువల్ల యీ వివాదం ఎంతవరకుపోతుందో చెప్పలేము. ప్రభుత్వానికి పన్ను రావలయును. నీటివనరుకు పెట్టినఖర్చు మొత్తంరావాలంటే equal గా distribute చెయ్యమనండి. 100% వెయ్యకుండా 70% అయితే 70% ; 75% అయితే 75% 50% అంటే 50% వెయ్యండి. దానివల్ల ఈ classes కు అవసరము ఉండదు. వివాదాలకు తావుఉండదు.

పోతే ఇందులో ఒక్కవిషయం ప్రభుత్వాన్ని గమనించవలసినదిగ కోరుతూ ఉన్నాను. ఎందువల్లనంటే, ఒకనీటివనరు ప్రారంభంచేసిన తర్వాత, రెండుమూడు సంవత్సరములు గడచిన తర్వాత, అందులో ఈమధ్యలో inflation రావడంవల్ల చాలామంది ధనవంతులు, land reforms వస్తాయని తమభూములను అమ్ముకొని వెళ్ళిపొయ్యారు. చిల్లరచిల్లరగా ఇట్టి పేదవాండ్లే కొన్నారు. అనేక సందర్భాలలో తీరా ఈ నీటివనరువల్ల లాభము పొందినటువంటి భూస్వామిమాత్రం ఒకకాని కూడ ఈ betterment levy క్రింద కట్టవలసినటువంటి అవసరం ఏర్పడకుండ పోతుంది. ఎవడైతే పేదవాడిఎకరం, ½ ఎకరంచొప్పున భూమిఅయితే కొన్నాడో వాడు తప్పనిసరిగా ఈపన్ను కట్టవలసినఅవసరం వస్తున్నది. అలాంటి సందర్భాలలో వారికి మరిఏదైనా protection ఇస్తారా ? కనీసం ఎకరా లోపు ఉన్నవారు రెండుఎకరాలలోపు ఉన్నవారు, inflation కాలంలో ఏదో నాలుగుడబ్బులు సంపాదించుకొని భూస్వామి తనభూమిని అమ్ముతుంటె, ఎకరం, రెండుఎకరాలుగా కొనుకొన్నటువంటి పేదవాండ్లకు protection ఏదైనా ఇస్తారా, లేదా? ఆవిషయం కూడ ప్రభుత్వం పరిశీలించవలెనని కోరుతూఉన్నాను. రెండవదిఏమంటే ఈవేళ కొమ్మమూరు కెనాలుఉంది: దానికి మళ్ళీ యిపుడు చేస్తున్నారు. రేపు ఆయిద్దు

Sri Eragada Kotaiah] [3rd December 1955

లక్షలు అవుతుంది. అదనంగా ఆయకట్టుకు 10 వేల ఎకరములు కలుస్తుంది. ఇప్పటికి 60 వేల ఎకరాలు ఉన్నది. ఈ 60 వేల ఎకరాలను, ఈ పదివేల ఎకరాలను ఏదృష్టితో పరిశీలన చేస్తారు? ఇపుడు పదివేల ఎకరాలవరకే betterment levy వేస్తామంటారా? లేదా పాతఆయకట్టులో ఉండిపోయి, కాలువమొత్తం ఇపుడు మరామత్తు చేయవలసి వచ్చింది. కాబట్టి, వెనుకవున్నటువంటి, 60 వేల ఎకరాలు, ఈ పదివేలఎకరాలు సమంగాచూస్తారా? అప్పుడు ratio ఏవిధంగా fix చేస్తారు? కొత్తగావచ్చిన ఆయకట్టులో ఉన్నవాటికి ఏలా? పాతగా ఉన్నటువంటి ఆయకట్టులో ఏలా? మొత్తంగా కాలువమాత్రం ఒకటేకాలువ అభివృద్ధిఅయింది. అయినపుడు ప్రభుత్వం ఏవిధంగా చేస్తుంది? ఈబిల్లులో ఎక్కడకూడ provision దానికిలేదు. అయితే ఒకటిచెప్పారు. మార్కెటురేటు, ఈ నీటివసరువల్ల ఎంత వరకు పెరిగింది అనేమాట, అతి వివాదమైన విషయం, అని చెప్పుతున్నారు. మూడవదిఏమంటే project affected areas లో ప్రభుత్వంవారు భూములను ఎంతో కొంతధరకు అమ్ముతున్నారు. ఆలాంటి భూములకుకూడ అభివృద్ధిపన్ను విధిస్తారా? విధించడం న్యాయంకాదు. ఎందుకంటే, ఇప్పటికే ఆభూములు ఎందుకు పనికిరాకుండాఉంటే, వాండ్లకు రెండువందలకు, మూడువందలకు అమ్మినవి. వాండ్లు మామూలుగ అనేక కష్టనష్టాలకులోనై, చాలా సొమ్ముపెట్టి, ఆభూములే మరామత్తు చేసుకొంటున్నారు. ఆలాంటి పరిస్థితులలో మూడుసంవత్సరములు పోయినతర్వాత ఇవి మరామత్తు అయినాయి. వీటివిలువ 15 వందలవరకు పెరిగింది. నేనుఇచ్చింది మూడువందలు 4 వందల రూపాయలు కాబట్టి, ఈ వెయ్యి రూపాయలలో సగము కావలెననేటటువంటి విషయం ఉన్నదే, అది న్యాయమైనటువంటిదికాదని నేను అభిప్రాయపడుతూ ఉన్నాను. అందులో project effected areas లో గాని, లేక ఇంతకుముందుగాని, లేక రేపువచ్చే project లో గాని, గవర్నమెంటు భూములు అమ్మినపుడు, ఆ భూములమీద Betterment levy విధించడం న్యాయంకాదేమో? ఆ betterment ను కూడ దృష్టిలో పెట్టుకొని, అమ్మదలుచుకొంటె, అమ్ముకోవటం అనేదేతప్పు, అదో ఇదో చేయవలసిందేగాని. రెండుకూడ చేయడం వాంఛనీయంకాదు అనేటటువంటి విషయం. ఈ ప్రధానమైనటువంటి ఈ 3, 4 విషయాలను, ఈబిల్లులో పొందుపరచేదానికి ప్రభుత్వం పరిశీలన చేస్తుంది అని నేను ఆశిస్తూ ఇంతటితో సెలవుతీసుకొంటున్నాను.

**SRI M. SATYANARAYANA RAJU** :—అధ్యక్షు మహాశయా, ఈ betterment levy bill ను select committee కి పంపించినపుడు నేనుకూడ ఒకసభ్యుడుగా ఉన్నాను. Select Committee సభ్యులు సూచించినవి సూచించిన

మాదిరిగా నే చాలమటుకు ఆమోదించారు. దానికి మా యొక్క అభినందనాలు. అప్పుడే కౌన్సిలులో మేము వ్యతిరేకించడంవల్ల అవికూడ తిరిగి ఇంగులో ఉండడం వల్ల నేను మాట్లాడవలసి వచ్చింది. ఏమంటే, మొట్టమొదట ఇప్పుడు దేశంలో స్థిరీకరణ లేకుండా, పన్నులు దఫదఫాలుగా వేయడం అనేది కొంచెం అర్థరహితంగా ఉందని ఒకటి మేము నిరసించాము. ఏమంటే, ఇపుడు మనప్రభుత్వం అమలు లోనికివచ్చి రమారమి 8 మాసాలు అయింది. ఈ 8 మాసాలలో ఎన్ని పన్నుల బిల్లులు పెట్టారో, తమకు తెలిసేఉంటుంది. ఒకటి ఏదో, land cess అని, water cess అని, compulsory water cess అని, tobacco sales tax అని, tax on 35 counts అనగా నూలుబట్టలలో 35 counts మీద పన్ను వేశారు. రాబోయే tax లు యేమంటే, Court Fee Tax లు ఇంకా యేమో తెస్తున్నారు. సరే, tax లు వేయవచ్చును. Tax లు వేయవద్దని చెప్పి ప్రతిపక్షంవారు చెప్పుతూవుంటే, కేవలం ఒక tactics మాదిరిగా అభ్యంతరం పెట్టడంకాదు. అయితే ఈ విధంగా tax చేసేటప్పుడు ఆ tax ముఖ్యంగా మనది agricultural దేశం కాబట్టి, ఇంకా అభివృద్ధిలేదు కాబట్టి, రైతుమీద నే పడు తుంది. ఈవిధంగా tax వేసినందువల్ల, pay చేసే position లో ఉన్నారా లేదా అని గమనించవలెను. ఇది డిశంబరు, జనవరి, ఫిబ్రవరి, మార్చి అందుచేత ఈ 4 మాసాలలో కొంత సమగ్రంగా ఆలోచించి ఈ ధరలు వుంటాయా ? ఏవిధంగా ఉంటుంది అది గమనించి, ఈధరలు పడిపోకుండ ఒకపద్ధతి ఏర్పరచిన తర్వాత tax తప్పకుండా వేయవలసిందే. ఈ అభివృద్ధి పన్ను కూడ వేయటం ఒక భాగంలో అభివృద్ధిచేస్తూ ఉన్నపుడు, దానివల్ల కొంతడబ్బు రాబట్టుకొని, లేనివోట్ల చేయడం తప్పకుండా సబబే. ఈ ప్రయత్నానికి మేము ప్రభుత్వాన్ని అభినందిస్తు న్నాము. ప్రయోజనం సాధించేమార్గం సరిగా లేదనిమాత్రం మేము వ్యతిరే కిస్తున్నాం. వ్యతిరేకతను కాస్త సావకాశంగా ఆలోచించమని చెప్పుతున్నాము. ఐతే ఇపుడు డిశెంబరు జనవరి, సంవత్సరం పొడుగునా, ఒక control లో పెట్టడం మంచిది. అధమపక్షం ఈ నాలుగు మాసాలలో ధరలు పడిపోవడం, అందులో డబ్బుఉన్నవారు కొనుక్కొని. నిలవచేసుకొని ఆలాభాలు వారుపొందడం అందరికీ తెలిసిన సంగతే. అందుచేత అధమం ఈ మార్గశిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం మాసాలలో రైతు డబ్బుకు చాలా అవసరపడుతూ ఉంటారు. ఈ మాసాలలోనే గవర్నమెంటువారు శిస్తులు వసూలుచేస్తారు. ఈ సందర్భాలలో రైతులు ఎటువంటి ఇక్కట్లు పడుతూఉంటారో కాస్త ప్రభుత్వం గుర్తించవలసి యున్నది. అదికాక, కేవలం ఇది ఒక ఆక్షేపణ అని, ప్రభుత్వంవారు చేసిన బిల్లులకు మేము అడ్డపెట్టుతూ ఉన్నామని యిది ఒక tactics అని గాని, ఈ విధంగా

Sri M. Satyanarayana Raju] [3rd December 1955

అనవసరం కాదు. అక్షమపక్షం ముందు రైతులకు ధరలు ఈ 4 మాసాలలో ఏదో పద్ధతిమీద ప్రభుత్వమే ఇచ్చి commodity కొనడంగాని, లేకపోతే ఈ ధరకంటె తక్కువగా అమ్మకూడదు, ఈ ధరవొప్పున సరకు కొంత కొంటున్నాం, ఆవిధంగా మేము తీసుకొంటాము, కాబట్టి అంతకన్నా తక్కువధరలకు అమ్మవద్దనిచెప్పి. ఒక declaration ఇవ్వడంగాని, ఏదోవిధంగా వారికి, ఏది ఇష్టంవస్తే ఆ పద్ధతిపెట్టి, ఆధారం నెలకడచేసి, పండించిన పంటకు తగిన ధర వచ్చేటట్లుచేసినతర్వాత రైతు దగ్గర ఈ పన్నులుగాని శిస్తులుగాని వసూలు చేయడం మంచిది. లేకపోయినట్లయితే రైతు చాలా ఇబ్బందిపడుతాడు. ప్రతి విషయంలో మనము రైతుమీద ఆధారపడ వలసి ఉంటుంది. వానికి శ్రేయస్సు లేనపుడు ప్రభుత్వానికికూడ శ్రేయస్సు ఉండదు. ఈ సంగతి మీకు మనవి చేస్తున్నాను.

Sri M. RANGAYYA:-అధ్యక్షా, ఈBetterment Levy Billలో ఉండే సిద్ధాంతంతో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను. ఎవరైతే దానివల్ల లాభం పొందుతారో, దానియొక్క ప్రయోజనాన్ని అనుభవిస్తారో, వారు దానివల్లకలిగే భారాన్ని వహించడంకూడా న్యాయమే, ధర్మమే. అది ఏవిధంగాకూడ విరుద్ధంగాలేదు. కాబట్టి దీనిలో ఉండే మూల సిద్ధాంతాన్ని, సంపూర్ణంగా నేను అంగీకరిస్తూ ఈ బిల్లును సంపూర్ణంగా support చేస్తున్నాను. ఈవిషయంలో ఆదిలో 25 వేలకు మించినటువంటి ఏ work కు అయినాసరే, దాని క్రింద వచ్చే భూములకు, ఈ బిల్లు వర్తించ వీలులేదన్నప్పటికి Select Committee వచ్చేటప్పటికి లక్ష రూపాయలవరకుకూడ పెంచారు. అదిచాలసమంజసంగానే ఉన్నది. అది కాకుండా contribution 20 ఏండ్లలో 20 వాయిదాలమీద తీర్చుకోమ్మని చెప్పారు. మొదటి మూడు ఏండ్లకుకూడ, దానికి ఏమి ఇవ్వవలసిన పనిలేదని చెప్పారు. అయితే కొంతమంది సభ్యులు పేదవాండ్లమీద ఇది ఏమి ఉండ కూడదని, తక్కువ భూమి ఉన్నవారికి ఇది వర్తించకూడదని చెప్పుతున్నారు. వారు చెప్పేదానిలో ధర్మము లేదని నేను చెప్పనుగాని, మన దేశంలో ఉండే వారిలో సాధారణంగా నూటికి 80 మంది తక్కువ భూమి ఉన్నవారే, ఈ తక్కువ భూమి ఉన్నవారినే మనం exempt చేయడంవస్తే దానివల్ల గవర్నమెంటుకు వచ్చే ఆదాయం ఎక్కడకూడ కనపడడంలేదు. కాబట్టి ఈవిషయంలో మాత్రం అది సాధ్యంకాదు. కావలసివస్తే కొంచెం బాగా ఆస్తి ఉన్నవారికి Agricultural Income-Tax వేయవచ్చును. పుచ్చుకోవచ్చును. అభ్యంతరంలేదు. దానికి అందరు కూడా సిద్ధంగానే ఉన్నాము అని నేను భావిస్తున్నాను.

కొన్ని కొన్ని పరిస్థితులలో ఏదో ఈ క్రొత్త improvement జరిగిన తరువాత కొన్ని కొన్ని కారణాలవల్లనైనా పంటలు సరిగ్గా లేకపోతే అప్పుడు రైతుకు దెబ్బ తగులుతుంది. ఇది అంతాకూడా అప్పుడువారు చెల్లించలేరు, అనే objections ఏమైన ఉన్నట్లయితే అటువంటి పరిస్థితులువచ్చినపుడు ఈ betterment levy instalments వెంటనే pay చేయవలసిన పనిలేక మరొక సంవత్సరానికి అది postpone చేయవచ్చు. Continous గా ఏదైనా కొన్ని సంవత్సరాలు రైతులకు దెబ్బ తగిలితే continous గా దెబ్బతగిలినటువంటి సంవత్సరాలలో రద్దుచేసినా చేయవచ్చు. దానికి Government ఎప్పుడైనాకూడా సంసిద్ధంగానే ఉంటుంది. అందువల్ల ఎప్పుడో ఏదో రాబోతున్నాయేమోనని ఊహించుకొని దానివల్ల అటువంటి provisions తగ్గించాలి. సరిగ్గా అలాఅనడం మాత్రం సమంజసంగాలేదు. కాబట్టి సంపూర్ణంగా ఈ బిల్లులో ఉన్నటువంటి provisions అన్నిటినికూడా బలపరుస్తున్నాను. ఒక చిన్న విషయం వ్యక్తిగతంగా నాకు తోస్తున్నది ఏమిటంటే దీనిలో interest కూడా charge చేస్తున్నారు. Interest లేకుండా చేస్తే బాగుంటుందేమోనని నా వ్యక్తిగతమైన అభిప్రాయం అని నేను వెలిబుచ్చుచున్నాను.

Sri S. NARAYANAPPA :— అధ్యక్షా, ఈ అభివృద్ధి పన్ను ప్రభుత్వం విధించే సందర్భంలో రాష్ట్రంయొక్క ఆదాయవ్యయములు సవరించాలని ఉద్దేశించి ప్రధానమైనటువంటి దానిని ఈ సభవారి ఎదుటకు తీసుకువచ్చారు. తరువాత Select Committee కి పంపించారు, Select Committee లో కూడా రైతాంగానికి సంబంధించిన member లు ఉండి బాగా దీర్ఘంగా చర్చించి opposition వారియొక్క సలహా తీసుకొని ఒక విధమైనటువంటి రూపాన్ని తీసుకువచ్చి ఈనాడు ఈసభలో ప్రవేశపెట్టారు. తెచ్చినటువంటి సవరణలు చాలా సమంజసంగానే ప్రజానీకానికి ఆమోదకరంగా రైతాంగానికి ఏమ్మాత్రం భారంలేకుండా ఆ అదనపు పన్నుల భారాన్ని రైతాంగము భరించలేరు అనేటటువంటి వాదనకు తావులేకుండా రైతుయొక్క కష్టసుఖాలు దృష్టిలో ఉంచుకొని Select Committee వారు దానిని ఒక విధమైనటువంటి దృష్టితోనే రైతు శ్రేయస్సుకొరకు రైతు అభివృద్ధికొరకు ఈ సవరణ చేశారు. చేసినటువంటి సవరణలు ఇప్పుడు ముఖ్యంగా చిన్న రైతులు అదనంగా ½ ఎకరం లేక ఎకరం అనుకోండి, రెండు ఎకరాలు అనుకోండి, ఇటువంటి చిన్నకారు రైతులకు ఈ పన్నులు మినహాయింపు ఒక విధమైనటువంటి భారాన్ని ఇప్పుడు water rate వేస్తున్నారు. అదనంగా భూమి శిస్తు ఉన్నది. ఈ betterment tax నుంచి ఏమైన తప్పిస్తే ఆపేద రైతాంగానికి ఉపయోగంగా ఉంటుందేమోనని ప్రభుత్వం గుర్తించి దానిని ఆ విధంగానే ఆచరణలోకి తీసుకువస్తే ఆపేద రైతాంగం ఏంతో హర్షిస్తుందని నేను ఆసిస్తున్నాను. తరువాత ఈ Betterment

Sri S. Narayanappa] [3rd December 1955

tax సంవత్సరములో rules ప్రత్యేకంగా ప్రభుత్వంవారు విధిస్తున్నారు. ఈ rules కేవలం అధికారులు వాటిని రూపొందించి గెజట్ లో publish చేయడం ఇది అంతా యథార్థంగా జరుగుతున్నటువంటి సాంప్రదాయము. ఆ విధంగా కాకుండా rules frame చేసేటప్పుడు మాత్రం శాసనసభలో చర్చించటం rules frame చేయలేనటువంటి అధికారులకు అప్పగించి వెళ్లిపోవడం తరువాత రైతునకు రానున్నటువంటి ఇబ్బందులు ఇక్కట్లు ఎక్కువగా రావడం అదనంగా ఖర్చు భరించడం, ఆవిధంగా మనం ప్రభుత్వము తీసుకొనేటటువంటి చర్యలవల్ల రైతులు ఇక్కట్లు పాలౌతున్నటువంటి పద్ధతిలో చూస్తున్నాము. అందువల్ల rules frame చేసేటప్పుడు అధికారవర్గంగాని, అందుకు సంబంధించినటువంటి మంత్రివర్యులు గాని తరువాత Select Committee లో ఉండేటటువంటి సభ్యులుగాని, ఏవిధంగా రైతాంగానికి లాభకరంగా ఉంటుందో అలాచేయాలి. తరువాత ఈ 3 సంవత్సరముల వాయిదా ఇవ్వడం అంతవరకు తయారైన తరువాత వసూలు చేయడం సమంజసంగానే ఉన్నది. ఇంకో 20 సంవత్సరాలు వంతులు మాదిరిగా చేయడం ఇది ప్రభుత్వం రైతుయొక్క క్షేమాన్ని చూచే ఆలోచన చేసినారు. ప్రధానంగా ధరల స్థిరకరణలేకనే ఈ అభివృద్ధి పన్ను వేయడం అన్నది అంత ప్రధానంగా అనుకోనేదానికి వీలు లేనటువంటి సమస్య ఇది. ధరల స్థిరీకరణ మాత్రం ఈనాడు ఆంధ్ర రాష్ట్రానికేకాదు. యావద్భారత దేశానికి సంబంధించిన సమస్య. రైతాంగము పండించే ప్రతి పంటకు ఆహారధాన్యం పంట అనండి పొగాకు ప్రత్తి వేరుసెనగ ఇటువంటి వ్యాపారమునకు సంబంధించిన పంటలు ఈ పంటలయొక్క ధరలు ఎగుమతి దిగుమతి పైన ఆధారపడడం వాటికి ధరలు హెచ్చడం, తగ్గడం రైతాంగం నలిగిపోవడం ఇవన్నీ చూస్తున్నాము. స్థిరంలేదు. స్థిరమైనటువంటి పంటలకు ఇటుపైన స్థిరమైన పన్ను విధిస్తున్నారు. శాశ్వతంకాదు. కాబట్టి దీనినికూడా వెంటనే అఖిలభారత ప్రభుత్వంవారు రాష్ట్రప్రభుత్వాలు ఆలోచనచేసి ఒక స్థిరమైనటువంటి, Enquiry Committee ని బందరు పంపుతున్నట్లు కొన్ని పత్రికలలో చదివినాము. ఇటువంటి స్థిరీకరణ జరిగిన తరువాతకూడా రైతాంగం ఈ బిల్లుద్వారా అంటే వారు అనుకున్నట్లు ఎట్టి భారాన్ని లేకుండానే సులభంగానే సాధ్యమౌతుందని ఆశిస్తూ ఈ అవకాశం ఇచ్చినందుకు నేను కృతజ్ఞుణ్ణి.

**MR. SPEAKER** :—We shall now rise for lunch and meet at 3.00 p.m.

AFTER LUNCH 3-00 p.m.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, మంత్రివర్గము ప్రవేశ పెట్టినటువంటి ఈ అభివృద్ధి పన్ను బిల్లును నేను వ్యతిరేకిస్తున్నాను. ఇపుడు ముఖ్యంగా ఇది Select Committee కి పోయింది కాబట్టి, కమిటీ principle accept చేసినా మనిఅన్నది కాబట్టి ఇప్పుడు ఇతర విషయాలేమైన ఉంటే, చర్చించండి అనే వాదనలు వస్తున్నాయి. ముఖ్యంగా రేపల్లె సభ్యుడు, principle సిద్ధాంతంమీద Dalton theory మీద, ఉపన్యాసము చెప్పి కాంగ్రెసు కమిటి ఏమి చేస్తున్నది మాత్రము చెప్పలేదు. ఈ unearned properties ఊరకే వచ్చినవి, సనక సగము తీసుకొంటే తప్పేమి, ఆయన పూర్తి తీసుకోమన్నామని చెప్పాడు, ఇక్కడ మేము ఎంత తీసుకొంటామని అంటున్నామో, కాంగ్రెసు ప్రభుత్వము ఏమి చేస్తుందో దానిని మాత్రము ఆయన వివరించడానికి పూనుకోలేదు. Unearned incomes అనేది కష్టపడితే వచ్చినవిగాదు అనే విషయము అందరికి తెలిసిన విషయమే. దాని మీద జాస్తిగా వెళ్లడంలేదు. కాని practical గా వచ్చేటటువంటి ఇబ్బందులు గురించి కొంత నేను మనవిచేయదలచినాను. ముఖ్యంగా ఈబిల్లు విషయము చూచి నప్పుడు 1957 సంవత్సరం తరువాత సాగులోకి వచ్చేటటువంటి మెట్ట ప్రాంతాల మీద, అనగా రాయలసీమలోని, నెల్లూరు జిల్లాలోని, విశాఖపట్టణం, శ్రీకాకుళం లోని మెట్ట ప్రాంతాలలో తలపెట్టినటువంటి పెద్ద పెద్ద స్కీములు కానివ్వండి, మధ్యరకము ప్రాజెక్టులు కానివ్వండి వాటి క్రింద సాగైన భూములమీద ఈలాంటి betterment tax వేస్తామని ఈబిల్లు ఉద్దేశించబడినది. ఇంతకు పూర్వము ప్రభుత్వము ప్రాజెక్టులు వేసేటప్పుడు, protective projects అని, లేక productive projects అని వేస్తుంది. ఆ రోజులలో బ్రిటిష్ ప్రభుత్వము ఏదైనా project ప్రారంభించ దలచితే నూటికి 5 రూపాయలు వడ్డీ వస్తుందాలేదా అని ఆలోచించి ఆరకంగా ప్రాజెక్టులు వేయడానికి ఉద్దేశించేది. కాని మనమిప్పుడు ఆ విధంగా కేవలం వడ్డీవ్యాపారం దృష్టితో చూడడం చాలా తప్పు. వెనుకబడిన ప్రాంతాలు అభివృద్ధికి రావాలన్నప్పుడు కేవలం productive angle నుంచిగాని, లేక లాభదాయకదృష్టితోగాని చూడకుండా, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి దృష్ట్యా చూడాలని చాలా కాలంగా ఆందోళనచేస్తూ వచ్చాము. ఈ అసెంబ్లీలో సంజీవరెడ్డిగారు అనేక సందర్భాలలో, కేవలం Productive దృక్పథం కాకుండా, నూటికి 5 రూపాయలువడ్డీ వచ్చినా రాకపోయినా, వెనుకబడిన

Sri G. Yellamanda Reddi] [3rd December 1955

ప్రాంతాలను అభివృద్ధికి తీసుకురావడానికి ప్రాజెక్టులు తీసుకొంటున్నామని చెప్పారు. చాలా సంతోషము కాని ఇప్పుడు ఈ బిల్లు తీసుకువచ్చిన దాన్నిబట్టిచూస్తే, ఇందులో Productive దృక్పథంగాని, 5 రూపాయలు వడ్డీరావడంగాని వీటన్నిటిని అధిగమించి నందువల్ల ఎకరాకు సంవత్సరానికి సుమారు 70, 80 రూపాయలువరకు పన్ను చెల్లించవలసిన పరిస్థితివస్తున్నది. కాబట్టి, ఏ సూత్రాన్నైతే దృష్టిలోపెట్టుకుని ఎన్నో రోజులనుంచి ఆందోళన చేస్తూవచ్చామో, ఆ సూత్రానికి నూరురెట్లు తగిలేటట్లుగా ఇప్పుడు చేస్తున్నారు. వెనుకబడిన ప్రాంతాలవారికొరకు ఈ ప్రాజెక్టులు వేస్తున్నారని ఒకవైపు సంతోషము ఉన్నప్పటికీకూడాను, ఈ బిల్లు అమలులోకి వచ్చేటప్పటికి రైతులకు విపరీతమైన కష్టాలుకలుగజేస్తుందని ఆలోచించినట్లయితే బాగా అర్థమవుతుంది. ముఖ్యంగా ప్రాజెక్టులు లేకుండా వెనుకబడిన ప్రాంతాలలో, చాలా గుట్టు, మెట్లు ఉంటాయి. అదంతా rocky land గా ఉంటుంది. వీటన్నిటిని చదునుచేసి సాగుకు లాయకీగా చేయవలెనంటే అంత సులభమైన పనికాదు. సముద్రపు ప్రాంతాలలో ప్రాజెక్టులు వచ్చినప్పుడు వాటిని సాగుచేయాలంటే, చాలా తొందరగా, సౌలభ్యంగా సాగుచేయడానికి వీలుంటుంది. కాని, పశ్చిమ ప్రాంతంలో రాయలసీమ, శ్రీకాకుళం, నెల్లూరుజిలాలలోని మెట్టప్రాంతాలు మాగాణిగా మార్చాలంటే చాలా కష్టముఅనే విషయము అందరికిని తెలిసినదే. ఈ రోజు తుంగభద్ర ప్రాజెక్టు క్రింద ఒక్కొక్క ఎకరాను సాగుచేయాలని ప్రభుత్వము ఎంత్రప్రయత్నము చేసినగాని, అది సాగులోనికి తీసుకురాలేక పోతున్నదంటే కేవలం ఆ రైతులకు మాగాణి భూమిమీద interest లేక కాదు. దాంట్లోఉన్న సాధకబాధకాలు కష్టాలవల్లనే ఈనాడు అక్కడఉండే ప్రజానీకము అవన్ని సాగుచేయలేకపోతున్నది. ముఖ్యంగా మెట్టప్రాంతాలలో ఒక్కొక్క సాగుచేయడానికి ఎంతకృషి చేయవలసియుంటుందో, అది ఎంతకష్టముతో కూడుకొనినవో చెప్పుటకు సాధ్యంకాదు. వందలకొలది రూపాయలుకూడ ఖర్చుపెట్టవలసివస్తుంది. ఇదివరకు, పూర్వం ప్రాజెక్టుల విషయంలో ఎకరాకు 7 రూపాయలు, 8 రూపాయలు నీటితీరువా వసూలుచేస్తున్నారు. ఇప్పుడు ప్రభుత్వము ఒకే భూమిమీద వేసేపన్ను ఒకే మొత్తంగాచెప్పితే ఇంత పన్నా అని అంటారని, అదివిడగొట్టి, భాగాలు, భాగాలుగాచేసి వేసేవిధానాన్ని అవలంబిస్తున్నట్లు అర్థము అవుతున్నది. ఈ భూమిపన్ను విషయంలో నిజంగా మెట్టకు 0-8-0 0-12-0 ఉంటున్నదని అనుకొంటున్నారు. కాని నందికొండక్రిందవచ్చే అనేక భూములు State takenover చేసిన తరువాత ఎకరాకు మూడు రూపాయల మొదలుకొని నాలుగు రూపాయలవరకు రైతాంగం చెల్లిస్తుందన్నమాట. కొన్నివేల ఎకరాలు కొత్త నందికొండ ప్రాజెక్టుక్రింద సాగులోకి రాబోతున్నాయి. ఈ రకంగా

చూచినప్పుడు, land revenue చాలా జాస్తిగాఉన్నది. రెండవది, నీటి తీరువా విషయంలో ఎకరాకు 8 రూపాయలు, 9 రూపాయలు వసూలుచేస్తూఉంటే, ఇప్పుడుకట్టే ప్రాజెక్టులక్రింద, 10 మొదలు 24 రూపాయలవరకు నీటితీరువాకట్లు అప్పుడే నిర్ణయించి ఆరకంగా వసూలుచేస్తామని అంటున్నారు. పూర్వమువున్న నీటి తీరువాకు పోల్చిచూస్తే, ఇది ఎన్నోరెట్లు జాస్తీగావున్నది. మూడవది, భూమినుంచి వచ్చేటటువంటి అధికఆదాయములో సగము భాగము తీసుకొంటామని ఈరోజు మళ్లీ చెప్పడంవల్ల, దానిద్వారా కొన్నివందలు వస్తాయన్నమాట. మొత్తంమీద చూచి నప్పుడు ఈపన్ను 4 వంతులు 5 వంతులు పెరిగితే, సంవత్సరం ఒకటింటికి ఒక రైతుకు ఎకరాకు 70 రూపాయలు, 80 రూపాయలు చెల్లించవలసి యుంటుంది. అంటే, 4 ఎకరాలుగల రైతుకు సంవత్సరానికి 2 వందలు, 3 వందలు land tax చెల్లించాలన్నమాట. కొబట్టి ఇది ప్రభుత్వము కొంచెము ఆలోచించాలని నేను మనవిచేస్తున్నాను. చాలామంది సభ్యులు సగమేడబ్బుఅయితే, 30 రూపాయలు, కట్టలేరా అని ఏదో sacrifice చేసి, అడగడం చాలా విచారకరంగా వున్నదని నేను మనవిచేస్తున్నాను. కొంతమంది మాగాణి ప్రాంతమునుంచి వచ్చిన సభ్యులు, unearned property పదివేలు రూపాయలువస్తే, అయిదువేలు రూపాయలు ప్రభుత్వానికి ఇవ్వడానికి ఏమికష్టము అంటారు. కాని నేను ఒక ప్రశ్న వేస్తున్నాను. ఇదివరకు కృష్ణా, గోదావరి డెల్టాక్రిందవున్న వందలాది ఎకరాల మాగాణి భూములు అవన్నీకూడ earned అని ఏమిత్రుడుకూడ చెప్పలేదు. ఎందుచేతనంటే, ప్రభుత్వము ప్రాజెక్టులుకట్టిన తర్వాతనే వాటివిలువలు ఎకరా ఒకటింటికి 4 వేలు, 8 వేలు, 6 వేలు రూపాయలవరకు పెరుగుతాయి. మనమిత్రులు సగముయిమ్మని అడుగుతున్నారు కదా. పోనీ ఆ పెద్దలు నాల్గవవంతో, లేక అయిదవవంతో, లేక కనీసము 6 వ వంతైనా ఆయాచితంగా ఇవ్వగలరా ? అవిధంగా వైనాసరే ఇచ్చినట్ల యితే చాలా ఉదారంగా ఉంటుంది. ఆరకంగా ముందుచేసి ఇక్కడ ఉపన్యాసము యిచ్చిఉంటే, చాలా బాగుండేది. అంతేగాని ఊరికే యిక్కడ ధర్మోపన్యాసములు మాత్రము చెప్పినందువల్ల ప్రయోజనమేమిలేదు. నిజంగా unearned property మీ principle అయినప్పుడు, unearned property ఎంతఉన్నది, ఎక్కడ ఉన్నది, ఎరకంగా ఉన్నది అనేది ఆలోచించకుండ, ఏదో మీరు ఇబ్బందులలో ఉన్నారుగదా, ప్రాజెక్టులు కావాలంటున్నారు గదా, మీకు ప్రాజెక్టులు కావా లంటే దీనికి ఒప్పుకోండి అని వెనుకబడిన ప్రాంతాలలో ఉన్నవాళ్లను corner చేసే విధానములో ఈబిల్లు ఉన్నదేగాని, నిజంగా, న్యాయంగా దింట్లోఉండేకష్టాన్ని ఈ ఉపన్యాసములు చెప్పిన మిత్రులు ఆలోచించలేదని మనవిచేస్తున్నాను. నిన్న ఒకబిల్లు pass చేశాము. మూడేళ్లలోపల, అతను నీళ్లుతీసుకున్నా, తీసుకోక

పోయినా, ఆయకట్టు క్రిందకువచ్చిన భూమిఅంతటికీ తప్పనిసరిగా watertax కొరకు రైతాంగాన్ని ఏరకంగా drive చేస్తున్నారో ఆలోచించండి. ఇంకొక clause పెట్టారు. ప్రభుత్వానికి డబ్బు యివ్వలేకపోయినా భూమిఇచ్చినా తీసుకొంటుంది అని చెప్పారు. దీని అర్థమేమిటి ? ఇది రైతాంగాన్ని అసలు భూమినుంచి తొలగించేవిధానం తప్పితే మరేదికాదు అని నేను గట్టిగా మనవిచేస్తున్నాను. ఎందువల్లనంటే, ఇప్పుడు మీరేమి ఈ బిల్లులు చట్టాలు చేస్తున్నారు ? అందులో మూడేళ్ళ తరువాత tax ఇచ్చుకోవడం ఏమినష్టమని చెప్పడం, చాలాసులభమే. కాని ఆభూమిని బాగా సాగుచేసుకోవాలంటే ఎంతకష్టమో, ఎన్ని సాధకబాధకాలున్నాయో ఎంత డబ్బు ఖర్చు పెట్టుకోవాలో మీరు ఆలోచించడంలేదని మనవి చేస్తున్నాను.

తరువాత యింకొకవిషయము చెప్పారు. ఈబిల్లును తయారుచేసే సందర్భములో మూడుసంవత్సరముల తరువాత constitution time కున్నూ, completion time కున్నూ మధ్య పెరిగినదానిలో సగముచాలును అని అన్నారు. ఇదే అసలు రైతాంగాన్ని చాలామటుకు దెబ్బకొట్టుతుంది, భూమి సాగకుండా చేస్తుందని మనవిచేస్తున్నాను. ఎందుకంటే, ఎక్కడైనా ఒక ప్రాజెక్టు ప్రారంభిస్తున్నారంటే దానిక్రింద ఉన్న భూములు సాగుకు వచ్చినప్పటికినీ, రైతు తనభూములు బాగుచేసుకోవడము ఆరకంగా భూములు బాగుచేసుకొని నీరు రావటానికి వీలుగావుండేనాటికి, భూములు సాగుచేసుకొని పండించటానికి చాలా ఆతురతతో ఉంటాడు. ప్రాజెక్టు ప్రారంభించినప్పుడు ఒక్కొక్క ఎకరము మెట్టభూమి ఖరీదు రెండువందలుఉంటే, దాన్ని శుభ్రంచేసి, సాగుకు లాయకీగా చేసుకొని, నీరువదిలితే పంటపండటానికి వీలుఅయ్యేటంతవరకూ ఆ భూమిమీద ఏ అయిదు, ఆరువందలో, లేకపోతే, ఇంకా ఎక్కువగానో ఖర్చుచేసిఉంటాడు. ఈవిధంగా ఖర్చుచేయడము, తరువాత తనుఖర్చుచేసినది పంటమూలముగాగాని, లేక భూమి అమ్ముకుంటేగాని వస్తుందని ఆరైతు ఆలోచించి ముందు అప్పోసొప్పోచేసి ఖర్చుచేస్తాడు. ఈ అప్పునుంచి తప్పించుకోటానికి రైతు భూములను బీడుగానే ఉంచినట్లయితే, ప్రాజెక్టు complete అయ్యేనాటికి చూచుకుంటే, ఈభూమి ఇదివరకు ఎకరము ఒకటింటికి రెండువందలు ఖరీదువుంటే, ప్రాజెక్టు complete అయ్యేనాటికి దానికి ధర ఏ అయిదారువందలో వస్తుందని భూములను బాగుచేయకుండ ముందువున్నస్థితిలో ఉంచటానికి తోడ్పడుతుందిగాని, నిజంగా రైతుఖర్చుచేసివుంటే ఆఖర్చును మినహాయింపు చేస్తామనిఅయినా ప్రభుత్వము యీబిల్లులో చెప్పలేదు. ఈ మాదిరిగాఉంటే, యీపన్ను ఖర్చుపెట్టినవాడికీ, ఖర్చుపెట్టకుండా బీడుపెట్టినవాడికి యిద్దరికీ సమానంగానే Betterment Levy

పడుతుంది. అప్పుచేసి ఖర్చుచేసినవానికి యీ betterment levy మరింత భార మవుతుంది. ఖర్చుచేయకుండా భూమిని బంజరు పెట్టినవాడికి మరింత తేలిక అవు తుంది. ఇతరత్రా అప్పుచేసి భూమిని బాగుచేయడు కాబట్టి, betterment levy ఒకటే అతను కట్టవలసి వస్తుంది. అందువల్ల యీ విధంగా ప్రభుత్వం చట్టము తీసుకొని రావటముద్వారా, రైతుకు కలిగే నష్టము అటువుంచి, భూమి బాగాచేయ టానికి incentive ఏ మాత్రము ఉండదు. ఆవిధంగాచేస్తే, బిల్లు తీసుకొనివచ్చే ఉద్దేశ్యము fail అయిపోతుంది.

తరువాత యీ ప్రాజెక్టు సందర్భములో వెనుకబడిన ప్రాంతాల రైతులయొక్క ఆర్థికస్థితినిచూస్తే, నిజంగా రైతులకు వుండే అప్పుల బాధనుగురించి నారాయణ స్వామినాయుడుగారి దగ్గరనుంచి, సత్యంనాథం దగ్గరనుంచి విచారించారు. రైతుకు ఏవిధమైన అప్పులున్నవోగూడ పరిశీలించివారు రిపోర్టులు తయారుచేశారు. ఒకొక్క కుటుంబానికి ఒక ఎకరమునుంచి, నూరు ఎకరములదాకా, యింకా అంతకు లోపల కూడా వుండేవారికి ఎకరమునకు సుమారు 700 రూపాయల అప్పువున్నదని వారు రిపోర్టులుగూడా వ్రాశారు. కాని, యీరోజున ప్రభుత్వం లోన్సు యిస్తున్నది అంటే, ఆవిధముగా లోన్సు యిచ్చే సందర్భములోగూడ, కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన రిపోర్టుల ప్రకారం చేస్తుంది కాని నూటికి ఏ అయిదు, ఆరు పరసెంటు వడ్డీ గొప్పన తప్పితే, ప్రభుత్వం అంతకు తక్కువకు యిచ్చే స్థితిలోలేదు. అందువల్ల రైతాంగము ప్రభుత్వమునుంచి అప్పులు సక్రమంగా, అవసరము వచ్చినప్పుడు వెంటనే, అదునుకు ఉండేటట్లుగా లేనందున, money lenders యొక్క దయదాక్షిణ్యముమీద ఆధార పడి వుండడము సంభవిస్తున్నది. అప్పును సరీగా, అదునుకు ప్రభుత్వంనుంచిదొరకక పోవడమువల్ల, Money lenders వద్దనుంచి హెచ్చు వడ్డీలకు తెచ్చుకోవడంవల్ల అది తీరకుండా అప్పుల భాధతో కృంగుతున్నాడు. ప్రభుత్వంనుంచి సరియైన టైములో దొరకకపోవడం, అదివరకు Money lenders నుంచి తెచ్చుకున్న అప్పులు తీర నందున వాళ్లు మరొకవైపు తొందరచేయడం, ఇంకొక ప్రక్కన కరువు కాటకాలు యీ సంవత్సరాలు అన్నీ వుంటున్నవని అందరికీ తెలుసుననుకుంటాను. మనము వుమ్మడి మద్రాసు రాష్ట్రములో వుండగా మనలో సభ్యులు ఎసెంబ్లీకు ఎన్నిక అయిన నాలుగు సంవత్సరాలలో రాయలసీమలో ఎటువంటి కరువు వచ్చిందో కూడ సభ్యు లకు తెలుసును. నిజము చెప్పాలంటే అక్కడ ఆ సమయములో సుమారు 20, 30 ఎకరాలు భూమి వున్నటువంటి రైతుగూడ తిండికి చాలకగాని, ఆహారధాన్యాలు దొరకకగాని, గంజి కేంద్రాలమీద ఆధారపడి, ముంత చేతపట్టుకొని గంజి కేంద్ర మునకు పోయి, గంజి కేంద్రమువారు పోసినగంజి త్రాగి తన ఆకలి చల్లార్చు

Sri G. Yellamanda Reddi] [3rd December 1955

కొన్ని రైతులు ఎంతోమంది వున్నారు. భూమి వున్నప్పటికిని, అప్పుదొరకని పరిస్థితి వున్నందువల్ల గంజే ఆహారము చేసుకొన్న రోజులు వున్నవి. ఈ విషయములన్నీ మనము పత్రికలలో చదివాము, యితరులు చూచివచ్చి చెప్పిన సందర్భాలు గూడ మనము విన్నాము. మా నెల్లూరు జిల్లాలో వున్న మెట్ట తాలూకాలలో కరువు వచ్చిన సంగతి సభ్యులకు తెలుసు. ఇలాంటి కరువు సంవత్సరాని కొకసారి, నాలు గేండ్లకు, ఐదేండ్లకు ఒక్కొక్కసారి continuous గా కరువువచ్చే ప్రాంతాలలో గూడ యీ విధమైన tax ను వేయడము ఎంత అన్యాయమో ఆలోచించాలి. తనకు వున్న భూమియే బాగుచేసుకోలేని పరిస్థితులలో రైతువుంటే యింకను యీ అధిక పన్ను అతనిమీద వేస్తే, యిక భూమి బాగుచేయడము నేది వుండదని నా నమ్మకము. శేషిరెడ్డిగారు బద్వేలు తాలూకాను గురించి మాట్లాడుతూ, "మా బద్వేలు తాలూకాను మినహాయించినందుకు నా అభినందనములు" అని అన్నారు. సంతోషం. అందుకు మేముగూడ అభినందిస్తున్నాము. "అయితే ప్రభుత్వానికి పన్ను యివ్వకపోతే ఎట్లాగయ్యా? కొంచెమైనా యివ్వండి" అని అంటె, "మా బద్వేలు తాలూకాను మాత్రము మినహాయించి, తక్కిన వారివద్దనుంచి వసూలు చేయండి" అని అన్నారు. అంటే, వారు చెప్పింది ఎట్లావున్నదంటే ,,మా తాలూకాను మాత్రం యీ అధిక పన్నునుంచి మినహించిమీరు మాత్రం యివ్వండి అని దీని అర్థం. ఇక రాజుగారు చెప్పిందిచూస్తే "ఎందుకయ్యా మీరు ఆవిధంగా తంటాలు పడుతారు?" బిల్లులో " "Not exceeding half" అని వున్నది ' గదా ' అది చాలా బాగానే వుంది "Not exceeding half"-అంటే అర్థము పన్ను వేయకూడదని బిల్లులో నే లేదు. అదిగూడ ఎందుకు పెట్టారంటే black and whiteలో పెట్టినప్పుడు యింతవేస్తామని చెప్పివుండవచ్చు" అని అన్నారు. సగానికంటే మించకూడదని ఎందుకు చెప్పారంటే, అది యింతఅనినిర్ణయించడములో ప్రభుత్వం తన దాక్షిణ్యములో రైతు వుండేటట్టుగా తనచేతులలోనే ఆ అవకాశము పెట్టుకుంది. దాన్నిబట్టి పేద రైతుల మీద లక్షణంగా అర్థభాగమునకూ వేయవచ్చు ఇక తక్కిన వాళ్ల విషయము అంటారా, ప్రభుత్వంతో సంబంధము వున్నవాళ్లు, ప్రభుత్వానికి యిష్టాలు ప్రభుత్వాన్ని influence చేయగలిగినవాళ్లు, యింకా తమకు వీలు అయినట్లుగా వాయిదాలు వేయించుకోటానికి, నిర్ణయించిన ఆ అర్థములోగూడా వీలుఅయినంత తక్కువగా పన్ను వేయించుకోటానికి వీలుగా యీ క్లాజు తోడ్పడుతుందేగాని, మరేమీ కనబడదు. క్లాజులో "Not exceeding half" అనకుండా వుండినట్లయితే, యింకా-ఉదారంగా వుండటానికి వీలుగా వుండేది. బిల్లులు "Not Exceeding half" అని వ్రాశారు అంటే, యిది ఏదో మాకు మేలు కలుగుతుందని, కాకపోతే, యీపన్ను యింకా ఎంతవరకైనా తగ్గింపు చేయించుకో

టానికిఫీలు అవుతుందని అనుకోవడము ఒక భ్రమయేకాని, పేదరైతాంగానికి పన్ను తగ్గించేదానికి యీ క్లాజు తోడ్పదు. అయితే ప్రభుత్వంవారు చెప్పేది, మేము ఏబిల్లు తెచ్చినా, మీరు వ్యతిరేకిస్తున్నారు. ఎన్ని చెప్పినా, వినకుండా వ్యతిరేకిస్తున్నారు, అని అంటున్నారు. అయితే మాది మాత్రము వ్యతిరేకించే విధానము ఎన్నటికినీ కాదు. మేము మొదటినుంచి యీ పన్ను విషయములో చెబుతూనే వున్నాము. ఈ పన్ను వేసేముందు పునాదిలోనే, అసలు యీ పన్నులు ఏరకంగా వేయాలి, ఏవిధంగా వసూలు చేయాలి, అనేది చెప్పాము. మాకు ప్రభుత్వానికి యీ పన్ను విధించే విధానములో చాలా తీవ్రమైన భేదమువున్నది. అందువల్ల యీ పన్ను విధించవలచినప్పుడు "ముందు ఏ జమీందార్లు, పెద్ద పెద్ద రైతులు, భూస్వాములు, వీరివద్దనుంచి అవలంభించేవరకు పేద రైతాంగమువద్దకు రండి," అని చెప్పాము ? అట్లాచేయకుండా దీన్ని reverse order లో వేయటానికి ప్రారంబిస్తున్నారు. ఈ ప్రభుత్వముయొక్క కళ్లకు ముందుకనబడేది, పేద రైతాంగము అందువల్ల పేదవాళ్లను నోరులేనివాళ్లనుచేసి, తనకు కావలసిన సొమ్ము ముందు వసూలుకు ప్రారంభించారు. ఎంతసేపటికీ యీ ప్రభుత్వానికి పేదవాళ్ల నెత్తిన చెయ్యిపెట్టాలని. ఏదో విధంగా వసూలుచేయటానికి చూస్తున్నదేకాని, పెద్ద వాళ్ల జోలికిపోరు. ఇది యీ ప్రభుత్వంయొక్క విధానము. ఇంతకుముందు పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు చెప్పనే చెప్పారు. ఆంధ్రరాష్ట్రములో రెండు విధములైన dry area వుంటే, అందులో ఒక భాగము wet area, అది rich area అని అన్నారు. ఈ Wet area లో చాలా మంది మంచి ఆదాయము వచ్చేవారు వున్నారు. అదేమాదిరిగా Dry area లో కూడా చాలా మంది వెయ్యి ఎకరాలు రెండువేలు యకరాలు యీ మాదిరిగావున్నవారు వున్నారు. ఇటువంటివారిలో ఎవరైతే చెల్లించగలవారు వుంటారో వారిమీదవేసి వసూలు చెయ్యండి. నందికొండ, తుంగభద్ర యీ ప్రాజెక్టులక్రిందవున్న రైతాంగము బాగుపడిన తరువాతనే యీ పన్నును ప్రభుత్వం అడగకూడదా ? అప్పుడు పన్ను అడిగితే అందుకు మేము అడ్డుపెట్టితే, అప్పుడు మీరు అడగవచ్చు ఏమిటయ్యా ! మీ రందరు లక్షణంగా పిల్లాజెల్లాతో సుఖంగా మంచిపంటలు పండించుకుంటూ సంకటి బదులువడి అన్నముతింటూ సుఖముగా జీవనముచేస్తున్నారుగదా ! మీకు ఆదాయము బాగా వస్తున్నప్పుడు అందులో కొద్దో గొప్పో మిగులుతున్నప్పుడు, అందులోనుంచి యీ పన్ను యివ్వటానికి యిబ్బందియేమిటి ? అని అడగవచ్చు. అటువంటిది యేమీలేదు. యిప్పుడు ఇదేదో సామెత. చెప్పినట్లుగా "ఆలులేదు, పోలులేదు, కొడుకుపేరు సోమలింగం" అని, యిప్పుడు ప్రాజెక్టులేదు, ఏమీలేదు, ఎప్పుడో మేము ప్రాజెక్టుకట్టబోతాము, దానికిగాను ఖర్చులు యిప్పుడే యివ్వండి

అని ముందుగా వసూలు చేయటానికి ప్రభుత్వం ఆలోచిస్తే, యిది ఎంతసబబో ఆలోచించండి.

తరువాత బంజరుభూముల విషయము చూస్తే, వ్యవసాయదారుడు అనేవాడు అడగకుండా కాటికిమాత్రం గట్టితాడు తీసుకొనివచ్చి నోటికివేసి గట్టిగా బిగించి, మాట్లాడటానికి వీలులేకుండా ప్రభుత్వంచేసింది. రైతాంగానికే 80, 90 రూపాయలధర పలకాలి అన్నమాట. ఇదంతాచూస్తే నాకేమి అర్థమవుతున్నదంటే, ప్రభుత్వము రైతాంగానికి తోడ్పడకపోగా యీ ప్రాజెక్టులు కట్టినప్పటికినీ, దాని క్రిందవున్న భూములకు ఉపయోగపడకుండాపోయే పరిస్థితి రావటానికి తోడ్పడుతుంది. అందువల్ల ప్రభుత్వం యీ విషయములో సంపూర్ణముగా ఆలోచించవలసిన అవసరమువున్నది. అందువల్లనే మా పార్టీ వ్యతిరేకిస్తున్నది. ఈనాడు ప్రభుత్వం అవలంభించే Principle సరియైనది అవునాకాదా, దాన్ని ఎంతవరకు సాగదీయవచ్చు అనేదికాదు. పాయింటు యిక్కడ అది ఆచరణ సాధ్యమవునా, కాదా, అనేదిగూడా ఆలోచించాలి. అటువంటిది ఏదిగూడా చూడకుండా యీ బిల్లును ప్రభుత్వం తెచ్చింది. కాబట్టి యీ బిల్లులోని క్లాజులనుబట్టి, దీన్ని ఆచరణలో పెట్టితే, ఎంతవరకు సాధ్యమవునా అనే ఆలోచన ప్రభుత్వము విచారించకుండా తెచ్చారు కాబట్టి యిది రైతాంగానికి తోడ్పడేదికాదు కాబట్టి నేను దీన్ని వ్యతిరేకిస్తున్నాను.

SRI P. BAPAYYA :—అధ్యక్షా, మంత్రిగారు ప్రతిపాదించిన యీ అభివృద్ధి పన్నుల బిల్లును నేను బలపరుస్తున్నాను. ఈ బిల్లు Select Committeeకి పంపబడింది. అచ్చట రైతులయొక్క ఆర్థికపరిస్థితులు, కష్టనిష్టూరాలు, బరువు భారాలు, అన్నిగూడ తర్జన భర్జనచేసి ఎన్నో సవరణలతో యీ బిల్లు తయారు చేయబడింది. అలాంటి బిల్లును యీ రోజున మన ప్రతిపక్ష సభ్యులు వ్యతిరేకిస్తున్నారంటే, ప్రతిపక్షనాయకులైన సుందరయ్యగారు యిటీవల మాట్లాడినమాటలు ఇప్పుడు నాకు బోధపడుతున్నవి. అవి యేమిటంటే, యీ ఎసెంబ్లీలో ఏ బిల్లూకూడా ఏకగ్రీవంగా ప్యాసుచేసే సాంప్రదాయములేదని అన్నారు, ఆ కారణంచేత కాబోలు యీ బిల్లు Select Committee లో సవరించనప్పటికిన్ని, గూడా వారు Oppose చేస్తున్నారని అనుకుంటాను. వాస్తవముగా యీ రోజున ప్రజాప్రతినిధులైన మంత్రివర్గమువారు పరిపాలన చేస్తున్నారు. కేవలం రైతులమీదనే అధికంగా పన్నులు వేయాలని వారికి ఎందుకువుంటుంది ? ప్రస్తుతపరిస్థితులనుబట్టి, యీ పన్ను వేయక చెప్పటములేదు. ప్రభుత్వం రైతులయొక్క సౌకర్యార్థం ప్రాజెక్టు కట్టించాలని కల్పించింది. కాని ధనాభావమువల్ల ప్రాజెక్టులు కట్టించే స్తోమతులేకుండావున్నది.

అందువల్ల ప్రభుత్వం యీ పన్ను వేసి ధనము వసూలుచేస్తేనేగాని, రైతులకు ముఖ్యావసరమైన ప్రాజెక్టులు కట్టించలేనిస్థితి యేర్పడింది. ఆర్థికస్తోమతే ప్రభుత్వానికి వుంటే, యీ పన్ను వేయడమనేది అవసరమయ్యేదికాదు. ఏ ప్రభుత్వమునకైనను ఆర్థికస్తోమతు ఉంటే, ప్రాజెక్టుకట్టించవచ్చు. ఈ స్తోమతు ప్రస్తుతానికి మన ప్రభుత్వానికిలేదు. అందువల్ల యీ అభివృద్ధిపన్ను వేయడం తప్పనిసరి అయినది. ప్రతిపక్షనాయకులైన సుందరయ్యగారు వగైరాలకు నేను చెప్పేదేమిటంటే, ప్రాజెక్టులు కావాలనేకోరిక యీనాడు ప్రజలలో మెండుగావున్నది. మెట్టప్రాంతాలలోవుండే రైతులందరూ, మా ప్రాజెక్టులు కోరుతున్నారు. అవసరంగాకూడా పన్నులు యిస్తాము, అభివృద్ధి పన్నులుగూడా యివ్వటానికి మేము సిద్ధంగావున్నాము, మాకు నీరు ముఖ్యంగా కావాలి గనుక ప్రాజెక్టులు కట్టించండి'' అని పిటిషనులుగూడా వ్రాసి ప్రభుత్వానికి పంపుతున్నారు. వారు యీలాంటి పిటిషనులు ప్రభుత్వానికి పెట్టారంటే, వారి వద్ద డబ్బువున్నదనికాదు. డబ్బువున్నా లేకపోయినా, అప్పు అయిననూ తెచ్చి ప్రభుత్వానికి యిస్తాము, మాకు నీరుకావాలి, ప్రాజెక్టు కట్టించండి అని కోరుతున్నారు. మెట్ట తాలూకాలలో ప్రస్తుతము వ్యవసాయము ఎట్లా జరుగుచున్నదంటే, అని రైతుయొక్క కష్టము ఫలించని వ్యవసాయమేగాని మరియొకటి గాదు. ఒక సంవత్సరము పండితే, నాలుగు సంవత్సరముల యెండటంగా లేకుండా అనేకకష్టాలు పడుతున్నారు. మొక్కవచ్చినతరువాత మరల వానలు కురిసి పంటలుపండేవరకు ప్రజలు నిరీక్షిస్తూవుంటారు. వర్షము లేకపోతే ప్రజలు తిండి లేక మలమలమాడే పరిస్థితులు వుంటున్నవి. అందుచేత ప్రాజెక్టులవల్ల నీరులభిస్తుంది. పంటలు పండుతాయిఅనే ఆశ హెచ్చుగాయుండబట్టే, రైతులు ప్రజలు అందరూ ఏకకంఠముతో ప్రాజెక్టు ప్రాజెక్టులని అలమటిల్లుతున్నారు. ప్రాజెక్టులువస్తే పంటలు తప్పక పండుతాయిఅనే వారి నమ్మకం అందువల్ల అప్పులుచేసినను, పంటలు పండించి అప్పులు తీర్చగలము అనే ఉద్దేశ్యముతో వారు ఆ విధంగా కోరుతున్నారు. ముఖ్యంగా మా తిరువూరు నియోజకవర్గములో కొన్ని కొన్ని చిన్న చిన్న ప్రాజెక్టులు వున్నవి. వాటికి ఆయూగ్రామాలరైతులు పిటిషనులుకూడా ప్రభుత్వానికి పెట్టియున్నారు. అందులో వారు "మేము ఎక్కువ పన్నులు ప్రభుత్వానికి చెల్లిస్తాము, లేకపోతే అభివృద్ధి పన్నుయిస్తాము, మీరు ప్రాజెక్టులుకట్టించే, మాకు నీరు సప్లయిచేయండి, మేము పంటలు పడించుకోగలము'' అని వ్రాసుకున్నారు. తిరువూరు గ్రామములోని రైతులు అందరూ యాభైవేలరూపాయలు ఖర్చుచేసి ఒక కాలవను త్రవ్వుకుని స్వంతగా చెరువులకు నీరు సప్లైయిఅయ్యేటట్లు ఏర్పాటుచేసుకొని, ప్రభుత్వానికి పన్నులుకూడా యిస్తున్నారు. దీన్నిబట్టి అక్కడి రైతులకు

Sri P. Bapayya] [3rd December 1955

ప్రాజెక్టులంటే ఎంత అపేక్షవున్నదో గుర్తించాలి. ఎందుచేతనంటే, ప్రాజెక్టులవల్ల రైతు లక్షలకు, ముందు ముందు పంటలు అభివృద్ధిచేసుకొని ఆర్థికంగా బాగుపడవచ్చుననే కోరికవారికి హెచ్చుగానున్నది. రైతులకు ప్రాజెక్టులంటే అపేక్ష ఆ కాంక్ష వున్నప్పటికీ. పన్నులు ఎంతఅయినను యివ్వటానికి తయారుగవుంటారనే సంగతి ప్రతిపక్షి సభ్యులు గుర్తించాలని నా మనవి, ఈ బిల్లువల్ల Select Committeeలో కూడా రైతుల పరిస్థితులు ఆలోచించే, యీ విధంగా సవరణబిల్లు దీన్ని తయారు చేశారు. ప్రప్రథమంగా యీ బిల్లులో వుదహరించిన 25 వేల రూపాయలను లక్షరూపాయలదాకా పెంచారంటే, ప్రభుత్వంవారు ఎంతవుదారముగా యున్నారో ఆ విషయముకూడా ఆలోచించాలి. ఇంతే కాకుండా అనేకవిషయాలలో సెలెక్టు కమిటీబిల్లును చర్చించే సమయములో రైతులకు అనుకూలమైన సవరణలే చేయబడినవి. ఇటువంటి బిల్లును వ్యతిరేకించడమనేది సబబుకాదు కాబట్టి ప్రతిపక్షసభ్యులు యీ బిల్లును ఏకగ్రీవంగా ప్యాసుచేయాలని కోరుతూ, వారు ప్రతిపాదించిన సవరణలు అన్నీ వుపసంహరించుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRIHNAYYA :—అధ్యక్షా, బాపయ్యగారు చెప్పినట్లు, ఈ ప్రాజెక్టులు కావాలని అడిగినప్పుడు betterment levy కి ప్రజలు ఒప్పుకొంటామని చెప్పారు. అయితే ఎంతవేసినప్పటికి ఒప్పుకున్నట్లేనా అనేవిషయముకూడా మనం ఆలోచించాలి. ఇప్పుడు బాక్రా-నంగల్ ప్రాజెక్టు కడుతున్నారు. దానిక్రింద 100 కి 25 వంతులకు మించకుండ betterment levy ఉండాలని Taxation Enquiry కమిటీ రిపోర్టులో ఉన్నది మనము 100 కి 50 వంతులకు మించకుండా ఉండాలని అంటున్నాము. అది అయిపోయిన తరవాత ఇప్పుడు నందికొండ ప్రాజెక్టుసమస్య తీసుకువస్తున్నాము. మనగవర్నమెంటు వారు financial aspects గురించి ఒక పుస్తకమునిచ్చారు. దాంట్లో వారు చెప్పినలెక్కలు, నందికొండ ప్రాజెక్టువస్తే 122 కోట్ల రూపాయలు, మాగాణి అయినట్లయితే రూ. 15 లు, సంవత్సరానికి మొత్తం 24 రూపాయలు వసూలుచేస్తున్నామని అన్నారు. రెండు పంటలుకనుక వేస్తే 25 రూపాయలు ఎకరానికి ఇవ్వవలసి వస్తారు. 25 రూపాయలచొప్పున పన్ను యిచ్చినట్లయితే, సాగుఅయ్యేభూమి 20 లక్షల ఎకరాలుఉంటే దానిమీద, ఇకముందు ఎంతడబ్బు గవర్నమెంటుకు వస్తుందో మనము ఆలోచిస్తే దాదాపు సంవత్సరానికి 7 కోట్ల రూపాయలుపైగావచ్చేట్లు లెక్కతేలుతుంది. కనుక యీ 7 కోట్ల రూపాయలతో దానికియిచ్చే వడ్డీఅయినా చెల్లుతుందంటే అదీలేదు. దానికి ఇంకా ఇవ్వాల్సినడబ్బు ఉన్నది గనుక, మేము ఈడబ్బు వసూలుచేస్తున్నాము అని మీరు అన్నట్లయితే దానికి లెక్కకట్టినట్లయితే,

యీరోజున వచ్చేది 1000 రూపాయలు అయినట్లయితే, 2000 రూపాయలు పెరుగుతుంది అని మనం సాధారణంగా అంచనావేస్తున్నాము. 2000 రూపాయలు పెరుగుతుంది అంటె 1000 రూపాయలు వీళ్లకు యిచ్చుకోవలసి ఉన్నదిగదా? అసలు 30 లక్షలు ఎకరాలు సాగవుతుందిఅని లెక్కలలో తేలుతుంది. దాదాపు ప్రభుత్వమెంటు మొత్తం 300 కోట్ల రూపాయలు వసూలుచేస్తున్నది. మీరు వసూలుచేస్తామని చెబుతున్న 50% ప్రకారము మీకు 150 కోట్లరూపాయలవరకు betterment levy వస్తుంది. అసలుమీరు ప్రాజెక్టుకు ఖర్చుపెట్టింది 120 కోట్లు. ఇవ్వాళటి రోజున 1000 రూపాయలుఉంటె అది రేపు 2000 రూపాయలు ఖరీదుఅయినట్లయితే దాంట్లో సగము తీసుకొంటున్నారు అంటె 500 రూపాయలు తీసుకొంటున్నారు అన్నమాట. అలాంటప్పుడు మీరు వసూలుచేసేడబ్బు 150 కోట్ల రూపాయలు అని లెక్క తేలుతుంది. వారు ఖర్చుపెట్టేడబ్బు 122 కోట్ల రూపాయలు. దానిపై భూమిశిస్తుక్రింద వసూలుచేసేది 77 కోట్ల రూపాయలు. అసలు ఖర్చుపెట్టిన డబ్బుకన్న మించినడబ్బు వసూలుచేస్తున్నారు. అందువల్ల ఈ betterment levy ఏ లెక్కన వేయవలసినది మరలమీరు ఆలోచించవలసిన అవసరము ఉన్నది.

దేశంలో అన్నిచోట్లకూడా ఈ betterment tax వేస్తున్నారు. అస్సాములో వారు to recover initial cost of the scheme in full or in part and maintenance expenditure అని చెప్పారు. ఎంతఅయితే పెట్టామో దానిని ఖర్చు వసూలుచేయాలని చెప్పారు. మైసూరువాళ్లు to meet capital charges ఆ పెట్టిన డబ్బుమాత్రము అందుకోవడానికి అని చెప్పారు. ఆ previous రెండుకూడాను దాంట్లోలేవు.

నేను నందాగారిదగ్గరకు వెళ్ళినప్పుడు ఇతరులదగ్గరకు వెళ్ళినప్పుడు, మా నందికొండ ప్రాజెక్టును మీరు తీసుకువస్తే మాప్రజలు betterment tax ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారని వారికి చెప్పాను. గవర్నమెంటే మొత్తము పెట్టుకోవాలనిలేదు. ఆభారం కొంత రైతాంగం వహిస్తుందని చెప్పాము. కాని ఎంతవహిస్తుంది అంటె దానికి ఒక limit అనేది ఉండాలి. ఆ దృష్టితో కాకుండా కేవలము మీరు వ్యాపారముసాగించే దృష్టితో పోతున్నారు. దానిని ఎవరూ ఒప్పుకోరు. ఆవిషయం బాపయ్యగారుకూడా లెక్కలు చూసినట్లయితే ఒప్పుకోరు. అందువల్ల మీరు betterment levy ఏ విధంగా వేయబోతున్నారు, దానికి ధర నిర్ణయించేది ఎట్లా అనిఅంటే మొత్తం అంతాకూడా కలెక్టరుగారికే వప్పగిస్తున్నాము, ఆయన యిష్టము వచ్చినట్లు officials వేస్తారు అని చెప్పారు. హైదరాబాదువారు ఈ విధంగా చెప్పారు. వారుకూడా దానిమీద చర్చచేశారు.

Sri Vavilala Gopalakrishnayya] [3rd December 1955

"Committee with official and non-official members will advice Collectors in assessment, the following factors are considered :—

1. Market-rate of dry and wet lands in the area ;

2. Nature of soil, productivity and fitness for irrigation ;

3 Wet crops which can be grown economically ;

4. Proximity to markets.

5. Probable expenditure involved in conversion of dry land into wet.

6. Classification of land ; (perennial garden land etc.,)"

ఇవన్నీ కనుక ఊహించినట్లయితే ఇదివరకుఉన్న land revenue system ప్రకారము ఏ విధంగా డబ్బు వసూలుచేస్తున్నారు. అనే విషయాలు అన్నీకనుక చెప్పితే చాలా time తీసుకుంటుంది గనుక నేను చెప్పదలచుకోలేదు. ఇదివరకు వేసినటువంటి estimations లో చాలా తేడాలు ఉన్నాయి.

1947 సంవత్సరమునుంచి దీనిని అమల్లోకి తీసుకువస్తాము అని అన్నారు. అట్లా లెక్కవేస్తే ఒక్క నీళ్ళవల్లనే ఎక్కువపన్ను వచ్చింది. ఉదాహరణకు మా తాలూకాలో మా వూరికి 1½ మైళ్ళలో బూరుగపాడు అనే ఊరు ఉన్నది, అక్కడికిపోయి మీరు విచారిస్తే పొలంఎకరం 2,500 రూపాయలు వుంటుంది. అది మాగాణికాదు మెట్ట. ఆ ధరకు మీకు ఒకఎకరం దొరికితే ఆశ్చర్యపడతాయ అది ఆ ధరకు కొనేవారు ఉన్నాడుగాని, అమ్మేవాడు లేడు. అందువల్ల ఒక వూరిలో 5 వేల రూపాయలు పెట్టి ఒక ఎకరముకొంటే, ఆ చుట్టుప్రక్కల పరిసరాలలో ఒక ప్రాజెక్టుఉండి, అది రిజిష్టరుఅయితే, ఆధరప్రకారంగా Facility ఎంతఉన్నదని రిజిస్ట్రారుగారు, కలెక్టరుగారికి లెఖ్కతీసిచూపిస్తే, ఆ ప్రకారంగా మీరువేస్తే అది రైతులకు ఎంతభారం అవుతుందో ఆలోచించండి. ఈ విషయం కోటయ్యగారు, ఇతర మిత్రులుకూడా ఆలోచిస్తున్నారు. దాంట్లో ఉన్న సమస్య ఏమిటి ? గవర్నమెంటు లెఖ్కవేసినప్పుడు కలెక్టరుగారు సబ్‌రిజిస్ట్రారు ఆఫీసుకు లెఖ్కలకొఱకు పంపిస్తారు. అక్కడ లెఖ్కలు ఎప్పుడూ తప్పుతే వుంటుంటాయి. డబ్బు ఇవ్వజోయేప్పుడు Fees ఎక్కువ అవుతుంది. అనిచెప్పి stamp duty తగ్గిస్తారు. ఇంకా మర్యాదస్తుడు ఎవరైనాఉంటే అతనికి Income Tax ఎక్కువ అవుతుంది కనుక తక్కువలెఖ్కలు వేస్తారు. ఈ పరిస్థితులల్లో వారు దాని పరిణామము మూలాన్నిక పర్యాయం గట్టిగా ఆలోచించాల్సిన అవసరంఉన్నది. 20 వాయి

దాలలో ఇవ్వాలని చెబుతున్నారు. ఈ విషయంగురించి ఆలోచించి, ధరలగురించి ఆలోచించేటప్పుడు, రోజు రోజూ పెరుగుతున్న పరిణామాల్లో ఎంత పెరుగుతున్నాయి, ఎంత విరుగుతున్నాయి అనేది మనం ఆలోచించుకోవాలి. ఈ రోజున ఇంకొక ఆందోళనకూడా బయలుదేరింది ఏమిటంటే అన్నిచోట్లకూడా మాగాణీ అయిపోతే వడ్లు అమ్ముకోవడము మొదలుపెట్టినట్లయితే ధర ఏమివస్తుంది అని రైతాంగము ఇప్పుడు ఆలోచిస్తున్నది. అయితే దానికి మనము భయపడడములేదు. అందువల్ల మనం మార్కెటు రేటుప్రకారం ఆలోచించి పన్నులువేయాలి.

ఇది చిన్న ప్రాజెక్టులకుకూడా అన్వయిస్తుంది అంటే దానికి ఒక ఉదాహరణ చెబుతాను. లక్షరూపాయలు అని దీంట్లోచెప్పి, Back ward area లో ఉన్న దాంట్లో అసలు 1% వడ్డీ వచ్చినాకూడా Productive వడ్డీక్రింద ఇదివరకు పని చేశారు. ఇప్పుడు Protective క్రింద పనిచేసినప్పుడు, Productive కన్నా Protective ఎక్కువ ఉంటే Protective వాటిమీద మీరు ఎంతవేస్తారు ? అది కూడా అమలుజరుపుతారా ? ఆనాడు రక్షణకోసం దానిని వేశారు. ఈనాడు శిక్షణకోసం వేస్తున్నాముఅని చెప్పారు. వాళ్లమీద భారము వేయబోతే కష్టము అవుతుంది గనుక ఈ మొత్తము పరిణామాన్ని అర్థముచేసుకొని కనీసం 25 వాయిదాల కన్నా ఎక్కువ కాకుండా చూపించండి. Percentage half అంటున్నారు. Not more than 25% తీసుకోండి, 5 సం॥ముల వరకు ఉండేట్లు చూపించండి ? ఆ పరిస్థితుల్లోచూస్తే ఆలోచించడానికి ఏమైనా వీలవుతుందేమోగాని, ఈ పద్ధతిలో మొత్తంవేస్తే, రైతాంగము అడిగితే లెక్కలుచూస్తే ఇబ్బంది వస్తుంది కనుక దానిని నేను వ్యతిరేకిస్తున్నాను.

SRI G. BAPAYYA :—అధ్యక్షా, మనం విధించబోయేది అభివృద్ధి పన్ను, నాకు ఒకసందేహం ఉన్నది. అభివృద్ధిమీద పన్ను విధించాలని ప్రభుత్వం ఉద్దేశించినప్పుడు ఈ పన్ను రైతులను భయపరచి వృద్ధి ధరలుకూడా భూమిమీద Encumbrance మాదిరిగాఉండి వృద్ధిలేకుండా పోతుందేమోనని నా సందేహం. నాకు అనేకసందేహాలున్నాయి వినోభాభావేగారు భూమికూడా పంచభూతాల్లో చేరినదని నీళ్లు, గాలి, ఆకాశం, అగ్నిమాదిరిదేనని, అటువంటి భూమిమీద ఎవరికి హక్కులు లేవని చెబుతున్నారు. అనేకరకాలైన Slogans ఉన్నాయి. Tiller is the land owner, land reforms, ceiling rates ఈ రకమైన విచిత్రమైన పరిస్థితులవల్ల భూమివల్ల మనం అభివృద్ధిచెందలేము అనే అభిప్రాయంతో ప్రతి భాగ్యవంతుడు భూములను అమ్ముకొని Towns చేరి మేడలు కట్టుకోడమో వడ్డి వ్యాపారం చేసుకోవడమో చేస్తున్నారు. బీదవాళ్లు ఏలాగా భూమి పంచుకుంటు

Sri G. Bapayya] [3rd December 1955

న్నారు కాబట్టి భూమికి ఇంకా కొనుక్కోవడం అవసరం లేదనిపిస్తున్నట్లున్నది, భూమికి demand పోయినందువల్ల భూమికి ధరలు రావడం ఉండదేమో అనిపిస్తోంది. దీనికి తోడు ప్రభుత్వం ప్రజలకు సహాయంచేయాలని, ఎక్కువ ఆహారపదార్థాలను Produce చేయాలని అనేక ప్రాజెక్టులు నిర్మించడం జరుగుతోంది. అంతా ధాన్యమే కావచ్చును. క్రమేణా ధాన్యంధరలు తగ్గిపోవచ్చును. ఇపుడు మనకు ప్రత్యక్షంగానే కన్పిస్తున్నది, అభివృద్ధి పన్ను విధించేకంటె Permanent గా arrange చేస్తే బాగుంటుంది. ఈ విధంగా పన్ను ఉంటే రెండువేలకు కొన దలచినవాడు వెయ్యిరూపాయిలకు అడుగుతాడు. ఇది ఒక భూతం మాదిరి కనిపించి ప్రజలలో భీతికలిగి భూములకు అభివృద్ధికంటె క్షీణదశ వస్తుందని నా అభిప్రాయం, మనం చేయబోయే ప్రతి Act లాభంవచ్చేట్లా ఉండాలి. Commercial Taxes తీసుకుంటే 16 కోట్లు వస్తాయని ఉద్దేశించాము. వచ్చాయికూడా, తరువాత Act సరిగా అమలుచేయని కారణంచేత రెండుకోట్లు ఆదాయంలోనికి మూడుకోట్లు ఖర్చులోనికి వచ్చినాము, ఈ Betterment Tax లో రివెన్యూబోర్డుకు Appealకు వెళ్లవలెను. రివెన్యూబోర్డుకు Appeal చేస్తే మూడు సంవత్సరాలకు ఒక అప్పు కాగితంవస్తుంది. The Government see no reason to interfere with అని, ప్రతి రైతు రివెన్యూబోర్డుకు పోవాలంటే ఒకప్లీడరు కావాలి ; సిఫార్సు చేయడానికి ఒక M. L. A. అయినా కావాలి, మద్రాసు వెళ్ళాలి ; అవసరమయితే మద్రాసు, కర్నూలుకూడా వెళ్లాలి; ఈ విధంగా సరిగ్గా తెలిసితెలియని రైతులమీద పన్నులను వేసేకంటె definite గా fix చేసివేస్తే తక్కువఖర్చుతో ఎక్కువ ఆదాయం రావడానికి వీలు ఉంటుందని నా సలహా.

Sri N. VENKAIAH :—అధ్యక్షా, ఇప్పుడు తీసుకువచ్చిన బిల్లులో అనేక క్లిష్టాంశాలు ఉన్నాయని మనవిచేస్తున్నాను. ప్రభుత్వానికి తాము పెట్టిన పెట్టుబడిని రాబట్టుకోవడం ఆశయంగా ఉండవచ్చును, దీనిపై 5%, 6% రాబట్టు తగిన పన్ను 15% వంతున విధిస్తూనే ఉన్నారు. కేవలం భూమిమీద వచ్చే పన్ను మాత్రమే కాకుండా ఇతర విధాల ఆదాయం రావడానికికూడా ఎక్కువ అవకాశాలున్నాయి. నూతనంగా జలాశయం ఏర్పడినప్పుడు నూతనంగా సాగు ఏర్పడుతుంది, చదరపు మైలుకు 100 జనాభా కలిగినచోట 1000 జనాభా వరకు పెరగడానికి అవకాశం ఉంటుంది, ఇతరవిధాల ఆదాయంకూడా పెరుగుతుంది, ఇతర విధాల ఆదాయంకూడా పెరుగుతుంది. సంపద పెరుగుతుంది, ఉత్పత్తి పెరుగుతోంది కాబట్టి వ్యాపారం పెరుగుతుంది, భూముల క్రయవిక్రయాలు పెరుగుతాయి, Sales tax Registration fees అనేక రకాలుగా ప్రభుత్వానికి

ఆదాయం రావడానికి అవకాశం ఉన్నది, అనేక రకాలయిన పరోక్షపు పన్నుల నుంచి ప్రభుత్వానికి ఆదాయం రావడానికి అవకాశం ఉన్నది, కేవలం భూమిమీద నేరుగా ఏమి వస్తున్నదా అని ఆలోచించకూడదు; *మన పెట్టుబడి వస్తుందా లేదా అని చూడకూడదు, పరోక్షంగా వచ్చే ఆదాయాలనుకూడా మనం దృష్టిలోనికి తీసుకోవాలి. వీలైనంత ఎక్కువగా అభివృద్ధి పన్ను ద్వారచే రాబట్టాలని అనుకోవడం మంచిది కాదని మనవిచేస్తున్నాను. రాబడి విధానంలోకూడా ఇదే ధోరణిలో చట్టు అయితే రాబట్టడంకూడా క్లిష్టమే అవుతుందని మనవిచేస్తున్నాను. అందరికి తెలిసిన రహస్యమే, విలువ తగ్గించుకుని registration చేసుకోడానికి వీలువున్న సంగతి. గత valuation గమనించమని విక్రయించుకునేవారు value తగ్గించుకొని registration చేస్తే ప్రభుత్వానికి ఆదాయం వస్తుందా? అసలైన registration value కనిపెట్టడానికి ముఖ్యమైన మార్గం ఉన్నదా? అదనపు value క్రింద నీటిపైరులనుంచి మాత్రం రాబట్టడానికి వీలు ఉంటుందని మనవిచేస్తున్నాను. పంటను అనుసరించి ఆదాయం రాబట్టాలి అంటే వారి దయాదాక్షిణ్యాలకు లోబడి వారి లెక్కలను ఆధారంగా చేసుకుని రాబట్టుకోవలసి ఉంటుంది, మన ఉద్యోగులు ఎలాంటివారో మనకు తెలిసిన విషయం.

MR. SPEAKER :—ఈ బిల్లులో పంటలకు సంబంధంలేదు.

SRI N. VENKAIAH :—ఆదాయం రాబట్టడానికి పంటవల్ల వచ్చే అదనపు ఆదాయాన్నికూడా ఒక సూత్రంగా చేర్చాలనుకుంటాను.

MR. SPEAKER :—క్రిందటి బిల్లులో ఉన్నది. Select Committee వారు తీసి వేశారు.

SRI N. VENKAIAH :—ఆదాయాన్ని రాబట్టుకొనడానికి అనిశ్చితమైన మార్గాన్ని అనుసరించే దానికన్న ప్రభుత్వం reserviour మీద పెట్టినపెట్టుబడిలో 10%, 20% ఎకరానికి వేసి రాబట్టుకోవడం చాలా నిశ్చితమైన మార్గం. ఆవిధంగా చేస్తే రైతులకు భాధలేకుండా ఉంటుందని సూచిస్తున్నాను.

SRI B. RATNASABHAPATHY :—అధ్యక్షా, కొంతమంది సభ్యులు ఈ బిల్లును సమర్థిస్తూ సెలక్టు కమిటీకిపోయి వచ్చిన తరువాత ఇందులో ఉండే principle ను వ్యతిరేకించి మాట్లాడడం సరికాదని అన్నారు. ఈ బిల్లులోని principle ను ఒప్పుకుని అంటే ప్రతిపక్షం మళ్ళీ దీనిని oppose చేస్తూ మాట్లాడడం ఉండి ఉండదు కనుక మొదటినుంచి, general discussion నుంచి ఇప్పటివరకు ఖచ్చితంగా ఈ principle ను opposition party వారు

Sri B. Ratnasabhapathy] [3rd December 1955

కాంగ్రెసు పార్టీవారితో ఏకీభవించలేరు. ప్రతి taxation measure లోను కాంగ్రెసు పార్టీకివారి పోలసీ దృష్ట్యా ఒక principle ఎలాఉన్నదో, ప్రతిపక్షం పార్టీకికూడా taxation విషయాలలో ఒక principle ఉన్నది. ఆ principleలో వారికి వీరికి తేడా ఉన్నమాట అందరికి తెలుసును, అదేవిధంగా ఈబిల్లు విషయంలో మా principle వేరు ; కాంగ్రెసు పార్టీవారి principle వేరు. Taxation principles లో principle of equity అని ఒకటి ఉన్నది. దీనినిబట్టి tax వేసినప్పుడు ఎవరికి అన్వయిస్తుంది ; ఎవరు ఈ tax వేసినందువల్ల బాధపడుతారు అన్న విషయం దృష్టిలోనికి తీసుకొని వీరి శక్తి సామర్థ్యాల ననుసరించి tax వేస్తారు.

అదేవిధంగా యీ tax ను కూడా మనం విమర్శించినట్లయితే equity principle సమన్వయం అవుతుందాలేదా అనే principle యిందులో వున్నది. ఆనే general discussion లో ప్రతిపక్ష పార్టీ oppose చేశారు. ఆ principle కు యీ bill సమన్వయం ఉండదని యిప్పుడు మళ్లా Select Committeeకి పోయివచ్చి యీ general discussion జరుగుతుంది కనుక ఆ principle ఖచ్చితంగా తీసుకురావలసిన అవసరం ఉన్నది. అంతేకాకుండా యీ bill యిది మొదటిసారికాదు శాసనసభలో ప్రవేశపెట్టడం. ఇది మాకు composite state లో వుండగా చాలసార్లు ప్రవేశపెట్టి ప్రయత్నం చేసింది ప్రభుత్వం. చాలాసార్లు Select Committee కి పోకమునుపే ప్రభుత్వం withdraw చేసుకోడం జరిగింది. ఒకతూరి Select Committeeకి పోయికూడా withdraw చేసుకుంది. దానికి కారణం యిప్పుడున్నట్టి principle of equity అనేటటువంటిదానికి యీ bill సమన్వయం కాదు కనుక ఆ ప్రత్యేక పరిస్థితులలో చాలామంది కష్టాలు కలుగుతాయి కనుక అన్యాయం కలుగుతుందనే ఉద్దేశంతో అప్పుడు with draw చేయడం జరిగింది. Opposition party వాళ్లుకూడా యీ select commitee లో వున్నారు. శ్రీ నాగిరెడ్డిగారి ఉపన్యాసంలో ఈ బిల్లు Act కాకుండా pass కాకుండా చేయడమే మా ఉద్దేశం అని, ఆ ప్రత్యేకపరిస్థితిలో నేను చెప్పినటువంటి principle అన్వయించదు కనుక సంఘంలో యీ మార్పులు వచ్చునంతవరకు దున్నేవానికే భూమివాక్కు యీ principle మనం అమలుపరచండి ఇటువంటి taxation principle నొక్కి చెప్పింది కనుక with draw చేసుకోడానికి ఆరోజులలో వాదించారు. అదేవిధంగా ఇపుడు యీ principle ను బట్టిచూస్తే యీ Bill ఎటువంటి రైతాంగానికి రైతులకు యిది affect అవుతుందో అన్నదికూడా మనం దృష్టిలో

పెట్టుకోవాలి. Finance Department circulate చేసిన note ప్రకారం మన ఆంధ్రదేశంలో 1000 రూపాయలు పన్నుకట్టేవాళ్లు పెద్ద భూకామందులు single patta వున్నటువంటివాళ్ళు 41 మంది. వాళ్ళదగ్గర వున్నటువంటి భూమి మెట్ట 6,728 ఎకరాలు, పల్లం 7,128 ఎకరాలు. Joint pattas వున్నవారు 13) మంది మాత్రమే. 500 ఎకరాలు వేయి ఎకరాలకుమధ్య 272 పట్టాలున్నాయి.

An Hon. Member :—మన కెందుకండీ !

SRI B. RATNASABHATHI :—ఆ principle దృష్ట్యా నేనుచెప్పేది ఏమిటంటే చాలా పేదరైతులకు మాత్రమే effect అవుతుంది పెద్దవాళ్ళకు effect కాదు. అని [illegible]eve చేస్తున్నాను. అందువల్ల యీ principle oppose చేస్తున్నాం అని చెబుతున్నాను. కనుక యిది పేదరైతులకు చిన్నరైతులకుమాత్రం affect అవుతుంది. భూకామందులకు affect కాదు. ఆ principle పైననే with draw చేశారు. కాబట్టి మీరుకూడా with draw చేయాలని విజ్ఞప్తిచేస్తున్నాను.

MR. SPEAKER :—ఆ stage దాటిపోయింది.

SRI B. RATNASABHAPATHI :—Select Committee సమావేశమై నివేదికయిచ్చిన తరువాతనే మద్రాసుప్రభుత్వం ఇటువంటిబిల్లును with draw చేసుకుంటే యిప్పుడు ఈ planing మొదలుపెట్టిన దగ్గరనుంచ ఎక్కువ projects కడుతున్నాం కనుక ఖర్చవుతున్నది కనుక యీ tax ఎక్కువ డబ్బును సంపాదించడానికి వేశాం అని చెబుతున్నారు. ఈ ప్రభుత్వంవచ్చిన మొదలుకొని మీరు చాలా taxes వేశారు. బంజరుభూములవల్ల ఒక project లోనే 7 కోట్ల రూపాయలు సంపాదించారు. మిగతా project ల పైన చాలా డబ్బువస్తుంది. గుడ్డలపైన పన్నువేశారు. ఇది రైతాంగంమీద పడుతున్నది— ఎందుచేతనంటే రైతాంగమే Ultimate consumers కనుక. ఇప్పటివరకు ప్రభుత్వంచేసిన beneficial measures తక్కువ. Well subsidy scheme ప్రకారం పంతులుగారి time లో పెట్టారు. అదికూడా మీరు తీశారు. చాల ఎక్కువడబ్బు మిగులుతుంది. బంజరుభూముల sale వల్ల ఎక్కువడబ్బు వస్తుంది. అందుచేత డబ్బుప్రశ్నరాదు. మళ్ళా యీ Bill ప్రవేశపెట్టి రైతులను బాధపెట్టడం సముచితంకాదనే ఉద్దేశంతో withdraw చేయాలని కోరుతున్నాను. తర్వాత మిగత provisions వచ్చినపుడు వాటిక్రింద discuss చేస్తాను.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ఇది Select Committee కి వెళ్లినతరువాత మునుపటికన్నా అధ్వాన్నంగా తయారైనదని చెప్పాల్సివుంటుంది. ఈ Select committee లో అది Reporters తప్పకాదు. Select Committee సభ్యులతప్పే. ఎందుకంటే ఒక order ప్రకారంగా కాక అందరం ఒక పర్యాయం మాట్లాడడం అక్కడ అలవాటు—నేను చెప్పింది చెప్పినట్టుగా వచ్చింది. దానిని సవరించవలసినదిగాకూడా వ్రాశాను. ముందుకు సవరిస్తారు. బొంబాయి Method కి పూర్తిగా వ్యతిరేకం. విలువనుబట్టేసి యీ భూమి యిన్ని ఎకరాలలో యింత ఉత్పత్తి అవుతుందని దానినిబట్టి ఉత్పత్తిధరపెంచి విలువపెంచి వేయాలని మొదటిసూత్రాన్నిబట్టి యీ విలువసూత్రం యీ Billను మరింత దారుణంగా చేసినది. అందుచేత ఆ సంగతి.

THE HON. SRI N. SAJEEVA REDDI :—అధ్యక్షా, ఇది చాలా సవ్యంగా వుంటుందని accept చేశాము. మొదటి method మంచిదని Departmental advice వచ్చింది. తరువాత protest వచ్చింది. ఎక్కువ లాభంవస్తుందనే దృష్టితో కాక రైతుల point view తో చూచి Departmental advice ను reject చేశాము. అభివృద్ధి ఖర్చులుతీసేసి మిగిలిన దానిపైన వేయమంటారు. ఎవరు యీ లెఖ్ఖలన్నీ పంపించడం ? క్రింది కరణం పంపించాలి. ఒకమనిషి ఔదార్యం మీద calculations పై అంతా ఆధారపడివున్నాయి. ఏదో ఒకటి ఎక్కువవేసే ప్రమాదానికి గురవుతాము. Price increase మీద betterment వేస్తే price యింతని arbitrary గా చెప్పడానికి వీలులేదు. అమ్మినట్టు registration కావాలి, ఇదంతా Select committee లో argue చేశారు. 4 వేలకు భూమినికొని 2 వేలకు registration చేయించుకుంటారు. ఇది సాధారణంగావున్న ఆచారం. దీనిలో ప్రభుత్వానికి నష్టంవస్తుంది. సరైన ధర registration లో వుండదు. ఆ దేధంకు తీసుకుంటే నష్టంవస్తుందనే అభిప్రాయంతో Select Committee లో దీనిని మార్చాం. సుందరయ్యగారి అభిప్రాయం వేరుగా వుండవచ్చునుగాని ఇదియదార్థం.

SRI P. SUNDARAYYA :—దాని అర్థం యిదివరకున్న సూత్రం మంచిదనికాదు. ఇదివరకున్న సూత్రాన్ని మార్పించడంలేదు. అది పనికిమాలినది. దానికన్న యిది పనికిమాలినది. అందుచేత సంజీవరెడ్డిగారు యింత వివరించి వందలకు పెద్ద ఫలితంగా నావాదనకు అడ్డం ఏమీరాదు. కరణంచెప్పిన దానినిబట్టి

వదలాల్సిన అవసరంలేదు. ఒక ఉపాయము చెబుతాను. విలువవద్దు, ఉత్పత్తివద్దు. ఎకరానికి 10 రూపాయలకు మించకుండా వేయండి. మనకు కావలసినది డబ్బు. పెద్ద సూత్రాన్ని అనుసరించి న్యాయంచెప్పడానికి మేము Project కడుతున్నాం యీ Project కట్టినపుడు దానికి డబ్బుకావాలి. అస్సాం సూత్రాన్ని అనుసరించ వచ్చు, అదేమిటంటే ఒక Project కడితే దానికయిన దాంట్లో 6 Percent గిట్టుబాటయితేచాలు, అనే సిద్ధాంతముతో బయలుదేరుతున్నారు. Maintenance యితర ఖర్చులకు ఆ సూత్రాన్ని అంగీకరించండి మీరుకూడా అది పనికిరాదన్నారు:

THE HON. Sri N. SANJEEVA REDDI :—అస్సాం పరిస్థితులు వేరు. వాళ్ళవి flood control schemes.

SRI P. SUNDARAYYA:—మనం Irrigation work define చేసినపుడు కేవలం Irrigation and flood schemes గురించికూడా, Drainage Schemes వున్నాయి—మొత్తానికి benefit యిస్తాం, నీరయిస్తే benefit అయినదా వరద ఆపుచేస్తే benefit కాకపోయిందా రెండూ ఉపయోగమే డబ్బుఖర్చు పెట్టడం జరిగింది. రెండింటిలోకూడా ఖర్చుపెడుతున్నాం కనుక కొంతభాగం ప్రభుత్వం తీసుకోవాలని అనుకున్నది. స్పష్టంగా నిర్ణయం చేయవచ్చు. ఇంక అస్సాంకన్నా simplify చేసి చెప్పాను. ఒక Project కట్టాలి. కాబట్టి ఆ Project వల్ల లాభపడేటటువంటి భూములేవో స్పష్టంగా కనపడుతూ నేవుంది. దానికి మంచిభూమిఅయితే ఎకరానికి 10 రూపాయలు బాగా బలహీనంఅయిన భూమిఅయితే ఎకరానికి 5 రూపాయలకు మించకుండా దీనిని దానికి మధ్యను వేయమని చెప్పాము. అప్పుడు ఖచ్చితంగా సరాసరి చేసేదానికి వీలంటుంది. ఆ సూత్రాన్నికూడా మీరు అంగీకరించలేదు. అంగీకరించకుండా యిదేదో పెద్ద విలువ సూత్రాన్ని తెచ్చారు.

ఇది ఏదో విలువ సూత్రాన్ని తీసుకువచ్చేరు. ఇది అర్థము లేనిది. ఈ బెటరుమెంటు లెవీ సూత్రం సెలక్టు కమిటికి తీసుకువచ్చినపుడు అంగీకరించేరుకదా ఇపుడు ఎందుకు ఆక్షేపిస్తున్నారని చాలామంది చెప్పేరు. సెలక్టు కమిటీలు ఎందుకు అంగీకరించేరని ప్రశ్నిస్తున్నారు. అభివృద్ధి మనము బెటరుమెంటు లెవీ వెయ్యాలనే సూత్రానికి అంగీకరించినా ఎవరిమీద పడవలసి ఉంటుంది అనే విషయములో తీవ్రమైన అభిప్రాయభేదము ఉంది. ఇచ్చుకోగలిగిన వారిమీద వెయ్యవలెనని మేము, అందరిమీద వేస్తామని ప్రభుత్వవాదన. ఇక్కడే మీకు ప్రతిపక్షము వారికి

Sri P. Sundarayya] [3rd December 1955

చేసేను అందరిమీద వేస్తామని ప్రభుత్వం అంటున్నది. ఇచ్చుకొన లేని వారిని మినహాయించవలెనని ప్రతిపక్ష వాదన. ఇదివరకుటు బిల్లు ఈ పద్ధతిలోనే చేయ బడింది.

ఈ విలువ అనేది చాలా అన్యాయముగా ఉంది. విలువ అనేది నీరు ఇవ్వ డము బట్టి కాదు. విలువ నీరు ఇచ్చే మెట్టకు, మాగాణికి అది ఒక కారణము మాత్రముగాని, దానిని బట్టి విలువ పెరగదు. దీనిలో పండే పంటనుబట్టి, పంటల ఖరీదును బట్టిఉంటుంది విలువ, భూమిని కొనవలెనన్నప్పుడు దాని మీద demandను బట్టి విలువ పెరుగుతుంది; కేవలం నీరు ఇవ్వడం ఇవ్వకపోవడంమీద కాదు. అది ఒక Factor గాని ప్రధానమైన Factor కాదు. ఈ సందర్భములో విలువద్వారా వేస్తాము అన్నప్పుడు బాగా చూచుకొనవలెను. గోదావరి క్రిష్ణా డెల్టా ప్రాంతాల వారు మెట్ట ప్రాంతాలవారికన్న భాగ్యవంతులు కారు అని చెప్పడానికి వీలులేదు. రాయలసీమలో కూడా భాగ్యవంతులు ఉన్నారు. పేదలు అక్కడా ఉన్నారు ఇక్కడా ఉన్నారు. మొత్తానికి సంఖ్యలో అక్కడ ఎక్కువమంది ధనవంతులు వుండవచ్చును. మాగాణి, మెట్ట ప్రాంతాలలో ధనవంతులమీద పేదలమీద వెయ్య వలసివస్తే పేదలమీద చాలా తక్కువ వెయ్యవలెను. అందరిమీద ఒకే విధముగా వెయ్యడములో మెట్ట ప్రాంతాలమీద ఎక్కువగాను వేసి మాగాణిమీద తక్కువ వెయ్యడము లేకపోతే అసలు వెయ్యకపోవడము జరుగుతుంది. 1956 లో బుడమేరు works ప్రారంభించబోతున్నారు. రెండు మూడు సంవత్సరాలలో పూర్తికావచ్చును. భూముల ధరలు పెరిగితేనే betterment levy వెయ్యగలరు. అక్కడ భూములు ఇప్పుడే ఎక్కువ ధరలలో ఉన్నవి. ఈ మూడు సంవత్సరాలలో పంటల ధరలు పడిపోయే సూచనలు ఉన్నాయి పెరిగే సూచనలులేవు. కాబట్టి ఆ ప్రాంతాలలో భూముల విలువ ఎక్కువకాదు. బుడమేరు గన్నవరం constituency లో నిది ఆ దృష్టితో చూస్తే చాలా మంచిది. బుడమేరు స్కీమువచ్చినా అక్కడ ధనవంతులు బీదలుకూడా ఉన్నారు. Betterment Levy చాలా మంచిదని చెప్పవచ్చును. పేదలమీద వెయ్యవద్దు అక్కడి ధనవంతులమీద వెయ్యండి అని నేను చెబుతున్నాను. విలువ ఉన్నప్పటికీ బాగా ఇచ్చుకొన కల్గిన ప్రాంతాలలో, ఇచ్చుకొన కల్గిన వారి మీద వెయ్యండి. బీదలమీద ఇచ్చుకొనలేని వారిమీద తక్కువగా వెయ్యవలెను. విలువ సిద్ధాంతము చాలా ప్రమాదమైన సిద్ధాంతము ఈ బిల్లును అభివృద్ధి నిరోధక ముగా చేస్తున్నది. ఈ సూత్రం అభివృద్ధి పన్ను రైతు అభివృద్ధి చెంది ఎక్కువ పంట పండించుకున్నప్పుడు దాన్ని అనుభవించడానికి పూనుకున్నప్పుడు అందులో కొంత భాగము ప్రభుత్వానికి ఇవ్వవచ్చును. కొత్త ప్రాజక్టులు కట్టవచ్చును కాని

ఆచరణలో ఏమి జరుగబోతున్నది. ఉపముఖ్య మంత్రిగారు చెప్పినట్లు అమ్మేటప్పుడు registration కోసము stamp duty తగ్గించడానికి విలువను తక్కువగా వ్రాసుకోవడం జరుగుచున్నది. ఎకరా 50% రూపాయిలకు అమ్మడానికి అనేక కారణాలు ఉన్నాయి.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈనాడు రు. 200 ఉన్నభూమి రు. 2000 దాకా పోవచ్చును. ఇది ప్రాజక్టు రావడమువల్ల, మెన్యూర్లు వెయ్యడంవల్లను కావచ్చును.

SRI P. SUNDARAYYA :—కొన్ని examples చెబుతాను. ఒక ఎకరా మెట్ట తీసుకోండి దానిలో జొన్న వేస్తే వ్యవసాయ పద్ధతులను బట్టి రు. 300, రు. 400 రావచ్చును. దానిమీద వేరుశెనగ, పొగాకు, మిరపతోట వేస్తాము. వాటికి మంచు చాలును నీరు అవసరములేదు నీరు ఉంటే అదనముగా పండవచ్చును. కాని జొన్న పంట ప్రాంతాలలో వేరుశెనగవేస్తే వాటికి ధరలు ఎక్కువ ఉన్నప్పుడు acre కు 400 రూ. కు పెరుగుతుంది. 2000 కావచ్చును. నీరు ఇస్తే కొంతవరకు పెరగవచ్చును. ఉదాహరణకు 400 ఎకరుల భూమికి నీరు ఇస్తారు వరి వేస్తారు. డిమాండు ఉండదు. జనాభా తక్కువ ఉంటే 400, 606 దాకా రావచ్చును.1000 కూడా కావచ్చును. కాని పంటలకు డిమాండు వచ్చేవరకు ధరలు పెరుగవు. ఎకరాకు 20 బస్తాలు పండవు. తెనాలి, కొట్లూరు ప్రాంతాలలో 5000, 6000 వస్తాంది. నెల్లూరు జిల్లా తోడ్పు ప్రాంతాలలో 1500 కూడా చెయ్యదు అక్కడా నీరు ఉంది ఇక్కడా నీరు ఉంది. కాబట్టి అది కారణముకాదు. అందుచేత విలువ అనే సూత్రాన్ని తీసు కొనకూడదు. దానికి ఒకదారి కానేకాదు. నేను వాదిస్తున్నది ఏమిటంటే విలువ అన్యాయం చేస్తుంది. విలువ మాత్రం ఇంకోవిధముగా ఉండవచ్చును. సంవత్సరం, సంవత్సరం ఆదాయం పెరగవచ్చును. దాని అర్థం వేరు. భూమిని అమ్ముకున్నప్పుడు వచ్చే డబ్బు ఉంది, పెరిగిన దానిమీద సగము 20 వాయిదాల మీద ఇవ్వవలెను. విలువ పెరిగింది కదా 20 సంవత్సరాలలో ఎందుకు ఇవ్వవలెను. ప్రాజక్టులు జీవితం 100, 200, 300 సంత్సరాలు ఉండవచ్చును. ఆ ఖర్చులను ఆ frame లో తీసుకోనవచ్చును. ఈ రోజున ధరలు పెరిగినవి కనుక సగము వెనువెంటనే ఇవ్వవలెను అనడము న్యాయముకాదు. భూమి అమ్ముకొన్నప్పుడు వచ్చిన లాభాన్నిబట్టి ఒక సంవత్సరం, సంవత్సరం ఆదాయముమీద కాదు. ఇప్పుడే అమ్ముకుంటే దానిమీద సగము ఇవ్వమని చెప్పడము న్యాయమైన సిద్ధాంతము కానేకాదు.

Sri P. Sundarayya] [3rd December 1955

పైగా డబ్బువున్నవాండ్లు ఉన్నట్లయితే, ఈరోజు project కోసం డబ్బు కావలసిఉంది. మీరు అదనంగా వేసినాకూడ అభ్యంతరంలేదు. దాంట్లోకూడ కొన్ని ఎకరాలవరకు మినహాయించి కొంత ఆదాయం తక్కువ వచ్చేటటువంటి వాండ్లను మినహాయించడం అనేది మాయొక్క ప్రధానమైన సవరణ. Select కమిటీలో దానికోసం చాలాగట్టిగా వాదించాము. కాని అక్కడ నిరాకరించారు. ఈ బిల్లుకు అంతా కీలకంఅది. ప్రధానంగా 10 ఎకరములలోపల ఉన్నటువంటి యజమానులను మినహాయించవలెను. దానికిమించి ఉన్నవాండ్లను, దానిమీద graded గా betterment levy అనండి, యింకొకరకంగా అనండి, అప్పుడు ఈ బిల్లు చాల మందికి ఆమోదకరంగా ఉండేది. ఇచ్చుకోగలిగిన వాండ్లమీద అదనంగా పడే టట్లుగా ఉండేది. బీదవాండ్లమీద తక్కువపడేది. అందుచేత ఈ బిల్లుకు కీలకం ఆ మినహాయింపు, ఆ మినహాయింపును ఎన్నిరకాలుగా చెప్పినా, ఎన్నిరకాలుగా సహేతుకంగా వాదించినా ఆ మినహాయింపును ప్రభుత్వం అంగీకరించదు. ఆమినహాయింపును ఎప్పుడైతే అంగీకరించలేదో, betterment levy సూత్రాన్ని అంగీకరించినా అది అందరిమీదా పడతాఉంది. కాబట్టి ఆసూత్రాన్ని అంగీకరిస్తే, మిగిలినవి అంగీకరించినా అంగీకరించకపోయినా, అంతపెద్ద బాధగా ఉండేదికాదు. ఈ బిల్లును అంగీకరించడానికి ఇపుడు 25 వేల రూపాయలనుంచి ఒకలక్ష రూపాయలు చేశారు. అందుచేత కొంతమందికి యేమంటే ఈ betterment levy పడకుండా పోయిందన్నారు. అంటే కొన్ని ప్రాజెక్టుల క్రింద betterment పడదన్న మాట. చిన్నచిన్న లక్షరూపాయలు విలువచేసేదానికి. భూమిఉన్న బీదలమీద అయినా పడకుండా వున్నది. కొంతవరకు సంతోషమే. అక్కడవున్న ధనవంతులుకూడ తప్పించుకుంటూనే ఉన్నారు. మీరుగాని ప్రభుత్వం మినహాయింపులు అంగీకరించిఉంటే, ఈ లక్షరూపాయలుకాదు, 25 వేల రూపాయలు పెట్టినా అభ్యంతరం పెట్టవలసిన అవసరంలేదు. మూడుఏండ్లుకాదు. వెనువెంటనే వసూలు చేసినా అభ్యంతరం ఉండదు. ఎందుకంటే యిచ్చుకోగలిగిన వారిమీద వేస్తున్నారు. ఆ మినహాయింపు లేనపుడు, ఈ మిగిలిన ఎన్నిసూచనలుచేసినా కొంత చిన్నఉపకారం తప్పితే పెద్దఉపకారం ఏమి ప్రజలకు కనబడలేదు. అని మేము స్పష్టంగా చెప్పవలసి ఉంటుంది. అందుచేత యీ విషయాన్నిగురించి సవరణలు వచ్చినపుడు ఎక్కువ వివరాలకు పోతాను. కాని general చర్చలో, దీనిని చెప్పుతూ కొన్నికొన్ని points చెప్పవలసి ఉంటుంది. K. Venkatrao గారు మాట్లాడుతూ ఈ పన్నువిధానంవల్ల మేము socialist pattern of society ని అమలు

3rd December 1555] [Sri P. Sundarayya

చేస్తున్నా మన్నారు. అదే socialist సమాజమనికూడా చెప్పారనుకోండి, దానికి కాంగ్రెసు నాయకత్వం వారియొక్క interpretation ను మేము అంగీకరించడం లేదు. socialist సమాజంవేరు, socialistic pattern సమాజంవేరు, socialist పద్ధతి, తరహా సమాజంవేరు అన్నారు. ఇది కాంగ్రెసు socialist తరహా సమాజానికి చక్కని వ్యవహారంగాఉంటే ఉంటుందిగాని, socialist సమాజానికి మాత్రం పన్నులద్వారానేదగ్గరకు వెళ్లుతామనేది ఇంతవరకు ప్రపంచచరిత్ర అనుభవంలో ఎక్కడాలేదు. ఇటువంటి Betterment Levy, Income Tax, death duties, ఇంగ్లండులోను అమెరికాలోను ఉన్నాయి. అవిఅన్ని socialist సమాజాలు అనిగాని, socialist రహా సమాజానికి దగ్గరగా ఉన్నాయనిగాని ఎవరు అనుకోవడంలేదు. లేక సమాజంలో తారతమ్యాలు ఏమైనా తగ్గినాయా అంటే ఏమి తగ్గలేదు. మరింత ఎక్కువగానే అవుతూవచ్చిందిగాని, మరిఏమిలేదు. ఇటువంటి పద్ధతులవల్ల అందరిమీద సమానంగావేసి, ఈ తారతమ్యాలు తగ్గించివేస్తామని, socialist సమాజానికి లేక, తరహా సమాజానికి, దగ్గర వెళ్లుతున్నామని మీరు భ్రమలోఉంటే ఉండవచ్చునుగాని, ప్రతిపక్షం అటువంటి భ్రమలోలేదని చెప్పవలసి వస్తుంది. తరువాత మా అభిప్రాయము అంతాకూడ కేవలం ఒక ప్రాజెక్టును కట్టేదానికి ఎంతఅవుతుందో ఆ సూత్రాన్నిబట్టి వేయమని చెప్పాము. అది ఒక సూచనతప్పితే, దానిలోకూడ మినహాయింపు అనేది మాదిచెల్లదు. మాయొక్క పన్నుల విధానంలో ప్రధానమైనది అది బీదలమీద పడకూడదు. ధనవంతులమీద పడితే, అదికూడ graded గా పడితే మాకు ఎటువంటి అభ్యంతరంలేదు. గాని ఈ బీదలమీదవేయడంమాత్రం మేము ఎప్పుడుకూడ వ్యతిరేకిస్తాము. ఆ సూత్రాన్ని మీరు అంగీకరించనంత కాలము, దానిమీద ఏకాభిప్రాయం కుదరడం అనేది. ఏరీతిగాకూడ సాధ్యంకాదు. అందుచేత ఈ general చర్చలో ఇంతకన్న ఏమి ఎక్కువ చెప్పతలచుకోలేదు.. ఈ సవరణలు వచ్చినపుడు ఒక్కొక్క సవరణను గురించి, ముఖ్యంగా ఈ మినహాయింపు సవరణగురించి చాలా చెప్పవలసి ఉంటుంది. ఇది కడకు ఈ Betterment Levy ఎంతదారుణంగా పోతుందంటే, ఎకరాకు 55 రూపాయలకు తక్కువకాకుండా పడిపోతూవుంది. ఈ water tax రానివ్వండి, Betterment Levy కానివ్వండి, అవిఅన్ని చూచుకొన్నప్పుడు, ఎకరాకు 55 రూపాయలు ప్రభుత్వానికి ప్రతిసంవత్సరం పన్ను కట్టవలసివస్తే, ఎంత ఆదాయం ఎకరంమీదవస్తే ఎన్ని అటువంటి ఎకరాలు ఒక మనిషికిఉంటే, అతడు కనీసం మామూలు మధ్యతరగతి జీవితంఅన్నా జీవించేదానికి వీలువుంటుందో, ఒకపర్యాయం ప్రభుత్వం ఆలోచించినట్లయితే, ఈ బిల్లులుఅన్ని అనవసరంగా రైతాంగాన్ని బాదేసి, అభివృద్ధిలోని తేవలెనని అనుకొన్న రైతాంగాన్ని క్రుంగదీసేదానికి దారితీస్తుంది అన్నే

Sri P. Sundarayya] [3rd December 1955

సంగతి తర్వాత సవరణలు వచ్చినపుడు ఇంకా వివరంగా తెలియచేస్తాను. అందుచేత ఈ general చర్చకు వచ్చినపుడు ముందుగానే ఈ బిల్లుమాత్రం అంగీకార యోగ్యంగాలేదని చెప్పి ముగిస్తూ వున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—అధ్యక్షా, Select Committee నుంచి వచ్చిన సవరణబిల్లులోని చాలా విషయాలపై తర్జన భర్జనలు జరిగినవి. ఇపుడు సవరణలకుగాని, లేక ప్రాజెక్టులకుగాని, సంబంధించి నటువంటి విషయాలను గురించి మాట్లాడి, కాలాన్ని వృధాచేయడం నాకు అంత మంచిపని కాదనితోస్తున్నది. అయితే కొన్ని fundamental విషయాలమీద సభ్యులు కొన్ని అనుమానాలను. సంశయాలను వెలిబుచ్చారు. వాటిని గురించి మాత్రం రెండు మూడు విషయాలు మాట్లాడుతాను. ప్రతిపక్షంలో ఉన్నవారు ఎప్పుడుకూడా తామంతా బీదలకొరకే ఉన్నామని, తక్కినవాండ్లందరు భాగ్యవంతుల కొరకే పుట్టారని, వారి భావమే అది అని, వారి mentality అదే అని, అంటారు. వారి అభిప్రాయాలు ఎట్లా ఉండినా, తక్కినవారికికూడ, కొన్నిఅభిప్రాయాలు ఉంటాయని అనుకోవాలి. తక్కినవారికి పేదలమీద దయలేదని, బీదలను అంతా నిర్దాక్షిణ్యంగా, మొరటుతనంగా కాఠిన్యముతో పరిపాలించుచున్నారని అనుకోవటంమాత్రం అంత సమంజసమైన వాదము కాదేమోఅని అనుకొంటున్నాను. బీదల విషయం వచ్చినపుడు వాండ్లు ఎట్లా అనుకొంటున్నారో, అంతకన్న ఎక్కువ ఉదారత్వం మాకుకూడ ఉందని అనుకొంటున్నాము. మేము మా ఉదారతను భాద్యలతో చూపిస్తున్నాం. చేతలలోకూడ కాంగ్రెసుప్రతిపక్షం వారికన్నా ముందుగనే నడిచిఉదారతను చూపించింది. అందువల్ల కేవలం ఉపన్యాసాలతో ప్రతిదఫా వారు ఏమో బీదలకొరకే ఉన్నారని మేము ఏమో భాగ్యవంతులకొరకే ఉన్నామని వారు అనటం, మేము ఖండించడము. దీనిని గురించి ఎప్పుడు చెప్పడం, ఇది శాసనసభలో పరిపాటిగాను, సాంప్రదాయంగాను అయిపోయింది. ఇవి మామూలు పన్నులవంటి పన్నుకాదు. ఈ Betterment Levy వెనుకబడిన ప్రాంతములోని వారు పేదలు అయ్యో వారి అభివృద్ధికొరకు మేము ఎంతోపని చేయాలి. వారిని మనం ఉద్ధరించాలి. అభివృద్ధిలోకి తేవాలి. తెనాలి తాలూకావారంతా ముందుకుపోయారు. వారి అభివృద్ధినే వారు చూచుకొంటున్నారు, వారికి ఇంకొక ఆశయంలేదు. అట్లాఅని యల్లమందారెడ్డి గారు, ఇంకా ఇతరులుచెప్పారు. వెనుకబడిన ప్రాంతాలలోని వారు వెనుకబడి ఉన్నారని రోజూ చెప్పుతూవుంటేనే, మాటలతో గనుక వారు అభివృద్ధిలోనికి వస్తే వారివారి చేసుకూడ ఆ విధంగా చేయడంమంచిదని ఒప్పుకునేవాడినే కాని

కేవలం మాటలవల్ల ముందుకు రావడంలేదు. ఐతే బ్రిటిష్ ప్రభుత్వంవారి కాలములో కూడ అక్కడక్కడ ఆనకట్టలు కట్టారు. కట్టలేదని నేను అనను, కాని ఎక్కడో కొన్ని చోట్లలోనే ఆనకట్టలు కట్టారు. ఎక్కువ దేశాన్ని అభివృద్ధిచేయలేదు.

(At this stage Sri P. Narasimhappa rao occupied the Chair.)

కాని స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వెనుకబడిన ప్రాంతాలను త్వరలో అభివృద్ధిలోనికి తీసుకొని రావలెననే తలంపుతో ఎన్నో ప్రాజక్టులను అమలులోనికి తీసుకొని వస్తున్నాను. ఇదివరకు అభివృద్ధి చేయబడిన ప్రాంతాలనుంచి వచ్చిన ఆదాయాన్ని వెనుకనబడి ఉన్నటువంటి ప్రదేశాలలో ఖర్చుచేయదలచుకున్నారు. ప్రజలు ఎట్లా పేదలుగా ఉన్నారో ప్రభుత్వంకూడా అట్లానే ఉన్నది. కాబట్టి India Government నుంచి loans వల్ల అప్పు తీసుకువచ్చి వెనుకబడ్డ ప్రాంతాలలోఖర్చు పెట్టుటకు తొందర పడుచున్నాము. అభివృద్ధి కావలండా వెనుకబడి ఉన్నటువంటి ప్రాంతాలనుకూడా తొందరగా అభివృద్ధిలోకి తేవాలనేటటువంటి ఉద్దేశంతోనే ఈ Betterment Levy బిల్లు తేబడ్డది. తరువాత ఇంకొక విషయంకూడా చెబుతున్నాను. అది ప్రతిపక్షంవారికి ఇష్టం ఉండవచ్చు కాకపోతే పోవచ్చు. వైద్యులైన వారికి ఈ విషయం బోధపడుతుంది. ఒక రోగి బాధపడుతున్నాడనుకోండి. ఆ వ్యాధి నివారణకు శస్త్రి చికిత్స అవసరంకూడ అయితే రోగి బాధపడుతున్నాడని శస్త్రి చికిత్స కాదనడం మా అభిప్రాయం కాదు. శస్త్రి చికిత్సకూడా చెయాల్సి వచ్చినపుడు చేసి ఆ వ్యాధిని శాశ్వతంగా నివారించడమే మా ధ్యేయం. ఆ శస్త్రిము ఉపయోగించేటప్పుడు కొంచెము కష్టము అయినా ఆ కష్టాన్నికూడా సహించడానికి మాకు సహనం ఉన్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మీ వైద్యంవల్ల patient చచ్చిపోతాడేమో ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వైద్యము మానుకోమని వెంకటేశ్వర్లుగారి ఉద్దేశ్యము అయితే కావచ్చును. నేను ఆ వాదానికి ఒప్పుకోను. వెనుకబడిన ప్రాంతాలవారు ఉన్నారు, పేదప్రజలు ఉన్నారు. పేద ప్రజానీకం ఉన్నదని. వాళ్లను ముందుకు తేవాలి అంటే డబ్బు ఉంటేగాని ముందుకు పోవడానికి వీలులేదని మీరే చెబుతున్నారు. కాని పన్ను మాత్రం వేయవద్దు, అంటే డబ్బు ఎక్కడనుండి తెమ్మనమని? ఏవిధంగా తెమ్మనమని వారి ఉద్దేశమేమో బోధపడటంలేదు. ఎంతసేపు చెప్పినా

వేయండి, అని మాత్రం చెప్పడంవల్ల సమస్యలు పరిష్కారంకావు. ఒక ఎకరం ఉన్నవారిమీద కొంత పన్ను వసూలుచేస్తే 2 ఎకరాలు ఉన్నవారిమీద దానికి రెట్టింపు వసూలు చేస్తున్నాము. 50 ఎకరాల మీద 50 రెట్లు వస్తుంది. Progressive కాకపోయినా దీంట్లో ఒకవిధమైనటువంటి క్రమ పద్ధతులు ఉన్నవి. అంతే కాకుండా నందికొండవల్ల సాగుఅయ్యే భూములమీద Betterment Levy వేయడంవల్ల ప్రభుత్వానికి 125 కోట్లు వస్తున్నదని శ్రీ గోపాలకృష్ణయ్యగారు చెప్పారు. వావిలాల గోపాలకృష్ణయ్యగారు 135 కోట్లు వచ్చేటట్లు చేస్తే వాంట్లో 35 కోట్లు వారికి ఊరికేనే ఇచ్చి నా ఆస్తి అంతాకూడా ఊరికేనే రాసి ఇస్తాను అని చెపుతున్నాను. కాబట్టి ఊరికే లేనిపోని లెఖ్ఖలు చెప్పి ప్రజలకును మభ్య పెట్టడం తప్ప వేరుకాదు. అని తెలియ జేస్తున్నాను. ఇది అంతా ఒక భ్రమలో చేస్తున్నారు అంటే 125 కోట్లు ఖర్చుపెట్టినదానికి 135 కోట్లు వసూలు చేస్తున్నారు. అని చెబితే అమాయకంగా నమ్మేవారు ఎవరూ ఉండరు. ఆవిధంగా గోపాలకృష్ణయ్యగారు చెప్పినా నేను చెప్పినా అంత అమాయంకంగా నమ్మే ప్రజలుమాత్రం ఎక్కడాలేరు. దానివల్ల పేదప్రజలకు మరింత హానిచేయడము మరింత బాధకల్గించడము అవుతుందని మాత్రం నేను మనవిచేస్తున్నాను. తరువాత ఇంకోవిషయంకూడా ఉన్నది. Betterment Levy మొత్తాన్ని ఏరకంగా వసూలుచేయాలనేదానిలో అభిప్రాయ భేదాలు ఉండవచ్చు. ఇతరులు చెప్పేదానిలో honesty లేదని, వారు ఊరికే చెప్పుతున్నారనేటటువంటి మాటలు అనేవాడినిగాను. Betterment Levy వసూలుకుగాను, ఆయారాష్ట్రాలు ఆయా విధానాలు అవలంభించాయి. ఉన్నదాంట్లో ఏ విధానం అవలంబించినప్పటికిని ఈ రెండో విధానానికి మరిఒక విధంగా వ్యతిరేకంగాను, వైరుధ్యంగానుకూడా ఉండవచ్చు. మద్రాసు ఒక విధానం అవలంబించింది. బొంబై ఇంకొకవిధానం అవలంబించింది. అస్సాంలో ఇంకోరకంగా ఉన్నది. పంజాబ్‌లో ఇంకో విధంగా ఉన్నది. అక్కడక్కడవున్న పరిస్థితులనుబట్టి లేక ప్రక్కనఉన్నటువంటి పరిస్థితులనుబట్టి విధానాలను నిర్ణయం చేసుకొంటున్నాము. దానినిగురించి ఉపముఖ్యమంత్రిగారు చెప్పినారు. Betterment Levy లెక్కకట్టే విషయంలో ప్రభుత్వం ప్రాజెక్టును ఆరంభం చేసినటువంటిరోజున వున్న భూమివిలువ ప్రాజెక్టును పూర్తిచేసినటువంటిరోజున వున్నవిలువ ఆధారంగా తీసుకోవడం సులభంఅని Select Committee లో చెప్పినతరువాత, కొంత వాదోపవాదం జరిగినతరువాత ఎక్కువమంది సభ్యులయొక్క అభిప్రాయం ఆ విధంగావున్న కారణంచేత ఆ పద్ధతిపైనే యీ బిల్లును మార్పుచేశాము. దానివిషయమై తర్జనభర్జన చేయడం అంత బాగుండదు.

అందువల్ల వ్యక్తిగతంగా అభిప్రాయభేదాలువున్నా మొత్తంమీద ఒక తీర్మానాన్ని ఆమోదించాము. కాబట్టి దానిని అందరూ అంగీకరించాలి. ఎక్కడో ఒకచోట రైతులకు ఎక్కువబాధలు లేకుండా, ఎక్కువకష్టాలు లేకుండా కొంత తేలికైనటువంటి పద్ధతులపై పన్ను వసూలుచేసే విధానం బాగుంటుందని మా ఉద్దేశ్యం. సవరణలు వచ్చినప్పుడు తక్కినవిషయాలు మాట్లాడుకోవడం మంచిది. శ్రీ సుందరయ్యగారుమాగాణిప్రాంతం భూములపైన, మెట్టభూములపైన, ఒకేరకంగా పన్ను వేయవద్దని చెప్పారు. మంచిదే. అయితే మనం ఈ అభివృద్ధిపన్ను విధింపును ఒకి సూత్రాన్నిబట్టి వేస్తున్నాముగాని మాగాణి, మెట్టఅనే వివక్షత చూపడంలేదు. మెట్ట భూములను రక్షించడానికి, నీటిసరఫరా జరపడానికి, రైతులకు తప్పక పంటచేతికి రావడానికి మాత్రమే ప్రాజెక్టులు నిర్మిస్తున్నాము. ఆప్రాజెక్టులవల్ల అభివృద్ధిపొందిన భూములనుండి కొంత మొత్తాన్ని అభివృద్ధి పన్నుగా వసూలుచేయడమే మా అభిప్రాయము. అయితే ఈ భూములలో వరిపంటనే వేసుకోవాలన్న నిబంధన, నియమములేదు. ఏ పంటనైనా రైతులు సాగుచేసుకోవచ్చు. ఒక ప్రాజెక్టు పూర్తి అయిన తరువాత అక్కడఉండే భూములకు కొంత రక్షణఉన్నదనే కారణంచేత వాటి విలువ పెరుగుతుంది. తరువాత పంటలు అభివృద్ధిఅయిన తరువాత విలువ ఇంకా పెరగడానికి వీలుఉంది. అందుకనే పన్ను ఇవ్వాలన్నాం. కొంత time కూడా రైతులకు ఇవ్వాలి. 2 సంవత్సరాలు అనండి 3 సంవత్సరాలు అనండి. ఎన్ని సంవత్సరాలు అయినా అనండి కొంత సమయము గడిచేటప్పటికి ఇంకా ఎక్కువ అవకాశం పుచ్చుకొని పంటలు పండించుకొని కొంతడబ్బు సేకరించడానికి వీలు ఏర్పడుతుందనే ఉద్దేశ్యంతోనే వసూలు విషయంలోకూడా వారికి కొంతవ్యవధి ఇచ్చి వారికి కొంత రక్షణ కలుగచేయడానికి ఉద్దేశించాము. కొంతమంది గౌరవసభ్యులు "దీనిని వ్యాపారదృష్టితో చేస్తున్నారు. ఇది అంతా వ్యాపారం, ఇది అంతా లాభసాటి బేరం" అంటున్నారు. అది సరియైన అభిప్రాయంకాదు. వెనుకబడిన ప్రాంతాలనుంచి డబ్బు గుంజుకుందామనే ఉద్దేశ్యం మాకేమాత్రంలేదు. అభివృద్ధిచెందిన ప్రాంతాలనుంచికూడ డబ్బు తెచ్చి వెనుకబడిన ప్రాంతాలలో ఖర్చుపెడదాము. ఒక ప్రాంతం వెనుకబడిఉన్నది, అక్కడనుంచి ఎంతమాత్రం డబ్బు వసూలు చేయవద్దు అని అంటె ఆ ప్రాంతాలవారు ఎప్పుడూ వెనుకబడే వుంటారు, ఇంక అభివృద్ధికి అవకాశంలేదు. ఆ విధానం అభివృద్ధి నిరోధకమే అవుతుందనుకొంటాను. పంటలధరలు తగ్గిపోయినాయి కాబట్టి రైతులు అభివృద్ధిపన్ను ఇచ్చుకోలేరని కొంతమంది చెబుతున్నారు. అయితే పంటధరలు తగ్గినప్పుడు భూముల ధరలుకూడా తగ్గుతాయి. అవి సహజంగా ఉండేటటువంటిది. భూములయొక్క విలువలలోవచ్చిన అభివృద్ధిని ఆధారంగా చేసుకొని పన్నువిధిస్తాము కనుక ఎవరికి

Sri K. Chandramouli] [3rd December 1955

దండుగకాదు. నీటి వసరులు ఏర్పడిన తరువాత పంటలు పండించు కొన్న తరువాత 5 ఏండ్లు అయినతరువాత అభివృద్ధిపన్ను వేసినట్లయితే సుందరయ్యగారు చెప్పేటటువంటికి వాదనలో బలంఉన్నది. అట్లా వేయటంలేదు. మనం ఒక ప్రాజెక్టు కట్టడానికి ఆరంభించి పూర్తిచేశాము. పూర్తిచేయక నే నీరురాదు. అందు వలన మొదలుపెట్టిన తారీఖున, పూర్తిచేసిన తారీఖున భూమికిఉన్న విలువలు తీసు కొంటున్నాముగాని తరువాత పంటలకుండే ధరలనుబట్టి మనము betterment levy ని విధించడంలేదు. అందువల్ల ధరల హెచ్చుతగ్గులువల్ల రైతులకు దండుగ వస్తుందనే వాదనను నేను అంగీకరించలేను. ఈ అభివృద్ధి పన్నుమీద వడ్డీతీసుకో వద్దని ఇంకొకవాదన. సామాన్యమైనటువంటి రైతులకుకూడా కొన్ని కష్టాలు ఉన్నాయనే సంగతి నాకు తెలుసు. అందువల్లనే 20 వాయిదాలమీద ఈ పన్నును వసూలుచేసుకొంటాము.

ఏ ప్రభుత్వమైనా వడ్డీలేకుండా అప్పులు యివ్వడంఅనేది చాలాఅరుదు. ఏదో ఎక్కడో పెద్ద చిక్కులు ఉన్నప్పుడు grants, loans ఇచ్చేచోట్ల, వడ్డీలేకుండా యివ్వవచ్చు. ఇది అటువంటిదికాదు. ఇది మామూలుగా ప్రతిసంవత్సరము వేసే టటువంటిపన్ను, అభివృద్ధిమీద వేసేటటువంటిది. దీన్ని వాయిదాలమీద వసూలు చేస్తున్నాము కాబట్టి, ఈ వాయిదాలకు కొంతవడ్డీ ఇవ్వవలసిందని చెప్పుతున్నాము.

తరువాత యల్లమందా రెడ్డిగారు మాట్లాడుతూ, దీంట్లో ఏవోకొన్నివిషయాలు మరుగుపరచి చేస్తున్నామని అన్నారు. ఈ బిల్లు స్పష్టంగా ప్రకటనచేశాము. దీన్ని గురించి తర్జనభర్జనలు జరుగుతున్నాయి. దీంట్లో మరుగుపరచవలసిన విషయాలు ఏమిఉన్నాయో, అవికూడ వారుచెప్పితే, మాకు స్పష్టంగా తెలిసేది. కాని అదేమిలేకుండా, దాన్ని మరుగుపరుస్తున్నామని, దీన్ని వెనుకల ఏదో ఉన్నదని చెప్పు చున్నారు. అసలు కాంగ్రెసుపార్టీ, స్వరాజ్యం వచ్చినతరువాత, చట్టానికి విరుద్ధంగా ఎప్పుడూ పోవడం జరగలేదు. పూర్వము ఎట్లుండినప్పటికి, స్వరాజ్యం వచ్చినతరువాత చట్టాలకు విరుద్ధంగాపోవాలని అనుకోలేదు. చట్టము నియమాలను బట్టే మనము యేదైనా చేసుకొందామని అనుకొన్నాము, మనరాజ్యం మనకువచ్చింది కాబట్టి.

ఇక ప్రగడ కోటయ్యగారు ప్రభుత్వముఅమ్మిన భూములకు Betterment Tax ఉండరాదని చెప్పారు. ఈ బంజరు భూములన్నీ అమ్ముతున్నారు గనుక, వాటికి వేయకూడదని వారిఉద్దేశము. అసలు ఈ projects కు Estimates వేసే టప్పుడే, ఇంజనీర్లు ఈభూముల అమ్మకంవల్ల కొంతవస్తుందని, Betterment Tax

వల్ల కొంతవస్తుందని, ఈవిధంగా అన్నికూడ వారు లెక్కవేసి, ఈరూపంగా ఇంత డబ్బు వస్తుంది, ఇంత ప్రభుత్వము పెట్టవలసియుంటుంది, ఇంత అప్పు తీసుకురావలసియుంటుందని చెప్పారు. కనుక ఇవన్నీ యిదివరకే ఎస్టిమేట్లు వేసేటప్పుడే లెక్కవేసుకొని సూచించబడినాయి.

నాగార్జున సాగరు ప్రాజెక్టుగాని, దీనికిముందు కట్టబోయే ప్రాజెక్టులుగాని వచ్చినప్పుడు ఇటువంటి షరతులు కొన్ని నియమాలు ఏర్పరచుకొంటేతప్ప, భారత ప్రభుత్వమునకు రాష్ట్రప్రభుత్వాలకు ఒకవిధమైన ఒడంబడికలు, అన్యోన్యత ఏర్పడడానికి వీలుండదు. వారినుంచి కొంత ధనసహాయముగాని, ఇతరసహాయాలుగాని తెచ్చుకోడానికి వీలుండదు. అభివృద్ధేమో త్వరగా కావాలి. ఒకనిమిషమైన ఆలస్యము కాకూడదు. అయితే డబ్బుమాత్రము అడగకూడదు. ఎక్కడ ఏమి ఖర్చుపెట్టకూడదు అన్నట్లయితే అది ఏవిధంగా సరిపోతుంది. "పెళ్లి కుదిరితేగాని పిచ్చి కుదరదు, పిచ్చి కుదిరితేనేగాని పెళ్లికుదరదు" అన్నట్లున్నది. కనుక దీన్ని కొంత సమన్వయం చేయవలసి ఉంటుంది. కొంత రైతులు భరించవలసి యుంటుంది. కొంత ప్రభుత్వము భరిస్తుంది. మరికొంత యితరచోట్లనుంచి తీసుకొనిరావలసి యుంటుంది. ఆవిధంగా ఒకప్రాజెక్టుకట్టుకొని, దానివల్ల కొంచెము డబ్బువస్తే మరల తొందరగా ఇంకొకప్రాజెక్టు కట్టడానికి వీలవుతుంది. ఎక్కడచూచినా, మాకిదికావాలి, మాకిదికావాలి, అభివృద్ధికావాలి అని అంటున్నారు. మేము యింకా వెనుకపడియున్నాము, ఎక్కువ అభివృద్ధి కావడంలేదు అని ఒకవంక ప్రకటన చేస్తున్నప్పుడు, ఆ అభివృద్ధికొరకు తాత్కాలికంగా కొన్నికష్టాలు పడవలసి ఉంటుంది. దేశానికి స్వరాజ్యం రావాలన్నప్పుడు, అందరు కొన్నికష్టాలుపడలేదా? మనము కష్టపడినా, మనపిల్లలైన సుఖపడుతారు కదా అని మనము ఆ ఉద్యమంలో కొన్నికష్టాలు పడ్డాము. కనుక యిక్కడకూడ ఆ దృష్టితోనే, తాత్కాలికంగా కొన్ని చిక్కులుఉన్నా, కొన్నికష్టాలు ఉన్నప్పటికినీ, larger interests తో శాశ్వతమైన వికాసవంతమైన అభివృద్ధిని చేకూర్చనిమిత్తము భావిసంతతికైనా ఇటువంటి ఒడుదుడుకులు లేకుండా, చిక్కులులేకుండా తొందరగా వాటిఫలితాలను అనుభవిస్తామనే విశాలమైన దృష్టితోనే యీబిల్లు తేబడినది. తక్కినవిషయాలు ఏమైనావుంటే, ఒక్కొక్కక్లాజు వచ్చినప్పుడు, దానివిషయంగురించి మాట్లాడుకొందాము. కనుక దయచేసి సభ్యులందరు ఈ బిల్లునుగురించి మాట్లాడేప్పుడుగాని, యిందులో క్లాజులుగురించి మాట్లాడేప్పుడుగాని, యీ విషయాలన్నికూడ దృష్టిలో పెట్టుకొని మాట్లాడవలసిందిగా కోరుచున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—ఈ బిల్లు అమలుకు వచ్చినప్పటికి, 5 సంవత్సరముల తరువాత ఏమాత్రము ఆదాయమువస్తుందో ప్రభుత్వము అంచనా వేసిందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఒక్కొక్క ప్రాజెక్టు ఎప్పుడు ప్రారంభిస్తారో, ఎప్పుడు పూర్తిఅవుతుందో చెప్పలేము. అది పూర్తిఅయిన తరువాత మూడేళ్ళకు యీ tax వసూలుచేయబోతాము. అందువల్ల ఇప్పుడే ఎంత ఆదాయము వస్తుందనేది చెప్పాలంటె సాధ్యంకాదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—సాధారణంగా ఏదైనా బిల్లు తీసుకువచ్చినప్పుడు, దానివల్ల ఎంతఆదాయము వస్తుందని ప్రభుత్వము అంచనా వేస్తారు, ఏబిల్లు అయినప్పటికినికూడ. అందువల్ల యీ బిల్లువిషయంలో ప్రభుత్వానికి ఎంతఆదాయము వస్తుందని అంచనా వేసుకొన్నారా, ఈ Betterment Tax ద్వారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఏదో Rough గా, దీనికి 25 per cent రావచ్చునని, యింకోదానికి 40 per cent రావచ్చునని, ఈ విధంగా rough గా వేసుకొంటారేగాని ఖచ్చితంగా చెప్పడానికీ సాధ్యంకాదు. ఇప్పుడు తుంగభద్రా ప్రాజెక్టుమీద సుమారు 26 percent రావచ్చునని rough గా అనుకొన్నారు. ఇంక కట్టబోయ్యేవాటిని గురించి ఇప్పుడే చెప్పాలంటే ఎట్లా సాధ్యమవుతుంది ? తరువాతచేసే improvement ను బట్టి, అనుకొన్నదానికంటె ఎక్కువ రావచ్చుకూడ. కనుక సుమారుగా యింతవుంటుందని చెప్పవచ్చునే గాని correct figures చెప్పడానికి వీలులేదు.

MR. SPEAKER : The question is :

"That the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955 as amended by the Select Committee be taken into consideration at once."

The motion was carried,

*Clause 3.*

MR. SPEAKER : The House will now proceed to discuss the Bill clause by clause. The motion is :

Clause 3 do stand part of the Bill.

The amendments may be moved now.

SRI P. SUNDARAYYA : Sir, I beg to move :

In clause 3; line 3, after the words " from the owner of the land ", add the words " exceeding 10 acres."

The motion was duly seconded.

SRI P. SUNDARAYYA : I am not moving my second amendment ; but I am moving the third amendment. I move, Sir, In clause 3 for the words " one lakh of rupees substitute the words ' five lakhs of rupees."

The motion was duly seconded.

SRI PILLALAMARRI VENKATESWARLU : I am not moving my amendment which runs thus : " in clause 3, after the words " owner of any land " add the words " who pays land revenue exceeding 25 rupees for fasli ". But I move, Sir, —

' For the words " three years " in the proviso substitute the words " five years ",

The amendment was duly seconded.

SRI B. RATNASABHAPATHY : Sir, I beg to move :

' In clause 3, for the words and figures " 15th August 1947 " in line 8, substitute the word and figure " 1st October 1953.'

The amendment was duly seconded.

SRI G. YELLAMANDA REDDI : Sir, I beg to move—

' Add the following as Explanation III, in clause 3 :—

*Explanation III.*—Completion means completion of every minor work for taking water to the land.'

MR. SPEAKER : What the hon. Member means is not clear. Does he mean ' work connected with the project in all its details.'

SRI G. YELLAMANDA REDDI : Yes, Sir.

The amendment was duly seconded.

MR. SPEAKER : Mr. SUNDARAYYA will now speak.

Sri P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈ బిల్లులో అన్నిటికంటె ప్రధానమైన క్లాజుయిదే. ఈ క్లాజుకు అనేకసవరణలువచ్చినవి. నేను నా సవరణను గురించి మాట్లాడుతూన్నప్పుడు యితర సవరణలను గురించి కొద్దిగా మాట్లాడవలసి వచ్చింది. నా మొదటి సవరణలో "పది ఎకరాలకు మించినవారిమీదనే యీ పన్ను వేయవలసివుంటుంది" అని అర్థము వచ్చేటట్లుగా పెట్టాను. అంటే ఏ భూమి అయినా పదిఎకరాలభూమివుండి, దానికి యీ నీరు వుపయోగపరచినట్లయితే, ఆ భూమియొక్క యజమానివద్దనుంచి యీ Betterment Tax వసూలు చేయాలనే నేను సవరణతెచ్చాను. ఇది చాలా ముఖ్యమైన సవరణ రాష్ట్రములో ప్రాజెక్టులు కావలసివున్న సంగతి నిజమే. రైతులు కోరుతున్నమాట నిజమే. ఇంకా వెనుకబడ్డ ప్రాంతాలలో యింకా అవసరముగా కావాలి. బాగా పంటలుపండేచోట్లలో, ముంపు నివారణ స్కీములుకూడా కావాలి. ఇందులో అభిప్రాయభేదము ఎవరికి గూడాలేదు. ఇవిఅన్ని కావలసినమాట నిజమే. నేను ఒప్పుకుంటాను, అయితే యివి అన్నీ చేయించటానికి డబ్బుకావాలి అని ప్రభుత్వంఅంటే, యీ డబ్బు ఎక్కడినుంచి వస్తుంది. ప్రజలమీద డబ్బు Betterment Tax ద్వారా వసూలు చేస్తామనిఅంటే, అందులోనే అభిప్రాయభేధాలువచ్చినవి. పన్ను ఎవరిమీద వేసి వసూలుచేయాలని ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యం ? ఈ పన్ను వేయాలని మేముకూడ చెబుతునేవున్నాము. అందుకు మేము వ్యతిరేకిస్తున్నామని అంటున్నారు, అది కానేకాదు. మేముచెప్పేది పన్నులు ప్రభుత్వం వేయదలిస్తే, భాగ్యవంతులమీద, పెద్ద పెద్ద రైతులమీద, జమీందార్లమీద, అటువంటివారు ఎక్కువ ఆదాయము వచ్చేవారిమీద వేయండి, పేదవాళ్లమీద వేయవద్దు, వాళ్లు భరించలేరు అనిఅంటూ, ఆ ప్రకారము యీ బిల్లును సవరించమని అంటున్నాము. అంతే ప్రతిదానికి మేము వ్యతిరేకిస్తున్నామని అంటే, అర్థములేదు. మేము తెచ్చిన సవరణ ఏమిటంటే, పదిఎకరాలకుపైగా వున్నవారిమీద యీ పన్నువేసి వసూలుచేయండి అంతకు తక్కువగావున్న వారిమీదవద్దు అని అంటున్నాము. ఈ పన్ను అందరిమీద వేస్తామనిఅంటే, పేదవాళ్ళమీద యిదివరకే భరించలేని పన్నులు వున్నవి. వారు భరించలేకుండా వున్నారు. ఇకమీదట వారిమీద పన్నువేయువద్దని అంటున్నాము. నాగార్జున ప్రాజెక్టువస్తే, దానిద్వారా నీరు పారుదలఅయి, మాగాణి ఏర్పడి పంటపలుండేభూములుమీద, ఎకరానికి 15 రూపాయలవంతున Betterment Levy వసూలుచేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. అయితే యిందులో యింకా కొన్నిరకాలుగా వసూలుచేస్తామని అన్నారు. మాగాణిభూమి ఎకరము ఒకటింటికి 15 రూపాయలు, మెట్టఅయితే 10 రూపాయలు యివిగాక, చెరుకు అరటి, అనుతోటలు. యిటువంటివాటికి

సంవత్సరము పొడుగూన నీరు కావాలి కాబట్టి వాటి విషయములో ఎకరానికి 24 రూపాయల చొప్పున వసూలు చేస్తామని అన్నారు. ఇది కాకుండా ఈ Betterment Levy వేసినప్పుడు ఆయా ప్రాంతాలలో భూమికి విలువ పెరుగుతుంది కాబట్టి, ఆ విధంగా పెరిగినప్పుడు సగముపన్ను వేయవచ్చునని అన్నారు. మెట్టప్రాంతాలలో యీ రోజునవున్న ధరకన్నా యేమీ పెరగదు. అందుచేత ఆ విధంగావున్న మెట్టప్రాంతాలవారిమీద వేసి, అది 20 annual Instalments లో వసూలు చేస్తామనిఅంటే, అప్పుడు ప్రభుత్వం చెప్పిన పదిరూపాయలలో సగము అయిదురూపాయల చొప్పున, 25 annual Instalments లో కట్టుకోవలసివుంటుంది. ఇదిగాకుండా ఒక మెట్టప్రాంతము మాగాణీ చేయాలని అంటే, ఎకరానికి తప్పనిసరిగా కనీసము 250/- రూపాయలు ఖర్చు పెట్టితేగాని అది ఒక రకమైన మాగాణిఅని అనిపించుకోదు. అంతసొమ్ము ఖర్చుచేస్తేనేగాని అది మాగాణి కావటానికి సాధ్యపడదు. అదిగూడ యింకా ఎక్కువే అవుతుంది. అనుకోండి, కాబట్టి మెట్టప్రాంతము మాగాణి కావడము అంటే, ఎక్కువగా శ్రమ, ఖర్చుగూడ అవుతుంది. తేలికగాకాదు. ఆ విధంగా ఖర్చుపెట్టి మాగాణి చేయాలని అనుకున్నా, అప్పు కావాలని అంటే ప్రభుత్వం రైతుకు కావలసిన అప్పు యివ్వరు. ప్రభుత్వం యివ్వకపోతే, రైతు యొక్క అవసరాన్నిబట్టి, ఏ మార్వాడీ దగ్గరకో పరుగెత్తవలసి వుంటుంది. అక్కడికి పోతే, ఆ మార్వాడీ రైతు అవసరము గ్రహించి హెచ్చు వడ్డీకి తప్ప యివ్వడు. అదికూడా సంవత్సరానికి నూటికి ఏ తొమ్మిది రూపాయలో, రూపాయిలో వడ్డీ అయితే పరవా లేదు. అవిధంగా తేలిక వడ్డీకి మార్వాడి వడ్డీ వ్యాపారము చేయడు కాబట్టి హెచ్చు వడ్డీ అడుగుతాడు. అవిధంగా కాకుండా ప్రభుత్వమువద్దనే తక్కువ వడ్డీకి రైతుకు కావలసిన అప్పు దొరికేటట్లయితే, ఒక్కొక్క ఎకరానికి ఖర్చుచేయవలసిన యీ 250 రూపాయలు ఇరవై సంవత్సరాలలో తీర్చుకునేటట్లుగా ప్రభుత్వము వీలు కలుగ జేయాలి. ఇదిగాక 15 రూపాయల శిస్తు సంవత్సరానికి ఒక్కొక్క ఎకరానికి ప్రభుత్వానికి యిచ్చుకోవలసి వస్తుంది. అందుచేత ఒక్కొక్క ఎకరానికి Betterment Levy రూపములో కానివ్వండి, నీటి తీరువద్వారా కానివ్వండి, యింకా భూమి బాగుచేయటానికి తీసుకున్న అప్పుకు చెల్లించవలసిన వాయిదా సొమ్ము కానివ్వండి, అంతా చేరి ఎకరానికి 55 రూపాయలు కట్టవలసివుంటుంది. ఇది అంతా చేస్తే ఒక్కొక్క ఎకరములో ఎంత Income రాబట్టుతాడో లెక్క చూడండి. భూమిలో చక్కగా ఎరువులు వేసి ఇరవై బస్తాలు పండిస్తాడు అనుకోండి ఈ రోజులలో ఒక్కొక్క ఎకరములో వచ్చేపంటకు లెక్కకట్టి చూడండి. వసూలు రోజులలో బస్తా ఒకటింటికి 15-0-0 రూపాయల కంటె మించి ఖరీదు ఎప్పుడుగూడ

లేదు. ఇంకను ఒక్కొక్కప్పుడు 12,13 రూపాయలే వుంటుంది. ఒక వేళ 15 రూపాయల చొప్పున లెక్కవేసి చూచినను, ఒక ఎకరములోని పంట ఖరీదు 308 రూపాయలకంటె ఎక్కువ వుండదు. అంతకన్న ఎక్కువ ఆదాయము తీయటానికి సాధ్యము కాదు. ఈమూడు వందలలోనూ, రైతు తన స్వంత మనుష్యులతో కూలివాడు చేసేపని చేసినప్పటికిని, యిందులో మూడవవంతు వ్యవసాయపు ఖర్చులు తీసివేస్తే, యిక అతనికి మిగిలేది ఏ రెండు వందల రూపాయలలో వుంటుంది. ఇక పోతే నికరాదాయము ఎంత వుంటుంది అన్నది లెక్కచేస్తే, రైతు స్వంతముగా పని చేసి కూలి ఖర్చుకూడ మినహాయిస్తే, చివరకు మిగిలేది రెండువందలే. ఈ అంచనాగూడా బస్తా ఖరీదు వీలు అయినంత ఎక్కువ వున్నప్పటిది, ఒక్కొక్క భూమిలో యీ ఇరవై బస్తాలుకూడా పండవు. మంచిసారవంతమైన భూమి విషయము చెబుతున్నాను. ఇరవై బస్తాలకంటె తక్కువ పండే భూములలో యింకా తక్కువ ఆదాయమే వస్తుంది. ఇరవై బస్తాలు ఒక ఎకరములో పండించడమనేది సామాన్య విషయముకాదు. ఈ సంగతి అందరూ అంగీకరిస్తారని అనుకుంటాను. అయినప్పటికినీ బాగా కష్టించి, తక్కువగా వ్యవసాయపు ఖర్చులు పెట్టుకుని పంట పండేది తక్కువయితే, తనకు మిగిలేదానిలో యీ Betterment Levy, నీటి తీరువ, వాయిదాలలో చెల్లించవలసిన అప్పు, యివన్నీ పోను ఆ రైతుకు తన కుటుంబ ఖర్చుకు ఏమి మిగులుతుందో ఆలోచించాలి. అటువంటి పేద రైతుకు యింత శిస్తు చెల్లించే దుర్గతి పట్టిస్తే అతను చెల్లించగలడో లేదో, సభ్యులను గ్రహించవలసిందిగా కోరుతున్నాను. ఎకరములో పండే పంటమీద మాత్రము ఏ రెండు వందలో, బాగా పండకపోతే, అంతకు తక్కువో మిగిలితే, అందులోనుంచి సుమారు యాభైయో, లేక యాభైఅయిదో లేదా అంతేపైగానో ప్రభుత్వానికి శిస్తుల రూపములో చెల్లించుకోవాల్సి వుంటుంది. ఈ ఖర్చులు అన్నిపోతే, ఆరైతుకు చివరకు మిగిలేది కనీసము ఏ నూటనలభై రూపాయలలో అవుతుంది ఇంత స్వల్ప ఆదాయము వస్తుంది గనుకనే, పది ఎకరాలు అంతకు తక్కువ భూమి వున్న రైతును మినహాయించాలని అంటున్నాను. సంవత్సరానికి పది ఎకరాలు వున్న రైతుకు సగటున నికరాదాయము 1400 రూపాయలకంటే లేకపోతే, సామాన్య కుటుంబము గల రైతుకు మిగిలేది ఏమీ వుండదు పైగా, ఇంటి ఖర్చులు అటువుంచి, వ్యవసాయ పరికరాలకు, ఖర్చు వుంటుంది. ప్రతి సంవత్సరము భూమి మరమ్మతులు, సేద్యము చేసేవాళ్లు, ఎద్దులు కొనడము, యివన్నీ యీ 1400 లలోనే ఖర్చు చేసుకోవాలి. అందువల్ల ఆరైతు ఎక్కువ కష్టము మీదనే కుటుంబపోషణ జరుపుకుంటాడు. అటువంటి రైతుమీద Betterment Levy అని, నీటి తీరువ పన్నులు అని యిటువంటి భారమైన పన్నులు వేయడము అన్యాయము అంటాను. ప్రభుత్వముయొక్క దృష్టిలో

యీ రైతుకు పది ఎకరాలు వున్నవి, ఏదో బాగానే పండిస్తున్నాడు, బాగుపడిపోతున్నాడు అనేది పెట్టుకుని యీ Betterment Levy అనే సాగుతో యింకొక 30 రూపాయలు, నలభై రూపాయలు, యీ మాదిరిగా యివ్వమని కోరడము న్యాయముకాదు. అందువల్ల, ఎక్కువ భూమిగలవారి మీద వేస్తే, ఎక్కువ ఆదాయము వస్తుంది కాబట్టి, అటువంటివారు యీ పన్ను ఎంత అయినను యివ్వగలరు. ఎక్కువ పంటమీద, వ్యవసాయపు ఖర్చులు proportionateగా తగ్గుతవి గనుక అటువంటివారికి ఎంత పన్ను అయినను యివ్వగల స్తోమతు వుంటుంది. అందువల్ల యిటువంటి చిన్న రైతులకు మిగలదు కాబట్టి వారిమీద వేయకుండా మినహాయించమంటాను. 15 రూపాయలకంటె ధర పెరిగితే, పన్ను యిచ్చుకునే తాహతు వుంటుందేమో గాని, యీ ధర వున్నంతవరకు మినహాయించమనే అంటాను. కాని యిప్పుడు పన్ను యివ్వమని అడగడములో అర్థము ఏమి వుంటుందంటే, యిప్పుడు ధరలు లేక పోతే, ధరలు పెరిగినప్పుడు భూమి అమ్ముకుని అయినా ఆ అప్పు తీర్చమన్నట్లుగా వున్నది. ప్రభుత్వంయొక్క సిద్ధాంతము పరిశీలించి చూస్తే " మేము నీకు నీరు యిచ్చాము, ప్రాజెక్టు కట్టాము, యిప్పుడు భూమికి ధర పెరిగింది, అందువల్ల పన్ను యివ్వలేక పోతే, నీకు వున్న భూమిని అమ్ముకుని అయినా మా సగము మాకు చెల్లించు" అనే సిద్ధాంతముగా కనబడుతున్నది. భూమి అమ్ముకోమని అంటే, ఎక్కువభూమి వున్న వారిని అమ్ముకోమనండి. తిండికి చాలి. చాలకుండా వుండే చిన్న రైతుల మీద యిటువంటి సిద్ధాంతము ప్రయోగిస్తే, యిక ఆ రైతు కుటుంబముతో సహా యిల్లు వాకిలి అమ్ముకుని దేశాలపాలు అయిపొమ్మని చెప్పటమే కదా ? ఇది ఎక్కడి సిద్ధాంతమో నాకు అర్థము కావడము లేదు. అందువల్ల ఎక్కువభూమి వుండేవారిని భూమిని అమ్ముకోమని చెప్పండి. మాకేమి అభ్యంతరము లేదు. ప్రభుత్వం చెప్పమనండి మేము కూడా చెబుతాము. అందులో ఎక్కువభాగము ప్రభుత్వము తీసుకోమనండి. మాకు అభ్యంతరము లేదు. పదిఎకరాలకంటే భూమికంటె రైతుకు తక్కువ వుంటే, అతని కుటుంబానికి చాలనే చాలదు. కాబట్టి అటువంటి వారిని మినహాయించాలని అంటాను. దీనికి ప్రభుత్వము అంగీకరించకపోతే, ప్రభుత్వము యీ విషయములో అనుసరిస్తున్న సిద్ధాంతము సరియైనది కాదు. ప్రభుత్వము వారు చెప్పేదంతా చూస్తే ఎట్లా వుందంటే, ఏదో పేదలకోసమే యిదంతా చేస్తున్నామని, పేదలకోసమే కష్టపడుతున్నామని కన్నీరు కార్చేవారి మాదిరిగా ప్రభుత్వ పక్షము వారు మాట్లాడుతున్నారు. ప్రభుత్వము చేసేది చూస్తే, ఏదో పేదల మీద అభిమానము వున్నట్టు నటించి, పేదలను ఏడ్పించి పన్నులు వసూలు చేయటానికి, పేదవాళ్ల మీద పెత్తనం చేయటానికి గాను కనబడుతున్నది. ప్రభుత్వము వారికి యీ పన్నుల విషయములో ముందుగా కన్నా యీ పేదవాళ్ల మీద కాకుండా

పెద్ద పెద్ద భాగ్యవంతులమీద, భూస్వాములమీద, జమీందార్లమీద ఎందుకు పడదో నాకు తోచడములేదు. కాబట్టి ప్రభుత్వము యీ విధంగా చేయడము న్యాయముకాదు. నేను చెప్పినదానికి మించిన ఆదాయము ఎకరానికి వచ్చేటట్లయితే, ఎకరము ఒకటింటికి ప్రభుత్వం వేసేపన్నులు సుమారు యీభైరూపాయలకు పైగా చెల్లించుకోవలసివస్తుంది. కాబట్టి నేను చెప్పినదానికన్న ఎక్కువ ఆదాయము వస్తుందా, లేదా? ఎకరానికి 50 రూపాయలు చెల్లించవలెనా లేనా, అనేది యీ రెండు విషయాలు ప్రభుత్వము అంగీకరించినప్పుడు, ప్రభుత్వము యీ పది ఎకరాలకువారిని మినహాయించకపోతే, ప్రభుత్వము యీ పన్ను వేయడములో అర్థము యేమీలేదు. పేదలకు సహాయము చేస్తున్నామని ప్రభుత్వం ఎంతచెప్పినప్పటికినీ, ప్రజలు నమ్మరు.

పైగా సెలెక్టుకమిటీలో యీ బిల్లును గురించి చర్చించేటప్పుడు నేను యింకా కొంతదూరము వెళ్లి చెప్పాను? పది ఎకరాలవారిని మినహాయించటానికి వీలుకాకపోతే కనీసము అయిదు ఎకరాలవారినైనా మినహాయించండి అని నేను కోరాను. అందుకుగూడా మేము సమ్మతించము. ఆఖరుకు రైతుకు ఏ ఒక్క ఎకరము వున్నప్పటికీగూడా పన్నుయిచ్చి తీరవలసిందే. ఎవరినీగూడ మినాహాయించటానికి వీలులేదని అన్నారు. ఆఖరుకు అర ఎకరమువున్నాగూడా యివ్వవలసిందేనని పట్టుపట్టారు. కాబట్టి ప్రభుత్వం యీ పన్నువిషయములో యింత పట్టుదల చూపిస్తే యిక యీ బిల్లు పేదలకు సహాయపడేదేనా అని నేను సహృదయముతో అడుగుతున్నాను.

ఇకపోతే మరొకవిషయమువున్నది. నేను మరొక సవరణకూడా పెట్టాను. అది లక్షరూపాయల విషయము. నాయొక్క మొదటి సవరణ ప్రభుత్వము అంగీకరించినట్లయితే, నేను తెచ్చిన రెండవ సవరణకోసము పట్టుపట్టను, వుపసంహరించుకుంటానని అన్నాను, నా మొదటి సవరణ అంగీకరించకపోతే, యీ పన్ను సాధ్యమైనంతవరకూ తక్కువమంది పేదవారిమీద పడేటట్టుగా చూడండని కోరాను. అందుచేత ఒకలక్షరూపాయలు విలువచేసే ప్రాజెక్టుక్రింద భూములువున్న వారిమీద గూడ వేయుమని అంటున్నారు. దానికి ఒకలక్షకాదు, అయిదు లక్షలరూపాయలు విలువచేసే ప్రాజెక్టుక్రింద భూములున్నవారిమీద నే పన్నువిధించకుండా మినహాయించమని సవరణతెచ్చాను. అంటె యీ ప్రాజెక్టుక్రింద భాగ్యవంతులు గూడ కొంతమందివుంటే వుండవచ్చు. అక్కడవున్న పేదవారితోబాటు వాళ్లు కూడ తప్పించుకుంటే, పోనివ్వండి. కాబట్టి అటువంటిభూమిమీద పన్నువేయకుండా మినహాయించమని కోరాను. ఏ ప్రాజెక్టుకుఅయినా అయిదులక్షలు ఖర్చు

పెట్టినట్లైయితే, దానిక్రింద భూములు ఎంత బాగావున్నప్పటికిని, వాటిమీద పన్ను వేయవద్దు. అక్కడ కొంతమందిని భాగ్యవంతులువుంటె, వారు తప్పించుకుంటే గూడ అందు మనముచేసేది యేమిలేదు. కాబట్టి ప్రభుత్వము యిటువంటి మినహాయింపుచేసే విషయములో సాధ్యమైనంతవరకు మినహాయింపు యివ్వటానికి లక్ష రూపాయల ప్రాజెక్టుకు బదులు అయిదులక్షలరూపాయల ప్రాజెక్టుఅని సవరణ తెస్తూ, యీ సవరణ అంగీకరించమని కోరుతున్నాను.

ఈ 5 లక్షలు రూపాయలుఅనేది, ప్రభుత్వం మాకుయిచ్చిన లెక్కలప్రకారం చెబుతున్నాను. ఇంతవరకు 1947 నుంచి నిర్మిస్తున్నటువంటి ప్రాజెక్టులు, పూర్తి చేసినటువంటి ప్రాజెక్టులు list ఒకటి మాకుయిచ్చినారు. అందులో లక్షరూపాయలకుమించి, 5 లక్షలు లోపువున్న ప్రాజెక్టులు 67 ఉన్నాయి. అదేరీతిగా అచ్చువేసిన యింకొక పుస్తకము మాకు సప్లయిచేశారు. అందులో మెట్టతాలూకాల్లో చిన్నచిన్న మైనరు ఇరిగేషను ప్రాజెక్టులు మాత్రమే తీసుకొంటున్నాము. గోదావరి కృష్ణాలలోకూడా మెట్టతాలూకాలు చాలావున్నాయి. మెట్టతాలూకాల్లో చిన్నచిన్న ప్రాజెక్టులు 123 కట్టబోతున్నాము. ఆలోచనలో ఉన్నదని చెప్పినారు. వాటిని లక్షరూపాయలలోపు ప్రాజెక్టులుగా మినహాయించినా, యింకా లక్షా, 5 లక్షల మధ్యనవున్న ప్రాజెక్టులు 80 ప్రాజెక్టులు ఉన్నాయన్నమాట. ఈ 80 ప్రాజెక్టులలోనుంచి మెట్టప్రాంతములో ఎకరానికి 300, 400 రూపాయలు ఖర్చుపెడితేగాని సరిపోయేనీరు భూములలోకిపారదు. ఇటువంటి చిన్నచిన్న ప్రాజెక్టులు ఇంకా ఆదాయము, నీటివసతి లేనిచోట్ల ఈ కట్టుతున్నప్పుడు వాటిమీదకూడా మీరు Betterment Levy వేయడముఅనేది సత్యముకాదు అనిచెప్పి 5 లక్షల రూపాయలు వాటికికూడా మినహాయించాలి. ఈ ఉదయము పిల్లలమర్రి వెంకటేశ్వర్లు మాట్లాడుతూ ఇప్పుడు కడుతున్నటువంటి 60 ప్రాజెక్టులు, ఈ 50 లక్షల రూపాయలలోపువున్న ప్రాజెక్టులను మినహాయించితే దీనిఖర్చుఅంతా ఒకకోటి, 20 లక్షల రూపాయలకన్నా ఎక్కువకాదు. 60 వేల ఎకరాలు బాగుపడే ప్రాంతము మీద ఒకకోటి 20 లక్షలు రూపాయలు ఖర్చుపెడుతున్నారు. ఈ కోటి 20 లక్షలు రూపాయలు యింకొకరకంగా పన్ను వేయవచ్చును. ఇంకోరీతిగా దానిని ఖర్చుపెట్టవచ్చును. వాటిమీదకూడా మీరు Betterment Levy వేయడము ఏమాత్రము న్యాయముకాదు. కనీసం 5 లక్షల రూపాయలు విలువచేసే ప్రాజెక్టుమీదఅయినా మినహాయించాలని చెబుతున్నాము. దాదాపు అదే దామాషాలోమిగిలిన 80 ప్రాజెక్టులుకూడా, మైనరు ఇరిగేషను ప్రాజెక్టులుకూడా, ఉంటాయి. అందుచేత ప్రభుత్వంవారు మొదటచెప్పినరీతిగా 10 రూపాయలలోపల భూమిశిస్తు ఉన్నవారి

Sri P. Sundarayya] [3rd December 1955

మీద పన్ను పడకుండా మినహాయిస్తే చాలా సంతోషము. దానిని అంగీకరిస్తే కొంత వరకు మేలుఅయినాచేసి దానిని మెట్టప్రాంతాలలో చిన్నచిన్న ప్రాజెక్టుల్లో 5 లక్షలు ఖర్చుఅయ్యే మైనరు ప్రాజెక్టులక్రింద యీ betterment levy లేకుండా పోతుంది. మామూలుగా ఏ ప్రభుత్వంఅయినా ఇది చెయ్యాల్సినపనులే. పెద్ద పెద్ద ప్రాజెక్టులకు డబ్బు లేకపోవచ్చును. అప్పులు తీసుకురావడం కష్టము కావచ్చును. చిన్నచిన్న ప్రాజెక్టులకు అవసరములేదు. అందువల్ల ఆ సవరణను అంగీకరించాలని చెప్పి మంత్రిగారిని మరొకపర్యాయము కోరుతున్నాను.

ఈ ప్రాజెక్టు పూర్తిఅయిన 3 యేండ్ల తరువాతనుంచి యీ betterment levy చెల్లించాలనిచెప్పి యీ బిల్లులోఉన్నది. మేము 5 యేండ్లుఅని కోరుతున్నాము. శ్రీ ఎల్లమందారెడ్డిగారు పెట్టిన సవరణలో ప్రాజెక్టు పూర్తికావడము అంటె పెద్దకాలువ పూర్తిఅయితే ప్రాజెక్టు పూర్తిఅయిందనిచెప్పి మీరు ఆర్డరువేసే దానికి అవకాశము ఉన్నది. ఎవరో వేయరని చెబుతున్నారు. అట్లాఅయితే చాలా సంతోషం. వేయరని చెప్పినప్పుడు ఆ సవరణనుకూడా అంగీకరిస్తే పోతుందిగదా ? నీరు భూమిలోకి పోయేదాకా కావలసిన సమస్యాయాలుఅన్ని పూర్తిచేసిన తరువాత, వేస్తే బాగుంటుందని ఆ సవరణలో ఉన్నది. అంటే భూమిలోకి నీరు ప్రవహించే దానికి కావలసిన చిన్న పిల్లకాలువలు, బోదులతోసహా చేసినప్పుడు అది పూర్తిఅయినట్లు ప్రకటించాలిగాని, పెద్దకాలువలు త్రవ్వగానే సరిపోయిందనడము సరికాదు. అంతేకాక యిందులో యింకొకసమస్య ఉన్నది. కాలువలు అన్నీ త్రవ్వారు. బోదికాలువలు త్రవ్వారు. పంటకాలువలుకూడా త్రవ్వారు. కాని నీరుకదిలితే కాలువలు తెగిపోతున్నాయి. కాలువలు పూర్తిఅయినవని మీరు గజెట్‌లో ప్రకటించారు. బోదికాలువలుకూడా తెగిపోతున్నాయి. మరల వాటిని మరమ్మతులు చేసేదానికి ఇంకొక సంవత్సరము పడుతుంది. అందుచేత మీ గజెటు ప్రకటనలో మాత్రము ప్రాజెక్టు పూర్తిఅయినట్లు లెక్క. అందుచేత ఆ సవరణను, పూర్తికావడము అంటే భూములకు నీరు ప్రవహించేదానికి కావలసినవన్ని తతంగాలుఅయి, ప్రవహించడము మొదలు పెట్టినట్లయితే అది పూర్తిఅయినట్లు లెక్క. రేపు నెహ్రూగారువస్తుంటే కంట్రాక్టర్లు ఆ ఇళ్ళను త్వరత్వరగా పూర్తిచేస్తున్నారు. అది పూర్తిఅయిందనుకోవడము పొరపాటు. నెహ్రూగారికి చూపించేదాని కోసము పూర్తిఅయింది. కాని దాంట్లోప్రవేశించి నివశించేదానికోసము ఇంకో 2, 3 నెలలు పడుతుంది. వానలుకురిస్తే కురవడము మొదలుపెడితే మళ్లీ రిపేర్లుచేయాలి. ఇవన్నీ చాలాసమస్యలు ఉంటాయి. అట్లాగే మీరు తొందరతొందరగా బోదెలుత్రవ్వి మేము కాలువలు పూర్తిచేశాము పన్నుయివ్వాలని అంటె అది న్యాయముకాదు.

అట్లాయిచ్చిన తరువాతకూడా 3 ఏడ్లకు betterment levy యిచ్చేదానికి కాలము చాలదు. 5 యేండ్లుఅయినా యివ్వాలని మేముకోరుతున్నాము. మెట్టభూమిని మరల మాగాణిగా చేసేదానికోసము కొంతడబ్బు అప్పుతెచ్చి ఖర్చుపెట్టాల్సి వస్తుంది. అది అయినతరువాత నీరుపెట్టగానే వెంటనే పంటలు పండుతాయి అనుకొనేదానికి వీలులేదు. దానికి కొంతకాలము పడుతుంది. కొత్తగా సేద్యముచేసేదానికి ఆరంభించేప్పుడు ఆభూమి ఎంత సారవంతముఅయినా, నీరు ఎంతయిచ్చినా, వెంట వెంటనే పంట సక్రమంగా ఇచ్చేదానికి వీలులేదు. అందువల్ల అయిదుయేళ్లుఅయినా పన్నువేయకుండా వారికి వ్యవధియిస్తే, మొదట 1, 2 సంవత్సరములు కొంతపంట తగ్గినా, తరువాత పంటలు పండిన మార్వాడీ వ్యాపారస్థుల దగ్గరనుంచిగాని, కోమటివ్యాపారస్థుల దగ్గరనుంచిగాని, తెచ్చినవడ్డీలు చెల్లించుకుంటూ కొంతస్థిమితముగా, కాలు ఊనుకొన్నతరువాత ప్రభుత్వానికి Betterment Levy ఇచ్చుకొనే దానికి పూనుకుంటారు. అందుచేత 3 యేళ్ళుగాక, 5 యేండ్లు యివ్వమని కోరుతున్నాము. ఇందులో Betterment Levy ఎగవేయమని అర్థముకాదు. ఒక్క ఆవుని పాలుపిండటం మొదలు పెట్టినట్లయితే దానిమూడ చస్తుంది. అట్లాగే రైతులను కొంత బలవన్నియండి. తరువాత Betterment levy వసూలుచేస్తే అర్థము ఉంటుంది.

రత్నసభాపతి శెట్టిగారు యిచ్చిన సవరణనుకూడా నేను బలపరుస్తున్నాను. 47 వరకు అని మీరు ఏ సిద్ధాంతముప్రకారం చెప్పారు. 1947 తరువాత పూర్తి అయిన ప్రాజెక్టులుఅని అందుకు అనాలి, 1847 అని ఎందుకు అనకూడదు. మీకు డబ్బు కావలసివస్తుంది కాబట్టి 1947 నుంచి పూర్తిచేసిన వాటిఅన్నింటిమీద పన్ను వేస్తున్నాము అంటే అట్లాలేకుండా 1847 నుంచిఅనివుంటే అందులో అందంచందం వున్నది. ఎందుకుఅంటే 1847 లోపల అసలు ప్రాజెక్టులు ఉన్నాయో లేవో ఎవరికీతెలియదు. వాటిమీద కట్టినా కట్టకపోయినా యీరోజుమొత్తాన లాభదాయకంగా ఉన్నటువంటి వాటిఅన్నింటికి మీరు Betterment Levy అని ఎకరానికి 15, 20 రూపాయలు వేసిఉంటే, డబ్బు ఎక్కువవస్తుంది అనిచెప్పి 1947 అని చట్టంలో పెట్టవచ్చునుగదా ? అందుకోసం ఆయన 1947 అనిచెప్పే బదులు ఆసవరణయిచ్చారు. ఇంక కొంతమందికి ఈ పన్నుభారం పడకుండా పోతుందిఅని చెప్పారు. యీ సమస్యమీద మాసవరణలు పడకుండా ఉన్నాయంటే అసలు ప్రధాన సవరణలు అంగీకరించినప్పుడు 10 ఎకరాల వాళ్లమీదపన్ను మినహాయించక పోయినా, యీ సవరణల అన్నింటికినికూడా సాధ్యమైనంత తక్కువమందిమీద పడేట్లుగాచేస్తే మీ సవరణలకు విలువఉంటుంది. మా మొదటిసవరణ 10 ఎకరాల లోపల మినహాయించితే, మిగిలిన సవరణలు అన్నీ అంగీకరించకపోయిన బాధ

ఉండకు, బీదలమీద పడకు కొబట్టి. మిగిలినవాళ్ళమీద ఎప్పుడుపడినా ఎంత ఎంతత్వరగా వసూలుచేసుకున్నా ఎంత వసూలుచేసుకొన్నా మాకేమి దానినిగురించి బాధలేదు. వాళ్ళలోవాళ్ళే కుస్తీపడాల్సి వస్తుందికాని మాకేమీ బాధలేదు. తక్కువమందిమీద పడేదానికి మేము ప్రతిపాదించాల్సి వచ్చింది. ప్రభుత్వము మొదటిసవరణను అంగీకరించి యీ సమస్యను యింతటితో పరిష్కారముచేస్తే చాల సంతోషము. లేకపోతే తక్కువమందిమీద పడకుండా ఉండేదానికి మిగిలిన అన్ని సవరణలు ఒకదానితరువాత ఒకటి అంగీకరించిన కొంతకుకొంత గుడ్డిలో మెల్లగా ఉంటుంది. మేము సంతోషించేసమస్య కాదనుకోండి. రైతాంగముఅయినా సంతోషిస్తుంది అనిచెప్పి ఇంతటితో విరమిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా, సుందరయ్యగారు చాలా వివరంగా చెప్పారు. మంత్రిగారు మంత్రిగా కూర్చోకుండా ఉంటే అంగీకరించి ఉండేవారు. నేను 5 years సవరణ ప్రతిపాదించాను. Bill draft చేసినప్పుడు department కాని మంత్రివర్గం కాని Taxation Enquiry Committee Report మీద ఆధారపడి చేసామని చెబుతూ వచ్చారు. ఆ రిపోర్టుమీద ఆధారపడి తయారు చెయ్యలేదని ఆ రిపోర్టునుంచి ఎత్తి చూపిస్తే అంగీకరిస్తారని అనుకుంటున్నాను. 257 పేజీలో ఈవిధంగా ఉన్నది :—

"However before assessments are made it is usual to allow a development Period averaging 5 years or so after the commencement of supply of water to unable the cultivators to improve their lands and realise the full benefits of irrigation."

ఏ విధమైన మినహాయింపులు లేకుండా 5 సంవత్సరాలు కాని అంతకుపైన మాత్రము కాని చేయ్యాలని ఉన్నది, అందుచేత మూడు సంవత్సరాల limit పెట్టడం ఏ justifiable గా లేదు. ఈ point చెప్పడానికే నేను నిలబడింది.

SRI G. YELLAMANDA REDDI:—ఈ amendment విషయం మొన్న బిల్లులో కూడా చెప్పాను. మంత్రిగారు serious గా తీసుకోలే అన్న మాట, Taxation Enquiry Committee వారు కూడా అన్నారు. ఇప్పుడు నందికొండ ప్రాజెక్టు completion notify చేసినా tail end కు నీళ్లు వెళ్ళేసరికి 10 సంవత్సరాలు పడుతుంది, Commencement of water to the land అని ఉంటే బాగుంటుంది పే విషయం ఆలోచించాలని కోరుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—ప్రస్తుతం సభవారి ఎదుట సుందరయ్యగారు మూడు సవరణలను గురించి మాట్లాడారు. మాట్లాడే ముందు ఒక విషయం గురించి వారు చెప్పారు. ఎలమంచారెడ్డిగారుకూడా పోయిన దఫా చెప్పారు, దానికి అప్పుడే సమాధానం చెప్పాను మళ్ళీ చెప్పనలసింది అన్నారు మళ్ళీ repeat చేస్తున్నాను అనుకోవద్దు. కాలువలు పూర్తి కాకుండా చేలులోనికి నీళ్లు రాకుండా నీటి తీరువ వేస్తాము అని చెప్పలేదు. నీళ్లు ఇవ్వకుండా నీటి తీరువ వేయము అని వారికి చెప్పాను. ఒక పెద్ద ప్రాజెక్టు తీసుకున్నప్పుడు. కొంతభాగం పూర్తి అయినప్పుడు ఆ భాగంనుంచి కొంత acreage కి నీళ్లు ఇవ్వడానికి అవకాశం ఉంటే ఆ భాగానికి నీళ్లు ఇచ్చి అక్కడ పన్ను వేస్తాము. ప్రాజెక్టుకు అంతే, పూర్తి అయిన తరువాత అప్పుడే పన్ను వేయాలి అంటే అది సరిఅయిన విధానం కాదు, వాళ్లకు benefit చేరకుండా పన్ను వేస్తున్నారు అంటే అది సరిఅయిన వాదన, ప్రాజెక్టు incomplete అయినా benefit అయిన areas వుంటే వాటి మీద పన్ను వేస్తాము. ఇంక తేదీ విషయం, 1947 ఎందుకు తీసుకోవాలి ; మరొక తేదీ ఎందుకు తీసుకోకూడదని, దీనికి ఒక పద్ధతి ఉన్నది. స్వరాజ్యం రాకపూర్వం బ్రిటిషు ప్రభుత్వం వెనుకబడిన areas గురించి ఏమి ఖర్చుచేయలేదు, అవి స్వరాజ్యం వచ్చిన తరువాత ఏర్పడిన ప్రభుత్వాలు ఎక్కువ ధనం ఖర్చుపెట్టి తొందరగా పని చేశారు కాబట్టి 1947 సంవత్సరంలో స్వరాజ్యం declare చేశారు. కాబట్టి ఆ date నుంచి ఎక్కువ ఖర్చు చేసారు. కాబట్టి ఆ date ను నిర్ణయించాము. ఒక ఎకరం వారిమీద ఎందుకు వేయాలి 10 ఎకరాలవరకు ఎందుకు తగ్గించ కూడదు అన్నారు. మరొక విషయం మనవిచేస్తున్నాను. తుంగభద్ర ప్రాజెక్టు నాగార్జున సాగర్ ప్రాజెక్టు కట్టగానే మెట్ట ప్రాంతాలన్నీ సాగులోనికి వస్తాయని అనుకోవడం పొరపాటు. అప్పటికే వెనుకబడిన ప్రాంతాలు ఉంటాయి. ఏ ప్రాజెక్టు క్రింద రానివారు ఉంటారు వారి విషయం ఏమిటి ? అభివృద్ధి అయినవారు ఏమైనా పన్నుల రూపంలో ఇస్తేనా తక్కువ వెనుకబడిన వారికి ఏమైనా చేయడం. ఒక ఎకరం వారికి తగ్గించాలి, నాలుగు ఎకరాలవారికి తగ్గించాలి అంటే వారికన్న వెనుక ఉన్నవారికి ఏ అభివృద్ధి పనులు చేయడానికి లేదు. ఈ డబ్బు వారికన్న వెనుక బడ్డ వారికి ఉపయోగించబడుతుందని స్పష్టంగా చెప్పాను. ప్రభుత్వంవారు 25 వేల రూపాయిలు ఖరీదయే వాటిని తగ్గించాలని బిల్లు తీసుకువచ్చారు. సెలక్టు కమిటీ వారు లక్ష రూపాయిలవరకు పెంచారు, 25 వేలకు పెట్టడంలో మొదట ఉద్దేశం ఎట్లా ఉన్న వ్యక్తిగతంగా లక్షవరకు పోవడం నాకు ఇష్టం ఉన్నా లేకపోయినా అందులో ఒక కారణంకూడా ఉన్నది. అందులో కొంత తగ్గించి పెట్టేట్లయితే ఆ డబ్బుతో ఇంకా వెనుకబడి ఉన్నవారికి చిన్న మరమ్మతులు చేయటానికి వీలు

ఉంటుంది. ఒక చెరువును మరమ్మతు చేయాలనుకోండి, జమీందారులు ఉన్నప్పుడు estate neglect చేశారు. ఇప్పుడైనా ఆ మరమ్మతులు తొందరగా చేయాలా లేదా? చిత్తూరు జిల్లా వారున్నారు, వారికి ఏ ప్రాజెక్టులు లేవు. బావులమీద, చెరువుల మీద సాగుచేసుకోవాలి, లేకపోతే వీలులేదు, నాగార్జున సాగరం కట్టినా చిత్తూరు జిల్లా వారు వెనుకబడే ఉంటారు, దానిని అభివృద్ధి అంటున్నాము. ఈ అభివృద్ధి చెందినవారు ఏదో రూపంగా ఇవ్వనిదే ఇటువంటివోట్ల ఖర్చు చేయడానికి లేదు. లక్షల రూపాయిలు అనుకున్నప్పుడు సామాన్యంగా ధరలు పెరిగి ఉన్నవి కదా; కట్టడానికి ఖరీదులు ఎక్కువ అవుతున్నాయి, చిన్న పనికికూడా వారు అను కున్నట్లు 25 వేలు కాక 50 వేలు లక్షకూడా అవుతోంది. లక్ష రూపాయిలకు ఏమైనా చేయడానికి అవకాశం ఉంటుందనే దృష్టితో సెలక్టు కమిటీవారు ఒప్పు కున్నారు. అయిదు లక్షల రూపాయిలవంకు పెట్టాలని అన్నారంటే చెరువులకు బావులకు చిన్న చిన్న మరమ్మతులు చేయడానికికూడా లాహాతు ఈ ప్రభుత్వానికి కొన్ని సంవత్సరాలవరకు ఉండడానికి అవకాశంలేదు, వెనుకబడినవారు వెనుకబడి పోతారు? ఏ కొద్దిమందో ముందుకు పోతారు. ప్రభుత్వపాలసీ అదికాదు, సాధ్యమైనంతవకు అందరిని proportionate గా కాకపోయినా కొంతవరకైనా ముందుకు తీసుకుపోవాలనే ఉద్దేశంతోనే తక్కువ limits పెట్టాము, వారు తీసుకు వచ్చిన ఈ సవరణలలో ఒకటికూడా ప్రభుత్వం తరఫున ఆమోదించడానికి నాకు సమంజసంగా కనపడడంలేదు. సహేతుకంగాకూడా కనిపించడంలేదు. అవకాశం లేదు, కాబట్టి ఈ సవరణలలో దేనిని ప్రభుత్వం ఆమోదించటానికి వీలులేదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇండియాకు స్వరాజ్య వచ్చునంతవరకు లాభంలేనట్లే ఆంధ్రరాష్ట్రం వచ్చినంతవరకు ఆంధ్రులకు లాభం కలుగలేదు. కాబట్టి అక్టోబరు 1 తరువాత తీసుకొనడానికి అంగీకరిస్తారా?

MR. SPEAKER :—That is a matter of opinion.

THE HON. SRI K. CHANDRAMOULI :—స్వరాజ్యం ఆంధ్ర రాష్ట్రం అంత సంకుచితమైనదికాదు రేపుప్రొద్దున విశాలాంధ్ర వచ్చేవరకు అంటారు వావిలాల గోపాలకృష్ణయ్యగారు.

MR. SPEAKER : The question is :

"In Clause 3 line 3, after the words 'from the owner of any land', add the words 'exceeding 10 acres'."

The amendment was declared lost.

A poll was demanded and the House divided thus

*Ayes*

1. Sri P. Sundarayya
2. Sri Pillalamarri Venkateswarlu
3. Sri B. Ratnasabhapathy Setty
4. Sri G. Yellamanda Reddi
5. Sri B. Sankarayya
6. Sri G. Nageswara Rao
7. Sri V. Visweswara Rao
8. Sri P. Satyanarayana
9. Sri G. Bussanna
10. Sri S. Kasi Reddi
11. Sri S. Seetharamayya
12. Sri Mahammad Tahseel
13. Sri G. Ramunaidu
14. Sri B. Adinarayana
15. Sri D. Sreerama Murthi
16. Sri M. Satyanarayana Raju
17. Sri C. V. Somayajulu
18. Sri Vavilala Gopalakrishnayya

*Noes*

1. Hon. Sri K. Chandramouli
2. Hon. Sri D. Sanjivayya
3. Hon. Sri A. B. Nageswara Rao
4. Sri Vijaya Bhaskara Reddi
5. Srimathi Ammanna Raja
6. Sri P. Bapayya
7. Sri Marupilla Chitti alias Appalaswamy
8. Sri V. Gopalakrishna
9. Sri T. Gopalakrishnayya Gupta
10. Sri K. Koti Reddi

11. Sri P. Thimma Reddi
12. Sri Gopalu Reddi
13. Sri N. Govindarajulu
14. Sri P. Gunnayya
15. Sri Gadiraju Jagannadharaju
16. Sri T. Jiyyardas
17. Sri P. Kodandaramayya
18. Sri Raja Krishnam Raja Bahadur
19. Sri T. Lakshminarayana Reddi
20. Sri E. Nagayya
21. Sri R. Nathamuni Reddi
22. Sri M. Pothu Raju
23. Sri Kottapalli Punnayya
24. Sri Ayyapu Reddi
25. Sri D. Ramabrahmam
26. Sri P. Ramacharlu
27. Sri G. Ramaswami Reddi
28. Sri N. Ramulu
29. Sri M. Rangayya
30. Sri Rathnam
31. Sri Reddi Kamayya
32. Sri Chowdari Satyanarayana
33. Sri P. Sreeramulu
34. Sri B. Subba Rao
35. Sri Shaik Moula Saheb
36. Sri Nagineni Venkaiah
37. Sri Nakka Venkataiah
38. Sri B. P. Sesha Reddi
39. Sri G. Venkata Reddi
40. Sri P. Venkatasubbaiah
41. Sri R. Latchapatrudu

42. Sri V. Kodandarami Reddi
43. Sri T. N. Venkata Subba Reddi
44 Sri Reddi Jagannadham
45. Sri Kasim Venkata Reddy
46. Sri M. Matcharaju
47. Sri B. Appa Rao
48. Sri P. Narasimhappa Rao
49. Sri C. V. Suryanarayana Raju
50. Sri S. Ranganatha Mudaliar.

Ayes : 18 : Noes : 50.

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"For the words and figures '15th August 1947' in line 8, substitute the word and figure '1st October, 1953'."

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"In clause 3 for the word 'one lakh of rupees', substitute the words 'five lakhs of rupees'."

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"For the words 'three years' in the proviso, substitute the words 'five years'."

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"Add the following as Explanation III in Clause 3 :

*Explanation III :* Completion means completion of every minor work for taking water to the land'."

The amendment was lost.

Clause 3 was put and carried.

*Clause 4.*

MR. SPEAKER : The motion is :

"That clause 4 do stand part of the Bill."

SRI P. SUNDARAYYA : Sir I move :

"For the words 'one-half of the increase in value on account of the completion of the construction, expansion or alteration of the work' in lines 3 to 5, substitute the words 'rupees five per acre per year'."

The amendment was duly seconded.

SRI G. YELLAMANDA REDDI : Sir, I move :

"For the words 'one-half' in line 3, substitute the words 'one fourth'."

The amendment was duly seconded.

SRI G. YELLAMANDA REDDI : Sir, I move :

"In sub-clause (2) of Clause 4 add the following at the end :

'excluding the amount spent on the land by the owner'."

The amendment was duly seconded.

SRI P. SUNDARAYYA : Sir, I move :

"Delete Sub-Clause (2) including Explanation of Clause 4."

The amendment was duly seconded.

MR. SPEAKER : Now Clause 4 as well as the amendments are before the House for discussion.

Sri P. SUNDARAYYA :—ఈ విలువ ఏరీతిగా హానికరమైనదో భూములకు betterment levy వేయడంలో విలువ సిద్ధాంతం ఏ రకంగా అర్థం లేనిదో యిందాకే వివరించాను. అందుచేత ఎట్లా ప్రభుత్వానికి డబ్బు కావాలని కోరిక కాబట్టి యీ ప్రభుత్వానికి మళ్లా కొత్తయంత్రం అవసరం లేకుండా వెనుక బడిన ప్రాంతాలకు మరింత ఎక్కువ నష్టపడకుండా విలువసిద్ధాంతాన్ని తీసివేసి

ప్రభుత్వానికి డబ్బు కావాలి కనుక project ప్రాంతాలలో సాగయే భూమిమీద ప్రతిఒక్క ఎకరానికి సంవత్సరానికి 5 రూపాయలు వేయండి. ప్రతి ఎకరాకు 100 రూపాయలకు మించి betterment levy ఏ పరిస్థితిలో కూడా పడదన్నమాట ప్రభుత్వానికి డబ్బు కావాలంటే ఒక చిన్న సూత్రం.

ప్రభుత్వానికి డబ్బు కావలెను అంటే ఎకరానికి 5/- చొప్పున పన్ను వేస్తాము అనవచ్చును. ఈ ప్రొడక్షను సూత్రం తీసుకువచ్చి లేనిపోని గొడవచేసి రైతులను Compise చెయ్యడము. Complaints చెయ్యడం, Revenue Board కు appeals వెయ్యడము తప్ప ఇంకేమీ లేదు. ప్రభుత్వంకూడా ఎకరాకు 100/ రు. కోరడంలేదు. కాబట్టి, ఎకరాకు 5/- చొప్పున 20 సంవత్సరములలో తీసుకోన వలెనని, మా సవరణ అంగీకరించవలెనని ప్రభుత్వానికి ఏమీ అభ్యంతరం ఉండ కూడదని సూచిస్తూన్నాను. ఈ సవరణ అంగీకరిస్తే Complaints amendment ఇంకొకటి ఉన్నది. దానినిబట్టి Explanation తో సహా Sub clause (2) తీసివేయవలసి ఉంటుంది. ఆ సవరణకు అంగీకరించవలెనని నా ఉద్దేశము. మొదటి సవరణ అంగీకరిస్తే రెండవదికూడా Automatic గా అంగీకరించవలెనని నేను కోరుచున్నాను.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, నా amendment సరికాదు అన్నారు.

Mr. SPEAKER : It is admitted. You need not go into the question of admissibility. You may speak on your amendment.

Sri G. YELLAMANDA REDDI :—Clause (4 లో) Completion date తరువాత, ప్రాజక్టు కట్టడానికి ముందు మధ్యను, తరువాత పెరిగిన ధరలలో అర్థం ఇవ్వాలని ఉన్నది. ప్రాజెక్టు ప్రారంభించిన తరువాత రైతు భూమిని Repair చెయ్యడానికి ప్రారంభిస్తాడు కాబట్టి రైతు Repairs కు ఖర్చు పెట్టినడబ్బు Exclude చెయ్యవలెనని నేను మనవిచేస్తున్నాను. ఈవేళ Project Complete కాబోయేటప్పుడు రైతుభూమిని బాగుచేసుకోడానికి, గట్లువేసుకోన డానికి ప్రయత్నంచేస్తారు. కాబట్టి ఆ విధముగా ప్రభుత్వము మినహాయింపు చెయ్యక పోతే బాగుండదు. Excluding cost of repairs అనే Amendment ప్రభుత్వం అంగీకరించవలెనని నేను కోరుచున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI:—అధ్యక్షా, దీనిమీద ఒక్క విషయము మాత్రము చెప్పతలచుకున్నాను. సుందయ్యగారు చెప్పినట్లు ఇది పెర్మనెంటు అయితే ఎకరానికి ఇంత అనివేస్తే బాగుంటుంది. ఇది ఒకసారివేసి విడిచిపెట్టేది. యల్లమందారెడ్డిగారు confusion లో ఉన్నారనుకొంటాను. Improvements అంటున్నారు. Construction అయిన తరువాత మూడు సంవత్సరాల time ఉందికదా.

ఇంకో విషయం చెప్పాలి. దానిలో Not exceeding ½ అని ఉన్నది. యెల్లమందారెడ్డిగారు భాగ్యవంతులకు ఉండదని చెప్పేరు. ఆ aspersion న్యాయమైనదికాదు. ఎప్పుడుకూడా ప్రభుత్వం అట్లా చెయ్యదు. ఇదంతా భాగ్యవంతులనువదిలిపెట్టి తక్కినవారికి వేస్తారుఅంటె న్యాయంకాదు. యెల్లమందారెడ్డిగారికి అటువంటి భావాలు ఉండవచ్చునుగాని ప్రభుత్వానికి అటువంటి భావాలు లేవు. పేదవారి సౌకర్యంకోసం not exceeding 50% అన్నారు.

MR. SPEAKER : I will now put the amendments to the vote of the House. The question is :

"For the words 'one-half of the increase in value on account of the completion of the construction, expansion or alteration of the work' in lines 3 to 5, substitute the words 'rupees five per acres per year',"

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"In sub-clause (2) of Clause 4, add the following at the end :

'excluding the amount spent on the land by the owner'."

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"For the words 'one-half' in line 3, substitute the words 'one-fourth'."

The amendment was lost.

The second amendment of Sri P. Sundarayya need not be put.

Clause 4 was put and carried.

MR. SPEAKER : The motion is :

"That Clause 5 do stand part of the Bill."

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా రైతుకు విధిగా నోటీసు ఇవ్వాలని ఇందులో లేదు.

Mr. SPEAKER :—ఉండండి. Please read. It is there. "Separate notice to the same effect also will be served in the prescribed manner to all persons concenred." అని ఉంది.

Clause 5 was put and carried.

Clauses 6 to 10 were put and carried.

MR. SPEAKER : The motion is :

"That clause 11 do stand part of the Bill."

SRI P. SUNDARAYYA : Sir, I move :

"In sub-clause (1) of clause 11, for the words 'not exceeding twenty' in line 3 substitute 'not less than twenty but not exceeding thirty'."

The amendment was duly seconded.

SRI P. SUNDARAYYA : Sir, I move :

"For sub-clause (2) of clause 11 substitute the following :

'(2) No interest charge shall be levied on the amount of betterment contribution to be paid by an owner."

The amendment was duly seconded.

SRI P. SUNDARAYYA : With your permission, Sir, I want to add the words 'in any subsequent year' after the words '......land falls' in line 2 of my amendment.

MR. SPEAKER : Yes, you can move your amendment.

SRI P. SUNDARAYYA : Sir, I move .

"Add a new proviso (4) as follows :

'4. If the price level of the agricultural products produced on a particular land falls in any subsequent year compared to that of the year when the project is completed, the betterment levy shall be reduced in the same proportion."

The amendment was duly seconded.

MR. SPEAKER :—Now clause 11 as well as the amendments are before the House for biscussion.

SRI P. SUNDARAYYA :—మంత్రిగారు దానిని అంగీకరించరని అందరకు తెలుసును. మా కర్తవ్యం మేము చేయవలసిఉంటుంది. మొదటి క్లాసులో 20 వాయిదాలకు మించకుండా వసూలుచేస్తాము. Betterment levy అంతా కూడాను అని బిల్లులోఉంది. మా సూచన ఏమంటే 20 వాయిదాలకు తక్కువ కాకుండా, 30 వాయిదాలకు మించకుండా వసూలు చేయాలనిచెప్పి మా సవరణ. వేశేది వేశారు, కొంత ఎక్కువకాలం ఇవ్వండి వాయిదాలకు. అందుచేత ప్రతి సంవత్సరం కొంచెం తక్కువ, చెల్లించుకొని, బయటపడడానికి వీలు ఉంటుంది. అని 20 వాయిదాలుచాలవు, 30 వాయిదాలు ఇవ్వమని అన్నాము. ఇది కొత్తకోరిక కాదు ఇదివరకు ఈ ఆంధ్రప్రభుత్వమే కాంగ్రెసు మంత్రివర్గం తెచ్చిన బిల్లులో 30 annual instalments అని అంగీకరించింది. ఈ రోజు ఎందుకు అంగీకరించదు ? అందుచేత ఆ సవరణ చాల న్యాయమైన సవరణ ప్రభుత్వానికి నష్టంవచ్చే సవరణకాదు. అందుచేత దానిని అంగీకరించడం, చాలా సబబుగ ఉంటుందనిచెప్పి కోరుతూఉన్నాము. తరువాత రెండవ సవరణ ఏమంటే, ఈ betterment levy మీద వడ్డి వసూలుచేయడం ఏరీతిగా సరియైనదికాదు. అందుచేత వడ్డి వసూలు చేయవలసిన అవసరంలేదని అంటూఉన్నాము. ప్రభుత్వం ఏమైనా అప్పుఇస్తుందా ? వడ్డివసూలు చేసేదానికి ? ప్రభుత్వం అప్పు ఇచ్చింది కాదు ఇది. Project కట్టుతూఉన్నాము. ప్రాజెక్టు కోసము నీటీ తీరువవేస్తూ

ఉన్నాము. అన్నపుడు అభివృద్ధి తర్వాత జరిగింది. కాబట్టి రైతు అమ్ముకొంటే వారిదగ్గరనుంచి ఇయ్యకపోతే అప్పుక్రింద చూడవచ్చును. అమ్ముకోకుండా సాగుచేస్తున్న రైతుమీద ప్రతి సంవత్సరం కొద్ది కొద్దిగ వస్తుందిగాని, 5 వందల రూపాయలుఉన్న ఎకరం 15 వందలకే పెరిగింది అనుకోండి ఆ 1000 రూపాయలు రైతు చేతిలో ఏమైనాఉందా ? దానిలోవచ్చే ఆదాయం సంవత్సరానికి కొంతకొంతవస్తూఉంది. దానికి capitalised విలువగాని, ప్రతిసంవత్సరం వచ్చేదికాదు. ఇపుడు వాయిదాపోప్పున తనకువచ్చే ఆదాయంలో కొంతభాగము ఇస్తున్నాడు. అదిఏదో ప్రభుత్వం అప్పుయిచ్చినట్లు గాని, ఆఅప్పుకు మళ్లా వడ్డికట్టమనిచెప్పి అడగడం ఏరీతిగా న్యాయంకాదు. అందుచేత వడ్డిఅనేది లేకుండా చేసినట్లయితే కాస్తభారం తగ్గుతుంది. ఇది కొత్త సిద్ధాంతంకూడాకాదు. రేపు విశాలాంధ్ర మనకుఉంది. ఏకగ్రీవంగా తీర్మానం చేశాము. Hydrabad లో మనము కలువబోతున్నాము. Hydrabad లో కూడ ఈ betterment levy చట్టంలో ఈ interest అనేదిలేదు. అందుచేత రేపు ఎట్లయినా ఈబిల్లు యిప్పుడు pass అయినా యింకా మూడుయేండ్లకుగాని మనము వసూలు చేయడానికి సాధ్యంకాదు. వచ్చేసంవత్సరం విశాలాంధ్ర రాబోతుంది. వచ్చినపుడు విశాలాంధ్రలో ఉన్నటువంటి Hydrabad ప్రాంతములో ఈ వడ్డికట్ట నవసరంలేదని ఆ బిల్లులుఅన్నీమార్చి, మీరుకూడ వడ్డికట్టమని చెప్పాలి. ఇదేనా మనం తెలంగాణావాళ్ళకు యిచ్చినహామీ ? కొత్తపన్నులు వేస్తామనేనా మనం ఆరంభంతోనే మొదలుపెట్టడం. ఇపుడు దానినికూడా మార్చుకోవలసి ఉంటుంది. వడ్డిలేకుండా ఉండాలంటే. ఎందుకంటే వాండ్లకు ఒకపద్ధతి మనకు ఒకపద్ధతి ఉండడం న్యాయంకాదు, కాబట్టి ఒకేభాగంలో. ఆ కారణంచేత చూచినప్పటికికూడాను, తెలంగాణా, వాండ్లను మీరందరుకూడా చెల్లించమనిచెప్పి, మా విశాలాంధ్రకువచ్చిన లాభం ఇదిఅని మనంచెప్పలేము. కాబట్టి, ఆ దృష్టితో చూచినప్పటికికూడ, వడ్డిని యీ బిల్లునుంచి తీసివేయడం మంచిది. ఈరోజు తీసివేయకపోయినా, సంవత్సరానికైనా, తప్పదు. మళ్ళా యింకొక amending bill లో వచ్చి యీగొడవఅంతా పడేదానికిబదులు, యిప్పుడే ఆవడ్డిని తీసివేయమని చెప్పి, అంగీకరించమనడం చాల న్యాయముగ సబబుగ ఉంటుంది. ఉన్న సమస్య అంతా ఏమిటంటే, మంత్రిగారికి, మంత్రివర్గంఅంతా యిక్కడ లేకపోయేటప్పటికి వాండ్లను సంప్రదించుకో డానికికూడా వీలులేకుండా ఉన్నది. ఈ మంత్రిగారు మరి యేఒక్క మంత్రిగారుకూడ స్వంత బాధ్యతమీద చేసేదానికి తయారు కావడంలేదు.

THE HON. SRI K. CHANDRAMOULI :—ముగ్గురము ఉన్నామండీ.

SRI P. SUNDARAYYA :—ముగ్గురుఉంటే ఎట్లాంటి యేడుగురు మంత్రులకు.

THE HON. SRI K. CHANDRAMOULI :—నేను చెప్పితే వింటారండీ.

Sri P. SUNDARAYYA :—అట్లయితే అంగీకరించండి. మీకు అర్థం తరం లేకపోతే.

తర్వాత మూడవసవరణ. betterment levy యిప్పుడు ధరలనుబట్టి వేస్తున్నామని చెప్పారు. project ఆరంభించేటప్పుడు, project పూర్తిఅవుతుండగానే ధరలుచూచి, దానినిబట్టి విలువఉంటుంది. కాబట్టి ఆ విలువనుబట్టి betterment levy వేస్తామన్నారు. ధరలుపడితే ఏమిచేయాలి? అనేసమస్య వస్తుంది. పడిపోయినపుడు స్వతఃసిద్ధంగానే దానిని తగ్గించవలసి ఉంటుంది. దానికి ప్రభుత్వం ఒకటిచేయవచ్చును. ఎట్లా మీకు అధికారంఉంది. ధరలు పడిపోతే remission యిచ్చే powers ఉన్నాయి. పన్నులు వేసేదానికి Taxation Enquiry Committee report పెద్ద వేదంలాగా, Bible లాగా, Koran లాగా, భాగవతం లాగా, ప్రతిపర్యాయం quote చేస్తే మీకు మీ Bible అప్పచెప్పతాము. కాస్త జాగ్రతగచూచి అమలుజరుపమని నేను చెప్పుతూ ఉన్నాను. ఈ betterment levy సందర్భంలో,

"A sharp decline in agricultural prices will reduce incomes from lands and the payment of annual instalment of betterment levy may be rendered difficult. No provision for meeting such a situation seems to exist in the various State enactments, although the need for remissions is recognised when there is a breakdown in supply or the area is water-logged, etc. The Andhra Bill empowers Government to exempt any case or class of cases from the operation of the levy when its enforcements causes hardship. This gives wide discretion to the State Government. It would be advisible in our view for all states to provide for specific relief in times of

steep price fall. The relief should ordinarily take the form of postponing the instalments, and where the decline in prices is steep and continuous for a number of years outright remissions may, we consider, have to be granted." అని వ్రాశారు.

Clear గ ఇక్కడ ఆ provision లేదు. ఆ provision యివ్వండి. కేవలం discretionary powers తోనే సంతృప్తిపడితే చాలదు. అనే ఉద్దేశంతో taxation enquiry committee చెప్పారు. అందుచేత ప్రభుత్వం, అట్లా ధరలు పడిపోయినపుడు, మేముమాత్రం కసాయిహృదయం గలవాండ్లమా, మేము ఖచ్చితంగా రైతులయొక్క లాభంకోసం ఈబిల్లు తెస్తున్నప్పుడు, తప్పకుండ remision యిచ్చేదానికి తయారుగనే ఉంటామని చెప్పవచ్చును. అప్పుడు యీ ప్రభుత్వమే ఉంటుందో ? యింకా ఏప్రభుత్వాలు వస్తాయో, అవిఅన్ని సమస్యలతో కూడినటువంటివి. ఈ మంత్రివర్గం ఆరోజు ఉండకపోవచ్చును. అందుచేత ఏమిటి అన్నట్లయితే, ముఖ్యంగా విశాలాంధ్రవస్తుంది. ఎవరుఉంటారు, ఎవరు ఉండరు, అనికూడ అనేక సందేహాలు ఉంటున్నాయి. ఆ సందర్భాలలో కనీసం ధరలు పడిపోయినపుడుఅన్నా ఆ ధరలు పడిపోయిన దామాషాన, ఆ సంవత్సరం betterment levy ని ఆ సంవత్సరానికి తగ్గించమని చెప్పేటటువంటి నాసవరణ చాల న్యాయమైనసవరణ, ప్రభుత్వానికి యేరితిగా నష్టంవచ్చేదికాదు. కనీసము వాండ్లుచెప్పిందే దీంట్లోపెట్టమని చెప్పితే, దానికికూడ వాండ్లు ఎందుకు నిరాకరించినారో అర్థముకాదు. కనీసము దానినైనా అంగీకరిస్తారని కోరుతూ నేను ముగిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ వడ్డి విషయంలో నాకు లెక్కలలో కాస్త అనుమానం వస్తుందండీ. ఏమంటే, మొట్టమొదటి సంవత్సరం ఇచ్చేటట్లయితే మొత్తం డబ్బు, దానికి 10% తగ్గిస్తామన్నారు. అంటే ఇతను ఇవ్వవలసింది ఏమన్నా 90% రూపాయలో లేక 100 రూపాయలో, తేలటం లేదు. నూరు రూపాయలైతే ఆరోజు అతను ఇస్తే దానిని తగ్గించవలసిన అవసరంలేదు. అతను ఇవ్వవలసింది ఆ రోజు 100 రూపాయలైతే ఆ తర్వాత దాని మీద వడ్డి ఏమన్నా వసూలు చేయండి బాగా ఉంది. దానిని తగ్గిస్తే అడుగుతాము. అతనిమీద వేసిన tax ఎంత ?

MR. SPEAKER :—It will be an incentive for advance payment.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, Advance payment మీద వడ్డీ లేకపోవడమే incentive అందువల్ల అవతలివాడి మీదకూడ వసూలు చేసేటప్పుడు 90 రూపాయల మీదనే వడ్డీ వసూలు చేయవలెను. అని నాయొక్క అభిప్రాయము. 90% మీద ఎప్పుడైతే rebate తీసివేశారో ఆ rebate తీసిన amount లో మిగతా ఎంత ఉందో 9% దానిమీద ఏమన్నా rate వసూలు చేయవలసి ఉంటుంది-గాని ఇది న్యాయంకాదు. మీరు లెక్కలు ఎట్లా చూస్తారో నాకు తెలియదు. Incentive అనేపేరుతోటి మొత్తం ఒక్కసారే ఇవ్వమంటారా. వాడు ఇచ్చేటప్పుడు తగ్గిస్తున్నారు. Interest వసూలు చేస్తున్నారు. ఈ రెండింటికి తేడా ఏమిటో మీరు ఒక amount చెప్పండి. Extra amount తీసుకోండి. ఆ amount లో ఏమన్నా మీరు rebate ఇచ్చినపుడు అతనికి వెంబడే ఇచ్చారు గనుక సరిపోయింది. కనక తక్కిన వాండ్ల మీద వడ్డీ వసూలు చేయకండి. లేకుంటూరా, ఈ amount తరువాత ఇస్తామంటూరా, వడ్డీ వసూలు చేయండి. రెండింటిని కల్పడంలో అర్థంలేదు అందులో 90% మీదనే వెయ్యాలనిచెప్పి వడ్డీ ఇవ్వతలచుకుంటే ఆవిధంగా వసూలు చేయమని నేను కోరుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—అధ్యక్షా, రెండు, మూడు విషయాలు ఉన్నాయి. Not exceeding 20 years అంటే గడువు 30 ఏండ్లు వుండాలనిగాదు. ఇంతవరకు భారతదేశంలో ఏ రాష్ట్రంలో ఈ betterment levy bill తెచ్చినా 20 ఏండ్లు వ్యవధి ఎక్కడా నాకు కనపడడం లేదు. 20 ఏండ్లు చాలా ఎక్కువ time అనే నా ఉద్దేశ్యం. అభివృద్ధి పథకాలను అమలు జరపడానికి మనకు తొందరగా కావాలసివుంది. అందువలన ఈ 30 సంవత్సరాల గడువు కావాలనే సవరణను ఒప్పుకోవడానికి వీలులేదు. వడ్డి విధించడం గురించి శ్రీ గోపాలకృష్ణయ్యగారు ఒక విచిత్రమైనటువంటి argument తెచ్చారు. వడ్డి ఇవ్వనక్కరలేదు అని అంటే ప్రతిరైతు వాయిదాలలోనే చెల్లిస్తానంటాడు. అందువల్ల మనకు రాబడి తక్కువగా వస్తుంది. పెద్ద రైతు కూడ వాయిదాలమీదనే చెల్లిస్తాననే ప్రమాదంకూడ వుంది. వాయిదాలమీద చెల్లించ వచ్చుననే పద్ధతి సామాన్యులకు, పెద్దవాళ్లకొరకు పెట్టినటువంటిది కాని డబ్బు ఎక్కువగా ఉన్నవాళ్లను తొందరగా ఇప్పుడు కట్టనట్లయితే వాళ్లకు కొంత లాభం వుంటుంది. వాళ్లు వడ్డి కట్టనక్కరలేదు. అందువల్ల గోపాలకృష్ణయ్య గారు భయపడనక్కరలేదని మనవిచేస్తున్నాను. ధరలు పడిపోతే రైతులు చాల కష్టనష్టాలకు లోను గావలసివస్తుందనే వాదనవున్నది. Valuation కట్టేటప్పుడు

ప్రాజక్టును ప్రారంభించే రోజున పూర్తిచేసినటువంటి రోజున ఉన్న విలువలు తీసుకొంటాము. ఆ విలువలోని అభివృద్ధినిబట్టి levy ని నిర్ణయిస్తాము. ప్రభుత్వం అయినా సరే ధరలు పడిపోయిన సంవత్సరము ఇంత తగ్గిస్తాము ఈవిధంగా చేస్తాము. ఇది ఇంత percentage తగ్గిస్తాము. లేక పేదవారికి ఇంత తగ్గిస్తాము; భాగ్యవంతులకు ఇంత తగ్గిస్తాము; అని చట్టాలు ఎప్పుడూ పెట్టరు. అయినప్పటికి ఇది కేవలం ఒక విధమైనటువంటి పన్నుకాదు కాబట్టి 16 వ clause లో exemption ఉన్నది చూడవలసినది అని చెప్పి నేను వారిని కోరుతున్నాను. దానిలో ఈవిధంగా ఉన్నది.

"If, in the opinion of the Government.........enforcement of all or any of the provisions of this Act will cause hardship in any case or cases, the Government, may by notification, setting out the ground therefor, exempt either permanently or for a specified period, such case or cases from all or any of the provisions of this Act, subject to such conditions, if any, as the Government may deem fit to impose."

దానిలో అన్ని విషయాలు స్పష్టంగా ఉన్నాయి. కాబట్టి ఈ సవరణను ఆమోదించడానికి వీలులేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, ఇందాక మంత్రిగారు చెప్పుతూ భారతదేశంలో ఎక్కడా 30 instalments పెట్టడంలేదు అని చెప్పారు.

THE HON. SRI K. CHANDRAMOULI :—అందువల్ల వారివాదనకు ఆధారము లేదని చెప్పాను. భారతదేశంలో ఏ రాష్ట్రంలోను 30 instalments లేవు.

MR. SPEAKER : The question is :

"In sub-clause (1) of clause 11, for the words 'not exceeding twenty' in line 3 substitute 'not less than twenty but not exceeding thirty.'"

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"For sub-clause (2) of clause 11, substitute the following :

'No interest charge shall be levied on the amount of betterment contribution to be paid by an owner."

The amendment was lost.

MR. SPEAKER : The question is :

"Add a new proviso (4) as follows :

' 4. If the price level of the agricultural products produced on a particular land falls in any subsequent year compared to that of the year when the project is completed, the betterment levy shall be reduced in the same proportion."

The amendment was lost.

Clause 11 was put and carried.

Clauses 12 to 15 were put and carried.

Mr. SPEAKER : The motion is :

" That clause 16 do stand part of the Bill. "

The HON. Member Sri pillalamari Venkateswarlu has given notice of an amendment regarding fall in prices of staple crops. It does not arise and I am ruling it out of order. Sri G. Yellamanda Reddi will move his amendment.

3rd December 1955]

SRI G. YELLAMANDA REDDI : Sir, I move :

" Add the following at the end : 'and whenever Land Revenue Remission is given, remission for betterment levy also be given."

The amendment was lost.

The amendment was duly seconded.

Mr. SPEAKER : The question is :

" Add the following at the end : 'and whenever Land Revenue Remission is given, remission for betterment levy also be given'."

Clause 16 was put and carried.

Clauses 17 to 19 were put and carried.

Mr. SPEAKER : The motion is : " That clause 2 do stand part of the Bill. "

SRI G. YELLAMANDA REDDI : Sir, I move : " Delete sub-clauses (ii) and (iii) in sub-clause (6) (a) of clause 2 "

ఈ Clauseలో bunds, tanks canals, chanels etc., అని పెట్టారు.

ఇవన్నీ works అని ఎలా నిర్వచనక్రిందకు వస్తాయో నాకు అర్థంకావడం లేదు. ఉంటే నీదేమిపోయింది అనిచెప్పి మంత్రిగారు అడగవచ్చు. Work యొక్క విలువకట్టేటప్పుడు property of Government అని పేరుపెట్టి work యొక్క విలువ లక్షరూపాయలు అని చెప్పవచ్చు.

The amendment was duly seconded.

THE HON. SRI K. CHANDRAMOULI :—ఎల్లమందారెడ్డిగారివంటి వాళ్లు రేపు ప్రొద్దున lakes, rivers మావేనంటారేమోనని Government property అని చెపుతున్నాము.

MR. SPEAKER :—On these things అని పైన ఉంటుంది. పైన చెప్పిన property లో అవన్నీ చెప్పబడినాయి. మళ్లీ property of Government అని అనటంలో నాకు ఒక సందేహంవచ్చింది.

MR. SPEAKER : The question is :

" Delete sub-clauses (ii) and (iii) in sub-clause (6) (a) of clause 2."

The amendment was lost.

Clause 2 was put and carried.

Clause 1 was put and carried.

The Preamble was put and carried.

THE HON. SRI K. CHANDRAMOULI :—Sir, I move :

" That the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955, be passed into law."

ఈ బిల్లుగురించి మాట్లాడవలసిన విషయాలు చాలావరకు అందరు మాట్లాడారు కాబట్టి ఇప్పుడు ఎక్కువ మాట్లాడదలచుకోలేదు. ఒక్కవిషయముమాత్రం నేను మనవి చేస్తాను. ఈ betterment levy అనేది కేవలం పేదవాళ్ళను బాధించడానికి, పేదరైతులను కష్టపెట్టడానికి తీసుకొని రాబడినటువంటిదికాదు. వెనుకబడినవారికి, పేదవారికి, సాధ్యమైనంత త్వరలో అభివృద్ధికలుగజేసి, వారిని వికాశవంతముగా చేయడానికే యీబిల్లు తీసుకురాబడినది. దీనినిగురించి అనేక తర్జనభర్జనలు జరిగినాయి. దీనిని అమలుజరిపే విషయంలోగాని, rules విషయంలోగాని, ఆపత్కాలములోఉండి, పన్నులు కట్టుకోలేనటువంటి వారి కేసులేవైనా ఉంటే, ప్రభుత్వము ఆటువంటివాటిలో ఎక్కువ ఉదారంగాఉంటూ, ఇంకా కట్టగలిగినవారి దగ్గర వసూలుచేయడానికి అవకాశంఉంటే అది వసూలుచేయడానికి ప్రయత్నచేస్తుందని మనవిచేస్తూ యీబిల్లు accept చేయవలసిందని కోరుతున్నాను.

MR. SPEAKER : Motion moved :

" That the Andhra Irrigation (Levy of Betterment Contribution) Bill, 1955, be passed into law."

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, ఈ బిల్లు బీదల అభివృద్ధి కొరకు తీసుకు రాబడిందని మంత్రిగారు చెబుతున్నారు. తరువాత కొన్ని కొత్త ప్రాజెక్టులు బీదలకోసం కడతామని చెప్పారు. బీదలకొరకు కడుతున్నామని, 4, 5 ఎకరాలు ఉన్నవారి మీదకూడ ఈ betterment tax వేస్తున్నారు. బీదలమీద పన్నులు వేసి బీదలకొరకు కడతామని చెప్పడం ఏ మాత్రం న్యాయంగాలేదు. బీదలు డబ్బు ఇస్తే మేము కడుతాము..

ధనవంతులమీద ఎక్కువగా వేసేదానికి మేము తయారుగా లేము అని చెప్పలేక అందరు బీదలే గనుక బీదలే ఇచ్చుకోవాలి అని ఒక ప్రక్క చెప్పుతున్నారు, రెండవ ప్రక్కన, instalments విషయం వచ్చేటప్పటికి, డబ్బు ఉన్నవాళ్లు వెంటనే కడితే, వాళ్లకు నూటికి 10 రూపాయలు rebate ఇస్తామని మంత్రిగారు నిర్మొగమాటంగా ఈ శాసన సభలోనే చెప్పారు. డబ్బు ఉన్న వాళ్లు ఇంకా కొంచెము కట్టుకొన్నా పరవాలేదు. గాని డబ్బు ఉన్నవారికే నూటికి 10 రూపాయలు తగ్గించేసి ఈవిధంగా వారికి ఇంకొక సౌకర్యం కలుగ జేస్తున్నారు. ఇవి బీదలకోసమే కడుతున్నామని చెప్పినప్పటికి, బీదవారికి అటువంటి సౌకర్యం లేక పోయింది. అంతేకాకుండా, ఈ నీటి తీరువ betterment levy, మరమ్మతు ఖర్చులు, అప్పులు వగైరాలన్నికూడ ఈ బీదలమీద పడుతున్నాయంటె, బీదలు ఆ ఉన్న భూములను కూడ ఏ ధనవంతులకో; భూస్వాములకో అమ్ముకోవడమో లేక లెక్కట్టుకోవడమో జరుగుతుందిగాని మరేమీకాదు. ఆవిధంగా వారి భూములను రామార్పణంచేసి వ్యవసాయకూలీలకంటే అష్ట దరిద్రులవుతారు. ఒక చిన్న ఉదాహరణం చెప్పుతాను. South Africa లో బీదలచే నిర్బంధంగా పని చేయించేందుకు, వారుజీవిత పర్యంతము బానిసలుగా ఉండేటట్లు ఒకొక్కరికికొన్ని పెనులని poll tax వేసి అది చెల్లించవలెనంటె వారు గనులలో శాశ్వతంగా Contract labour క్రింద పనిచేసుకోవలసిన పద్ధతి వారికిపట్టింది. అదే విధముగా ఇక్కడ ఇంత విపరీతమైన పన్నులు బీదవాళ్ళమీద వేయడమంటె అవి చెల్లించుకోలేక వారికి ఈరోజుఉన్న కొద్దిపాటి భూములుకూడ అమ్మివేసి, ఈ ధనవంతులకు, భూస్వాములకు వ్యవసాయకూలీలై, వారికి నానాచాకరీచేయడం జరుగుతుంది తప్పితే మరేమికాదు. ఈ బీదలయొక్క లాభముకొరకు ప్రాజెక్టులు కడతామన్నారు. అందుకు సంతోషమే. కాని అవి బీదలలాభముకొరకు కాకుండా, ధనవంతుల లాభముకొరకు, ఉపయోగపడుతున్నాయి. బీదలమీద పన్ను వేస్తున్నారు. బీదలమీద పన్ను వేస్తేనేగాని ఈ Projects కట్టలేమని అంటున్నారు. ఈ పొరపాటు ధోరణి ప్రభుత్వము మార్చుకోలేనంత కాలము బీదలకోసం మీరు పనిచేస్తారని మాకు మాత్రం ఆశలేదు. ఇది మీరు చేసేచట్టాలవల్ల స్పష్టంగా కనిపిస్తుంది. అందుచేత ఈ బిల్లును వ్యతిరేకించక తప్పదు.

**Mr. SPEAKER:** The question is: "That the Andhra irrigation (Levy of Betterment Contribution) Bill, 1955, be passed into law."

A poll was demanded, and the Members who were for the motion were counted as 48, and the Members who were against the motion were counted as 18.

The motion was carried and the Bill was passed into law.

Mr. SPEAKER : The House will now adjourn and meet again at 11 A.M. on Monday, 5th December 1955.

The House then adjourned.